THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్

ESTABLISHED 1984 | సంపుటి 34 | 6.4.2018 | సంచిక 40

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

Nothing can be achieved without purity of mind

సీరియల్స్



కథలు





ముఖచిత్రం శృతిహాసన్
Courtesy : HELLO!

### శీర్షికలు



### స్పెషల్ ఫీచర్స్



## పెద్దమనసు

అది మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికాలో ఉంటున్న సమయం. ఆయనింకా స్వాతంత్ర్య సంగ్రామంలో అడుగుపెట్టనేలేదు. కానీ సత్యాగ్రహశాస్త్రాన్ని అక్కడే ప్రయోగించడం, సఫలత పొందటం జరిగింది.

ఒకసారి గాంధీజీ లండను వెళ్ళేపని పడింది. సత్యాగ్రహంతో విజయాన్ని సాధించినఆయన్ని అక్కడవుండే భారతీయ విద్యార్థులు చూడాలని తహతహలాడారు. భారతీయ విద్యార్థిబృందం నాయకుడు ఓ సన్మానసభను ఏర్పాటుచేసి గాంధీజీని అధ్యక్షుడిగా ఆహ్వానించాడు.

సన్మానాన్ని తలపెట్టిన బృందం భోజనాలు కూడా ఏర్పాటుచేసింది. అందరూ తిన్న పళ్ళాలను కొందరు విద్యార్థులతోపాటు ఓ యువకుడు కూడా శుభ్రంచేస్తున్నాడు.

ఇంతలో విద్యార్థి సంఘనాయకుడు వచ్చి ఎంగిలిపళ్ళెం కడుగుతున్న యువకుడ్ని చూసి షాకయ్యాడు.వెంటనే తేరుకుని"గాంధీజీ మీరు, మీరీ పనిచేయడమేమిటి?క్షమించండి" అంటూ చేయిపట్టుకుని వేదికపైకి తీసుకువెళ్ళాడు.

వేదికపైకి చేరగానే విద్యార్థినాయకుడు సభాముఖంగా గాంధీజీని క్షమాపణ కోరాడు.

"మిత్రమా! బాధపడకు. నాకు ఈ పనిని ఎవరూ పురమాయించలేదు. నేనే స్వయంగా ఇష్టపూర్వకంగా చేశాను. గతంలో ఎవ్వరూ నన్ను చూడకపోవటాన గుర్తించలేకపోయారు.

అంతేకానీ మరేమీకాదు.మనం మన కుటుంబాలలో ఈ పనులన్నీ చేసుకుంటూనే వుంటాం కదా!ఇదీ ఓ కుటుంబంలా అనిపించింది. మన స్ఫూర్తిగా చేశా. ఈ మాత్రం చిన్నపనిని చేయకూడదా.అనవసరంగా బాధపడకు" అతని వీపు తట్టి సముదాయించారు గాంధీజీ.

-పండిత శ్రీరామశర్మ ఆచార్య

చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 2431862 2434017 Advt. 2431233 Mktg. 2433938 Fax: 0866-2430433



## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక

కొత్త సీరియల్ 'వేట' ఆదిలోనే ఆకట్టుకుంది. మిగిలిన సీరియల్స్, ఫీచర్స్, కథలు ఉగాది పచ్చడిలా షడ్రుచులతో అలరించాయి.

డి.అభిలాష సాంబమూర్తి నగర్

తెలుగు సంవత్సరాది ముందుగానే పాఠకుల ముంగిళ్ళలోనికి 'యుగపురుషునికి స్వాగతం' ముఖచిత్రం ఎన్నో కాంతుల వెలుగు తెచ్చింది. 'సర్వోత్తమం ఉగాది పర్వదినం' ఫీచర్‌లో మాకు తెలియని విషయాలకు వేదికైంది.

శ్రీ విలంబి నామ సంవత్సరంలో 'మీ యోగక్షేమాలు' మా ఇంటిల్లిపాదీ అన్ని రాశులవారికి ఉపయోగపడే సూచనలు తెలుసుకున్నాం.

'వేట' సీరియల్ ప్రారంభంలోనే ఆసక్తి కలిగించింది. గుండ్రాయుడు నలుగురి ప్రాణాలను కాపాడడంకోసం తన ప్రాణాలను పణంగా పెట్టి చేసిన సాహసం 'గుండ్రాయుడి' కథలో కన్నీళ్ళు తెప్పించింది.

జి.వి.మురళీమోహన్ ముచ్చుమిల్లి

### సాక్షి 23.3.2018

'సర్వోత్తమం ఉగాది పర్వదినం' ఫీచర్ సర్వోత్తమంగా ఉంది.

మనదైన సంవత్సరాది ప్రాశస్త్యం, ఉగాది పచ్చడి ప్రాముఖ్యంతోపాటు వివరించిన ఐదు గొప్ప దినాల వైభవం ఆకట్టుకుని ఆలోచింపజేసింది.



వచ్చేవారం స్పెషల్ **అమ్మో భయాలు**

సర్వులకు శ్రీరామనవమి శుభాకాంక్షలు తెలుపుతూ, శ్రీరామనవమి వైశిష్ట్యం, ముఖ్యంగా స్త్రీ-పురుష స్వభావం, దాసుల్లో రకాలు, వారి స్వభావంలతోపాటు స్త్రీ-పురుషులు పాటించాల్సిన మార్గదర్శక సూత్రాలు అందించిన స్వాతికి అభినందనలు.

పి.నరసయ్య హైదరాబాద్

# ఇది మంచి సమయం



**29.3.2018 నుండి 4.4.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, వసంతఋతువు, చైత్రమాసం, శుక్లపక్షం. 1.4.2018 నుండి కృష్ణపక్షం.**

**29.3.2018 గురువారం**
తిథి: త్రయోదశి రా. 9.23 వరకు
నక్షత్రం: మఘ ప. 8.39 వరకు
వర్జ్యం: సా. 4.15-5.46 వరకు
దుర్ముహూర్తం : ప. 10.18-11.05 వరకు. మ. 3.00-3.47 వరకు
రాహుకాలం: మ.1.43-3.11 వరకు
మంచి సమయం : ఉ. 6.35-7.55 వరకు
సూర్యోదయం: 6.02కి
సూర్యాస్తమయం: 6.14కి

**30.3.2018 శుక్రవారం**
తిథి: చతుర్దశి సా. 7.35 వరకు
నక్షత్రం : పూర్వఫల్గుని ఉ. 7.27 వరకు
వర్జ్యం: మ. 2.22-3.54 వరకు
దుర్ముహూర్తం: ప.8.43 నుండి 9.30 వరకు. మ. 12.38-1.25 వరకు
రాహుకాలం: ప.10.47-12.15 వరకు
మంచి సమయం : ఉ. 6.50-7.20 వరకు
సూర్యోదయం: 6.01కి
సూర్యాస్తమయం: 6.14కి

**31.3.2018 శనివారం**
తిథి: పూర్ణిమ సా. 6.07 వరకు
నక్షత్రం: ఉత్తరఫల్గుని ఉ. 6.30 వరకు. హస్త తె. 5.56 వరకు
వర్జ్యం: మ. 2.42-4.16 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.21-7.55 వరకు
రాహుకాలం: ప. 9.19-10.47 వరకు
మంచి సమయం : సా. 5.00 నుండి 6.00 వరకు
సూర్యోదయం: 6.00కి
సూర్యాస్తమయం: 6.14కి

**1.4.2018 ఆదివారం**
తిథి: బహుళ పాడ్యమి సా. 5.05 వరకు
నక్షత్రం: చిత్త తె. 5.52 వరకు
వర్జ్యం: మ. 1.55-3.31 వరకు
దుర్ముహూర్తం: సా.4.36-5.25 వరకు
రాహుకాలం: సా.4.42-6.14 వరకు
మంచి సమయం : ఉ. 6.45 నుండి 8.20 వరకు
సూర్యోదయం: 6.00కి
సూర్యాస్తమయం: 6.14కి

**2.4.2018 సోమవారం**
తిథి: విదియ సా. 4.35 వరకు
నక్షత్రం: స్వాతి పూర్తి
వర్జ్యం: ప. 11.34-1.12 వరకు
దుర్ముహూర్తం : మ. 12.31 నుండి 1.20 వరకు. మ. 2.58-3.47 వరకు
రాహుకాలం: ఉ. 7.32-9.04 వరకు
మంచి సమయం : ఉ. 7.30 నుండి 8.15 వరకు
సూర్యోదయం: 5.59కి
సూర్యాస్తమయం: 6.14కి

**3.4.2018 మంగళవారం**
తిథి: తదియ సా. 4.44 వరకు
నక్షత్రం: స్వాతి ఉ. 6.22 వరకు
వర్జ్యం : మ. 12.14-1.55 వరకు
దుర్ముహూర్తం: ప. 8.26 నుండి 9.15 వరకు రా.10.57-11.46 వరకు
రాహుకాలం: మ. 3.10-4.41 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.59కి
సూర్యాస్తమయం: 6.15కి

**4.4.2018 బుధవారం**
తిథి : చవితి సా. 5.33 వరకు
నక్షత్రం: విశాఖ ఉ. 7.31 వరకు
వర్జ్యం: ప. 11.49-1.32 వరకు
దుర్ముహూర్తం : ప. 11.42 నుండి 12.31 వరకు
రాహుకాలం: మ. 12.06-1.38 వరకు
మంచి సమయం : సా. 4.00 నుండి 4.45 వరకు
సూర్యోదయం: 5.58కి
సూర్యాస్తమయం: 6.15కి

* మీ విశ్వాసం మిమ్మల్ని భద్రంగా ఉంచుతుంది.

# ఒక చిన్నమాట



సాధారణమైన శక్తిసామర్థ్యాలు లోపించినప్పుడు, సశక్తసమర్థ జీవితం గడపటానికి అన్నీ అవరోధాలే అవుతాయి. కాని గొప్ప సంకల్పం ఉన్నవాళ్ళు,మానసికశక్తిని ఆధారంగా చేసుకుని భౌతిక అవరోధాలను అధిగమించి ప్రపంచానికి ఎంతో మేథో సంపత్తినిచ్చి ధన్యులైనవారున్నారు.

క్రిస్టఫర్ నోలాన్ 'అబ్జర్వరు' పత్రికలో తనగురించి ఇలా రాసుకున్నారు "మెదడు దెబ్బతిన్న నా జీవితం సమర్థవంతమైన శరీరాలు గలవారి జీవితాలంత సామాన్యంగానే ఉందని చెప్పటం నా ముఖ్యోద్దేశం. నా మెదడు (డ్రయర్) ఆరబెట్టటానికి వేగంగా తిరిగే యంత్రంలా పనిచేస్తుంది.

నా బుర్రలో ఆలోచనలు ఎగురుతుంటాయి. అందమైన పదాలు లక్షలాదిగా జలపాతంలా నా ఒడిలో వాలుతుంటాయి.

నా చైతన్యంలో చిత్రాలు పేలుతున్నట్లుంటుంది. వాటిని క్రమపద్ధతిలో పెట్టే ప్రయత్నంలో నా మెదడు విస్తరణచూసి అబ్బురపడతాను. దొర్లిపడుతున్న ఆ హిమపాతానికి భావప్రకటన ఇచ్చే ప్రయత్నంలో బలంగా తలఊపుతూండటం ఎంత నిరాశాజనకంగా ఉంటుందో ఊహించండి" ఊహించగలమా?

మన సాధారణ మెదళ్ళలో భావాలే కొన్నిసార్లు మాటలకు అతీతంగా, అవగాహనకు ఆవలగా ఉంటాయి.

దెబ్బతిన్న మెదడులోని సంఘర్షణను అస్పష్టమైన, రూపరహితచిత్రంలా మన ముందుంచిన నోలాన్ మాటలు అద్భుతం కాదా? సాధారణమైన జీవితంలో భౌతికమైన అసమర్థతలూ మనల్ని వెంటాడుతాయి. కొన్ని పుట్టుకతోవస్తే మరికొన్ని బాల్యంలో వస్తాయి. మరికొన్ని యుక్తవయస్సులో వస్తాయి. నరాలకు, కండరాలకు సంబంధించినజబ్బులు ఎన్నో రకాలు. నా మిత్ర కుటుంబం ఒకటి, నా సహోద్యోగి కుటుంబం ఒకటి తమ సంతానంతో పడినబాధలు నాకు తెల్సు.తల్లులకు మరింత బాధ్యత, మరింత ప్రేమ, మరింత కరుణ.

రోజు రోజుకు క్రమంగా ఒక్కొక్క శరీర భాగం పనిచేయకపోవటం, ఆ నిస్సహాయత భరించటమే కాదు, సంతానాన్ని ప్రత్యేక దృష్టితో చూసినట్లు కాకుండా సాధారణమైన బిడ్డలను చూసినట్లేచూడాలి. వారి మనసుకు కష్టం కలగకుండా చూడాలి.

"ఇరవై ఏళ్ళకుమించి వీరు బతకరు" అని చిన్నప్పుడు డాక్టరు చెప్పిన చేదు నిజం వీరిని వెంటాడుతూనే ఉంటుంది. కండరాల జబ్బు బారినపడిన ఒక యువకుడు సివిల్ సర్వీస్ పరీక్షల్లో ఉత్తీర్ణుడై సమాచార సర్వీసులో చేరాడు.

ఆ అబ్బాయి అప్పటికే చక్రాల కుర్చీలో ఉన్నాడు. తనకోసం ప్రత్యేకమైన కారు కూడా రూపొందించబడింది. వారి బ్యాచ్ శిక్షణలో ఉన్నప్పుడు అతనితో పరిచయమైంది. ప్రశాంతంగా చిరునవ్వుతో ఉండేవాడు. ఆ జబ్బు గురించి వివరాలు అడిగాను.



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి

E-mail: jbhagyalakshmi43@yahoo.in

విద్యార్థిగా ఉన్నప్పుడు బడిలోచురుగ్గా ఉండేవాడట. వేగంగా పరుగెత్తేవాడట. ఆటలూ ఇష్టమే. కాని క్రమక్రమంగా స్కూలు బస్సుకువేగంగా చేరుకోవటం కష్టమైంది.నడవటం కష్టమైంది. అప్పుడే డాక్టర్లు కండరాలజబ్బుగురించి చెప్పారు. అధైర్యపడలేదు. చక్కగా చదువుకుని ఎప్పుడూ క్లాసులో ఫస్టు నిలిచేవాడు. సివిల్ సర్వీసులో ఉత్తీర్ణుడయ్యాక శిక్షణ సమయంలో కూడా ఒక క్లాసు తప్పకుండా హాజరయ్యేవాడు. ఏ ప్రశ్న అడిగినా అందరికంటే ముందు అతనే సమాధానం చెప్పేవాడు.

తనని తానుగా స్వీకరించు కున్న తర్వాత ఎవరైనా పరిహసించినా తనకు బాధ కలగదన్నాడు. సర్వీసులో అతనికి సాయం చెయ్యటానికి ప్రభుత్వం అతనిని డెప్యుటేషన్ మీద అమెరికాలో దౌత్యకార్యాలయంలో నియమించింది. వైద్యం కలిసిరాలేదు.

తాను నలభైలలో ఉండగానే మరణించాడు.ఇటువంటి వ్యక్తులు,వారి జీవితాలు మనల్ని కలచివేస్తాయి కాని వారి ఆత్మవిశ్వాసం, స్థైర్యం, జీవితాన్ని ఉన్నదున్నట్లుగాస్వీకరించి జీవించగల ధైర్యం మనకు ఎన్నో సందర్భాలలో స్ఫూర్తిదాయకంగా ఉంటాయి.

ప్రపంచఖ్యాతి చెంది ఎన్నెన్నో కొత్తవిషయాలను విజ్ఞానశాస్త్రంలో ఆవిష్కరించిన భౌతిక శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ మరణం తీరని లోటైనా ఆయన జీవితమే ఒక విజయకేతనంగా మన ముందు రెపరెపలాడుతుంటే చెయ్యెత్తి మొక్కాలనిపించదా?

స్టీఫెన్ విలియమ్‌హాకింగ్‌ను మాటల్లోవర్ణించటం కష్టం. ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌తో పోల్చదగిన శాస్త్రజ్ఞుడని ప్రతీతి. చక్రాలకుర్చీకి పరిమితమైనా అంతరిక్షం గురించి, ఖగోళం గురించి, కృష్ణబిలాల గురించి పరిశోధనలు జరిపి మానవాళికి తెలియని విషయాలు తెలియజెప్పిన మహామేధావి.

ఆధునికవిజ్ఞానానికి తండ్రిగా పేర్కొనే గెలీలియో మరణించిన 300 సంవత్సరాలకు జనవరి 8వ తేదీ 1942వ సంవత్సరంలో జన్మించిన హాకింగ్ ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ 139వ జన్మదినం రోజు మరణించటం యాదృశ్చికమేమోగాని ఆయనను ప్రశంసించేవారికి ఇదొక గొప్ప సందేశాన్నిస్తున్నట్టేననిపిస్తుంది.

ఇరవై ఏళ్ళు నిండగానే అమియోట్రోపిక్ లాటరల్ స్క్లెరోసిస్ అనే వ్యాధికి గురయి చక్రాలకుర్చీకే పరిమితమైనా,మరో రెండేళ్ళకు మించి బతకడని డాక్టర్లు చెప్పినా, హాకింగ్ మానసికశక్తో, దైవబలమో ప్రకృతి వరమో మరో యాభై ఆరేళ్ళు బతికి విజ్ఞానశాస్త్రానికి అమోఘంగా దోహదం చేశారు.

చెణుకులు, హాస్యోక్తులు, కొత్తకొత్త అనుభవాలతో స్టీఫెన్ హాకింగ్ ఆనందాన్ని పంచిపెట్టేవారు. తాను తానుగానే టీ.వీ. సీరియళ్ళలో కనిపించారు. ఒక నోబెల్ బహుమతిగాక తక్కిన గౌరవాలు, అవార్డులు, గుర్తింపులు అన్నీ పొందారు.

మాట లేక, కదలిక లేక ఉన్నా ఆధునిక సాంకేతిక పరికరాల సాయంతో కంప్యూటర్ గొంతుతో మాట్లాడేవారు.విస్తారంగా ప్రపంచ పర్యటనలుచేశారు.

2001లో భారతదేశానికి వచ్చినప్పుడు న్యూఢిల్లీ ఇండియా ఇంటర్‌నేషనల్ సెంటర్‌లో ఆయన దర్శన భాగ్యమూ కలిగింది. గొప్ప గ్రంథాలు రాసి మానవాళి మనుగడ గురించి ఎన్నో హెచ్చరికలు చేసిన హాకింగ్ 'డేంజర్,అహెడ్' అనే సంకేతమే ఇచ్చారు.దానిని అధిగమించే బాధ్యత మనదేకదా! ఈ మహామనిషికి,మహామేధావికి తలవంచి వినమ్రంగానమస్కరిద్దాం.

# క్యాన్సర్‌ను వీరు జయించారు... మీకూ సాధ్యమే



**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
Kurnool : 08518 273001
Guntur : 0863 2223300

ప్రముఖ క్రికెటర్ యువరాజ్ సింగ్ 2011 లో సెమినోమా (ఊపిరితిత్తులు, గుండె మధ్య కణితి) కి గురయినప్పుడు అందరూ ఆందోళనకు గురయ్యారు. ఆరోగ్యవంతమైన జీవనశైలి గడుపుతున్నా క్యాన్సర్ వస్తుందా? అని తర్వాత ఆయన ట్రీట్‌మెంట్ తీసుకున్నారు. పూర్తిగా కోలుకొని "The test of my life" అనే పుస్తకాన్ని రచించారు. ఇంతకు ముందులాగే ఆయన క్రీడా జీవితం గడుపుతున్నారు.

అనేక భాషల్లో నటించి ఎందరికో అభిమాన నటి అయిన మనీషా కోయిరాల, 2012లో ఒవేరియన్ క్యాన్సర్ (అండాశయాల క్యాన్సర్) కు గురయ్యారు. సర్జరి, తర్వాత ట్రీట్‌మెంట్స్ తీసుకుని ఇప్పుడు క్యాన్సర్ మీద అవగాహన కల్గించే అనేక కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు.

ప్రపంచ ప్రఖ్యాత సైక్లిస్ట్ లాన్స్ ఆర్మ్‌స్ట్రాంగ్ 16 ఏళ్ళ నుండే రేసుల్లో పాల్గొనేవాడు. 25 ఏళ్ళ వయస్సులోనే మెదడు ఊపిరితిత్తులు, ఇతర శరీర భాగాల్లో అంతా పాకిపోయి లేటుస్టేజ్‌లో టెస్టిక్యులర్ (వృషణాల) క్యాన్సర్ బయటపడినప్పుడు ఇక అందరూ ఆయన బతకటం చాలా కష్టం అనుకున్నారు. కాని పట్టుదలతో, ఆత్మస్థైర్యంతో అన్ని రకాల కాంబినేషన్‌తో ట్రీట్‌మెంట్ తీసుకుని ఆ మహమ్మారిపై విజయం సాధించారు. తరువాత ఆరుసార్లు టూర్ డిఫ్రాన్స్ సైక్లింగ్ ఛాంపియన్ షిప్ గెలుచుకున్నారు.

ఒకప్పటి సౌత్ ఆఫ్రికా దేశాధ్యక్షుడు, నోబెల్ శాంతి బహుమతి విజేత, భారతరత్న నెల్సన్ మండేలా PSA పరీక్షతో ముందే ప్రొస్టేట్ క్యాన్సర్‌ను పసిగట్టి ఏడు వారాలరేడియేషన్ థెరపి, తర్వాత 1990లో ప్రొస్టేట్ గ్రంథిని తొలగించుకుని ఆ క్యాన్సర్ నుండి విముక్తి పొందారు. 95 ఏళ్ళ వయస్సులో డిసెంబర్ 5, 2013లో ఊపిరితిత్తుల ఇన్‌ఫెక్షన్‌తో మరణించారు.

మనందరికి తెలిసిన నటి గౌతమి, గ్రామి అవార్డ్ దక్కించుకున్న పాటలరచయిత, గాతని షెరిల్ క్రో, జీన్‌మ్యూటేషన్ పరీక్షతో రొమ్ము క్యాన్సర్ వచ్చే అవకాశం ఉందని ముందే పసిగట్టి మాస్టెక్టమి చేయించుకున్న హాలివుడ్ నటి ఎంజెలినా జులి బ్రెస్ట్ క్యాన్సర్ మీద విజయం ప్రకటించిన చాలా మందిలో కొందరు.

ఇలా చెప్పుకుంటూ పోతే ఒకప్పటి మన ప్రెసిడెంట్ నీలం సంజీవరెడ్డి - 1977లో లంగ్ క్యాన్సర్‌ను, ఆసిన్ (నటి), మమతా మోహన్‌దాస్ (నటి & సింగర్), లీసారే (టొరంటో నటి) మోడల్, మల్టిపుల్ మైలోమాకు, స్టెమ్‌సెల్ ట్రాన్స్‌ప్లాంటేషన్ చేయించుకుని క్యాన్సర్‌ను ఎదిరించిన ప్రముఖులలో నిలుస్తారు.

ఇలా మనకు తెలిసిన ప్రముఖ విజేతలతో పాటు తెలియనివారు గుండె ధైర్యంతో జీవితంలో అనేక ఒడిదుడుకులతో పాటు క్యాన్సర్‌ను జయించిన విజేతలు ఎందరో. వీరిలో కొందరు జీన్ మ్యూటేషన్, ఇతర పరీక్షలతో ముందే ప్రమాదాన్ని గుర్తించి క్యాన్సర్ రాకుండా ట్రీట్‌మెంట్ తీసుకున్న వారైతే మరికొందరు శరీరమంతా పాకి ఇంక ఏ విధంగా ఆశలు లేవు అన్న స్థితి నుండి బయటపడి సాధారణ జీవితం గడుపుతున్నవారూ వున్నారు. ఇలాంటి విజేతలలో ఉండే లక్షణాలు ఏమిటి అని ఆలోచిస్తే, వారికి క్యాన్సర్ సోకింది అని తెలిసినా కుంగిపోకుండా మనో నిబ్బరంతో ఎదుర్కోవడమే. ముందుగా కొంత ఆందోళనకు గురయినా, తర్వాత వారు ఈ సమస్యను ఎలా ఎదుర్కోవాలి? ట్రీట్‌మెంట్స్ ఎలా తీసుకోవాలి? ఏఏ జాగ్రత్తలు పాటిస్తే మంచిది? ఆహారం పట్ల ఎలాంటి శ్రద్ధ తీసుకోవాలి? ఇలాంటి విషయాలలో చక్కటి అవగాహన పెంపొందించుకుని డాక్టర్ సలహాలు తప్పకుండా పాటిస్తూ, ట్రీట్‌మెంట్ తీసుకుంటూనే నటించిన వారు, నర్తించిన వారు, ఆటల్లో పాల్గొన్నవారు, పుస్తకాలు వ్రాసినవారు ఉన్నారు.

క్యాన్సర్ వ్యాధిగ్రస్తులవ్వటానికి ఖచ్చితమైన కారణం ఇది అని తెలియదు. ఈ వ్యాధికి గురయినవారిలో చక్కటి ఆరోగ్యవంతమైన జీవన శైలి గడుపుతూ ఉన్నవారు, దురలవాట్లకి లోనయినవారు, వయస్సుపై బడినవారు ఉంటారు. అయితే మనం చేయవలసిందల్లా మంచి జీవనశైలితో పాటు అవగాహనతో ముందే పసిగట్టగలగటం. ఏ క్యాన్సర్‌ను అయినా తొలి దశలో గుర్తిస్తే ఆ కణం మీద విజయం సాధించటమే తేలికే. పొగాకు ఉత్పత్తులు, ఆల్కహాల్ అలవాట్లు, అధిక బరువు, ఎక్కువ మంది జీవిత భాగస్వాములు ఉన్నవారికి ఈ ముప్పు మరింత ఎక్కువ అని అందరూ తెలుసుకుంటే మంచిది. పర్యావరణ పరిస్థితులు, వారు చేసే వృత్తి, వంశపారంపర్య లక్షణాలు, ఇతర మందులు, మానసిక ఒత్తిడి, అలవాట్లు, ఆహారపు అలవాట్లు, కాలుష్యం, ఇలా అనేక విషయాలతో ముడిపడి ఈ సమస్య వచ్చే రిస్క్ ఉంటుంది. అయితే మనలో చాలామందికి అవగాహన లేమితో పాటు అపోహలు అనవసరమైన అనుమానాలు ఈ సమస్య విషయంలో ఎక్కువే అని చెప్పుకోవచ్చు.

ఇప్పటి వైద్య విధానాలతో ఇతర దీర్ఘకాలిక వ్యాధులమీద, క్యాన్సర్ మీద పట్టు సాధించగలుగుతున్నారు. నయం చేయటం అన్ని సందర్భాలలో సాధ్యం కాకపోయినా అదుపులోకి బాగా తీసుకురాగల్గుతున్నారు. కీమోథెరఫీ మందులలో కొత్తదనాలు చోటు చేసుకుని వ్యక్తిగత చికిత్సా విధానాలు అందుబాటులోకి వస్తున్నాయి. సైడ్ ఎఫెక్ట్స్ చాలా వరకు తగ్గుతున్న ఈ కీమో మందుల ధరలు ఇంకా అదుపులోకి రావాల్సి ఉంది. ఇతర శరీర భాగాలమీద చాలా తక్కువ ప్రభావం చూపే రేడియేషన్ థెరఫిలు అందుబాటులోకి వచ్చేశాయి. VMAT, సైబర్‌నైఫ్ వంటి రేడియో రోబోటిక్ సర్జరీలతో దుష్ఫలితాలు గణనీయంగా తగ్గిపోయాయి. ఇక సర్జరీలు, శరీర భాగాలను తొలగించినప్పుడు చేసే రీకన్‌స్ట్రక్టివ్ సర్జరీలతో విప్లవాత్మకమైన మార్పులు చోటు చేసుకున్నాయి. చిన్న కోతతో చేసే సర్జరీలు కీహోల్ సర్జరీలు క్యాన్సర్‌కు చేయగలగటమే కాకుండా వెంటనే వారికి ఏమాత్రం ఆత్మవిశ్వాసం సన్నగిల్లకుండా తొలగించిన శరీర భాగాలను రీకన్‌స్ట్రక్టివ్ సర్జరీలతో తయారు చేయగలుగు తున్నారు.

తొలిదశలో కనుగొనగలగటం, అనుభవజ్ఞుడైన డాక్టర్‌ను సంప్రదించడం, మందులు, ట్రీట్‌మెంట్స్ కరెక్టుగా తీసుకోవటంతో పాటు వీలయితే వారి వృత్తులకు వెళ్లటం, కౌన్సిలింగ్, గ్రూప్ కౌన్సిలింగ్‌లకు హాజరు కావటం, యోగా, ధ్యానం వంటివి ప్రాక్టీస్ చేయటం, నలుగురితో ఉండటానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం చేస్తే మంచిది. క్యాన్సర్ అని తెలియగానే మానసిక కుంగుబాటుకు గురయి, ఆత్మహత్య ధోరణికి చేరువై, డిప్రెషన్‌కు గురయ్యేవారు, వారిలో ఎక్కువ శాతం స్త్రీలు ఉంటారు. కుటుంబ సభ్యులు, స్నేహితుల సహాయంతో మంచి ఆహారం తీసుకుంటూ, ఇతర వ్యాపకాలు పెంపొందించుకుని ట్రీట్‌మెంట్స్ తీసుకుంటే క్యాన్సర్‌ను జయించిన విజేతలు మీరూ కావచ్చు.

సంశేషం

# హెల్త్ టిప్స్

## మేలైన మునగ ఆకు

సాంబారు, రసంలో మునగకాయ ముక్కలు ఇష్టంగా తింటారు. మునగ ఒక ప్రత్యేకమైన వాసనను ఇస్తాయి, రుచిని కలిగిస్తాయి. మునగకాయతో పాటు మునగఆకులోనూ చాలా మేలుచేసే గుణాలున్నాయి. మునగ ఆకు వాడకం మనదేశంలో తగ్గగా విదేశీయులు అర్థంచేసుకుని మునగ ఆకును తెప్పించుకుని వాడుతున్నారు.

ఆయుర్వేదంలో మునగ ఆకుకున్న విశేషగుణాలను వివరించారు. నవీన పరిశోధకులు వాటిని ఇప్పుడు ధృవీకరిస్తున్నారు. మునగచేసే మేలైన అంశాలలో గుండె, రక్తపోటు, రక్తంలో చక్కెర నియంత్రణ వంటి అంశాలున్నాయి.

- రక్తనాళాల్లో అడ్డంకులను తొలగించటం చెయ్యగలదు మునగలోని జీవరసాయనాలు. గుండె జబ్బులురాకుండా కాపాడగల్గినది మునగాకు.
- మునగ ఆకులనుండి తీసిన పొడిలో క్వారెసెటిన్ అనే మూలకం వుంది. ఇది అధిక రక్తపోటును ఎటువంటి సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా తగ్గిస్తుంది.
- శరీరంలో క్షారగుణం స్థిరపరచగలిగిన శక్తి మునగ ఆకులో వున్నాయి. శరీరంలో చక్కెరలు పెరగటం వెనక శరీరంలోపల దెబ్బతినే క్షార, ఆమ్లగుణ సమతుల్యత దెబ్బతినటం వుంటుంది. ఆ సమతుల్యత మునగ ఆకు కాపాడుతుంది. డయాబెటిక్ ఇబ్బందులు తగ్గిస్తాయి. శరీరంలోని కొలెస్టరాల్‌ని స్థిరపరచగలిగిన గుణం మునగ ఆకు ఉంది. శరీరంలో ఆమ్ల గుణం పెరిగితే కడుపులో కణితలు వస్తాయి. అలాంటి కణితలు ఏర్పడకుండా మునగాకు క్షారగుణం సహాయపడుతుంది. ◆



## చిప్స్‌మీద మక్కువ

బంగాళాదుంప, అరటికాయ ఇలా పలురకాల పదార్థాలనుండి చిప్స్ తయారుచేస్తారు. ఇప్పుడు చిప్స్ ప్యాకెట్ దొరకని ప్రదేశం లేదు. చిన్నవయసులోనే చిప్స్ రుచి అలవాటవుతుంది.

పెద్దవారైనా ఒక్కసారి చిప్స్ రుచి చూస్తే వాటిని అలా నములుతూనే వుంటారు. చిప్స్ అంటే అంతగా ఇష్టపడటానికి, ఒక రకంగా వాటికిబానిసగా మారటానికి కారణం ఆ చిప్స్‌కున్న రుచి అనేవారు. చిప్స్‌ని నూనెలో బాగా వేయించి,దానిమీద తగినంత ఉప్పు,కారం,మసాలా పొడి చల్లి పలురకాల రుచుల్లో తయారుచేసి మార్కెట్ చేస్తున్నారు. ఆ ఆకట్టుకునే రుచులు మాత్రమే కారణం కాదంటున్నారు ఇంగ్లాండ్ పరిశోధకులు. అవి నమిలేటప్పుడు వచ్చే ధ్వని అసలు కారణమని వారు తేల్చారు.

చిప్స్ నమిలేటప్పుడు ఒక తమాషాగా ఏవో విరుస్తున్నట్టుగా ధ్వని వస్తుంది. ఇటువంటి ధ్వనే మనం తినే కారపూస, జంతికలు నములుతున్నా వస్తుంది. అందుకే వాటిని ఒక్కసారి తింటే అలా తింటూనే వుండాలనిపిస్తుంది. చెవులకు ధ్వని చేరకుండా చూస్తే జంతికలు, చిప్స్ తినటం తగ్గుతుందని తేల్చారు.

ఈసారి అలా ప్రయత్నించి చూడండి. ◆



## కొలెస్ట్రాల్ కాదు...

గుండెజబ్బులు, రక్తనాళాల సమస్యలన్నింటికీ మూలంగా పెరిగిన కొలెస్ట్రాల్ అని చెప్పేవారు. రక్తంలోని కొలెస్ట్రాల్‌ని కొలవటంద్వారా గుండెజబ్బుల హెచ్చరికలు జారీచేసేవారు.

అయితే కొలెస్ట్రాల్‌వల్ల వాస్తవ అనారోగ్య స్థితి తెలియదని, రక్తంలోని ఒమేగా 3 ఫ్యాటీ ఆమ్లాల స్థాయినిబట్టి ఆరోగ్యస్థితి అంచనా సరిగ్గా తెలుస్తుందన్నది కొత్త ఆలోచన.

అరవై ఏళ్ళు పైబడినవారిలో నాటివరకు గుండె జబ్బుల సమస్యలు లేనివారిని 2500 మందిని ఎంపిక చేసుకుని వారి ఆరోగ్యస్థితిని మరణం సంభవించేవరకు అధ్యయనం చేశారు.



ఆరోగ్యం మార్పులన్నింటినీ క్రమంతప్పక పరిశీలించినప్పుడు గుండెజబ్బులు, గుండెపోటు వంటి వాటిని సూచించేది రక్తంలోని కొలెస్ట్రాల్ కాదని, ఒమేగా 3 ఫ్యాటీ ఆమ్లస్థాయి అని నిర్ధారణ అయింది. ఈ ఆమ్లస్థాయి అధికంగావుంటే రక్తనాళ,గుండెసమస్యలు వచ్చే అవకాశం ముప్పై మూడు శాతం తక్కువగా వుంది.

# మూత్ర మార్గము సంక్రమణను (యూరినరీ ట్రాక్ట్ ఇన్ఫెక్షన్ (యుటిఐ)) గూర్చిన ముఖ్యమైన వాస్తవాలు

మూత్ర మార్గం అనేది మూత్రపిండాలు (మూత్రాన్ని ఉత్పత్తి చేసేందుకు రక్తాన్ని వడపోసేవి), మూత్ర నాళం (మూత్రపిండాల నుండి మూత్రాశయం వరకు మూత్రాన్ని తీసుకువెళ్ళే గొట్టాలు), మూత్రాశయం (మూత్రాన్ని నిల్వ ఉంచేది) మరియు మూత్రద్వారం (మూత్రాశయం నుండి బయటకి మూత్రాన్ని తీసుకువెళ్ళే గొట్టం) కలిగి ఉంటుంది. సాధారణంగా బాక్టీరియా (క్రిములు) ఈ ప్రదేశాలలో ఉండవు. బాక్టీరియా మూత్రాశయం లేదా మూత్రపిండాల లోనికి ప్రవేశించినప్పుడు సంక్రమణ ఏర్పడే అవకాశం ఉంది. బాక్టీరియా మూత్రద్వారం లోనికి ప్రవేశించి మూత్రాశయం వరకు ప్రయాణించినప్పుడు మూత్ర మార్గ సంక్రమణలు ఏర్పడతాయి. ఒక వేళ సంక్రమణ కేవలం మూత్రాశయంలో మాత్రమే ఉంటే దానిని బ్లాడర్ సంక్రమణ లేదా "సిస్టైటిస్" అంటారు. ఒకవేళ సంక్రమణ మూత్రాశయం గుండా మూత్రపిండాల లోనికి ప్రవేశించినట్లయితే దానిని మూత్రపిండ సంక్రమణ లేదా "పైలోనెఫ్రైటిస్" అంటారు. మూత్రపిండ సంక్రమణలకు ఒకవేళ వెంటనే చికిత్స చేయికపోయినట్లయితే, సంక్రమణ మూత్రపిండాలకు శాశ్వత హానిని కలిగించవచ్చు. అరుదుగా మూత్రపిండానికి జరిగిన హాని జీవిత కాలంలో ఆ తరువాత అధిక రక్తపోటు మరియు మూత్రపిండాల వైఫల్యానికి దారి తీయవచ్చు.

మూత్రాశయం సంక్రమణలు అత్యంత సాధారణమైన సంక్రమణలు, ఇవి మూత్ర విసర్జనలో మంట మరియు తరచుగా లేదా వెంటనే మూత్ర విసర్జన చేయాల్సిన అవసరం కలిగించవచ్చు మరియు క్రింది పొట్టలో అసౌకర్యం మరియు మూత్రంలో రక్తం పడటం కూడా ఉండవచ్చు. మూత్రాశయ సంక్రమణల కంటే మూత్రపిండ సంక్రమణలు తక్కువగా వస్తాయి మరియు అవి ఒకే రకమైన వ్యాధి లక్షణాలను కలిగించవచ్చు. కానీ అవి జ్వరం, వెన్ను నొప్పి మరియు వికారం లేదా వాంతులు కూడా కలిగించవచ్చు. మూత్రపిండ సంక్రమణలు చాలా తీవ్రమైన మూత్ర మార్గ సంక్రమణ రకం ఎందుకంటే ఒక వేళ వెంటనే చికిత్స చేయబడినట్లయితే, సంక్రమణ మూత్ర పిండాలకు శాశ్వతంగా హాని కలిగించవచ్చు. అరుదుగా మూత్రపిండానికి జరిగిన హాని జీవిత కాలంలో ఆ తరువాత అధిక రక్తపోటు మరియు మూత్రపిండాల వైఫల్యానికి దారి తీయవచ్చు.

మూత్రాశయం మరియు మూత్రపిండ సంక్రమణలు రెండూ పురుషులలో కంటే మహిళలలో చాలా సాధారణం. నియంత్రణ లేని మధుమేహ వ్యాధిగ్రస్తులు, రాళ్ళతో లేదా శరీరం లోపల కాథెటర్ ఉన్న రోగులు లేదా మూత్ర మార్గ నిర్మాణ సంబంధమైన మరియు క్రియాత్మక అసాధరణతలు, గర్భం, మోనోపాజ్ లేదా వీర్య కణ వినాశకాలు లేదా టాంపూన్స్ ఉపయోగించడం, బహుళ లైంగిక భాగస్వాములు కలిగిన వ్యక్తులు మరియు రోగ నిరోధక క్షీణించి ఉన్న రోగులలో మూత్ర మార్గ సంక్రమణ వచ్చే అవకాశం చాలా ఎక్కువగా ఉంటుంది.

మూత్ర మార్గ సంక్రమణలు నివారించడానికి యాంటిబయాటిక్స్ ఉపయోగించబడతాయి. అత్యుత్తమ యాంటిబయాటిక్ అనేది రోగి యొక్క వయస్సు, మూత్ర మార్గ సంక్రమణను కలిగించిన క్రిమి మరియు క్రిములకు ఉన్న నిరోధకత పైన ఆధారపడి ఉంటుంది. చాలా మంది మహిళలలో తక్కువ వ్యవధి యాంటిబయాటిక్స్ చికిత్సతో నయమయ్యే సరళమైన మూత్రాశయ సంక్రమణ ఉంటుంది. పురుషులలో మూత్రాశయ సంక్రమణలు ప్రోస్టేట్ గ్రంధిని కూడా ప్రభావితం చేయవచ్చు మరియు ఎక్కువ కాలం పాటు చికిత్స అవసరం ఉండవచ్చు. మూత్రపిండ సంక్రమణలు సాధారణంగా ఇంటి వద్దనే యాంటిబయాటిక్స్ ద్వారా చికిత్స చేయబడవచ్చు. కానీ చికిత్స సాధారణంగా ఎక్కువ కాలం పాటు ఉంటుంది. కొన్ని సందర్భాలలో మూత్రపిండ సంక్రమణలకు ఆసుపత్రిలో చికిత్స చేయవలసి ఉంటుంది.

కొంతమంది పెద్దవారు ముఖ్యంగా మహిళలు తరుచుగా మూత్రాశయం సంక్రమణలకు లోనవుతూ ఉంటారు మరియు ఏవైనా శరీర



నిర్మాణ సంబంధమైన సమస్యలు లేదా క్రియాత్మక సమస్యలు కారణమేమో అని నిర్ధారించడానికి మరిన్ని పరీక్షలు అవసరమవుతాయి. అటువంటి పరీక్షలు అనగా:

- **డయగ్నోస్టిక్ ఇమేజింగ్:** అల్ట్రా సౌండ్, సిటి స్కానింగ్, ఎంఆర్ఐ స్కానింగ్, రేడియేషన్ ట్రాకింగ్ లేదా ఎక్స్-రేస్ ఉపయోగించడం ద్వారా మూత్రమార్గాన్ని అంచనా వేయడం.
- **యూరో డైనమిక్స్:** ఎంత బాగా మూత్ర మార్గం మూత్రాన్ని నిల్వ చేస్తుంది మరియు విడుదల చేస్తుంది అనే దానిని గుర్తించడానికి ఒక ప్రక్రియ.

**సిస్టోస్కోపీ:** మూత్ర ద్వారం గుండా ఒక పొడవాటి మరియు సన్నని గొట్టం ద్వారా ఒక కెమెరా లెన్సును చొప్పించడం ద్వారా మూత్రాశయం మరియు మూత్ర ద్వారం లోపల చూడడం మరియు మూత్రం కల్చర్.

పునరావృత మూత్ర మార్గ సంక్రమణలతో ఉన్న




**డా॥ జ్యోత్స్న గుత్తికొండ**
ఎండి, ఎబి (యు.ఎస్.ఎ)
కన్సల్టెంట్ నెఫ్రాలజిస్ట్
**స్టార్ హాస్పిటల్స్, రోడ్ నెం.10,**
**బంజారహిల్స్, హైదరాబాద్.**


మహిళలకు గర్భనిరోధ ప్రక్రియలలో మార్పులు, ఎక్కువగా ద్రవాలు తీసుకోవడం మరియు లైంగిక చర్య తరువాత మూత్ర విసర్జన, మోనోపాజ్ వచ్చిన మహిళలో వెజైనల్ ఈస్ట్రోజెన్ వ్రాసుకోవడం లేదా నిరంతరంగా లేదా లైంగిక చర్య తరువాత ముందు జాగ్రత్త యాంటీబయాటిక్స్ ఉపయోగించడం లేదా సంక్రమణ యొక్క మొదటి సంకేతం అందిన వెంటనే స్వయం చికిత్స వంటి వాటితో సహా మూత్రాశయ సంక్రమణలు నివారించేందుకు చర్యలు తీసుకోవలసిందిగా సలహాలు ఇవ్వడం జరుగుతుంది.

**పునరావృత్త మూత్ర మార్గ సంక్రమణలు నివారించడం** - పునరావృత మూత్ర మార్గ సంక్రమణలతో ఉన్న మహిళలకు మూత్రాశయ సంక్రమణలను నివారించేందుకు క్రింది వానిలో ఒకటి లేదా అంతకంటే ఎక్కువ చర్యలు తీసుకోవలసిందిగా సలహా ఇవ్వడం జరుగుతుంది.

**గర్భ నియంత్రణలో మార్పులు** - తరచుగా మూత్ర మార్గ సంక్రమణలకు గురి అయ్యే మహిళలకు ముఖ్యంగా డయాఫ్రమ్ కూడా ఉపయోగించే వారికి ప్రత్యామ్నాయ గర్భ నియంత్రణ ప్రక్రియను ఉపయోగించవలసిందిగా సలహా ఇవ్వడం జరుగుతుంది.

**క్రాన్ బెర్రీ ఉత్పత్తులు** - తరచుగా వచ్చే మూత్రాశయ సంక్రమణలను నివారించేందుకు క్రాన్ బెర్రీ రసం, క్రాన్ బెర్రీ టాబ్లెట్లు లేదా డి - మానోస్వాదకం ఒక మార్గంగా సూచించబడతాయి.

**యాంటిబయాటిక్స్** - ఒక వేళ మీకు మరల మూత్రాశయ సంక్రమణలు వస్తూ ఉన్నట్లయితే మరియు ఇతర నివారణా ప్రక్రియలకు ప్రతిస్పందిచనట్లయితే నిరోధక యాంటీబయాటిక్ చికిత్స సూచించబడవచ్చు.

# మోడీకి కష్టాలు మొదలయ్యాయా!

కొత్తగా మార్కెట్‌లోకి అందమైన ప్యాకింగ్‌తో, చక్కని ప్రచార పదాలతో వచ్చిన వస్తువు ఏదయినా వినియోగదారులను ఇట్టే ఆకర్షిస్తుంది. అందరూ ఎగబడి కొంటారు. మార్కెట్‌లో సక్సెస్ అనే ముద్ర పడుతుంది.ఐతే ఆ సక్సెస్‌ని నిలబెట్టుకోవాలంటే ఆ వస్తువుకు నాణ్యత ఉండితీరాలి.

మార్కెట్‌లోకి వచ్చినప్పుడు చెప్పినవాటిని నిలబెట్టుకోవాలి. లేకుంటే క్రమంగా వినియోగదారులకు నమ్మకం పోతుంది. ఆ వస్తువుకు డిమాండ్ తగ్గి, అమ్మకాలు పడిపోతాయి. అలా ఒకసారి ప్రజల విశ్వాసం కోల్పోయిన బ్రాండ్ తిరిగి పాత ఇమేజ్‌ని సంపాదించుకోవటం చాలా కష్టమవుతుంది.

2014 నాటి నరేంద్రమోడీ బ్రాండ్ ఇమేజ్‌కి 2019 ఎన్నికలు సమీపిస్తున్న వేళ నరేంద్రమోడీ ఇమేజ్‌కి ఏర్పడుతున్న మసకను వివరించాలంటే ఆ వ్యాపార వస్తువు పోలిక తప్పదు. 2014 ఎన్నికల వేళ బి.జె.పి. పార్టీ తన ప్రధానమంత్రి అభ్యర్థి ఎవరు అనే ప్రశ్నకు నరేంద్రమోడీ మా అభ్యర్థి అని చెప్పటానికి కొంత తటపటాయించింది. సీనియర్స్ కొందరు అభ్యంతరం పెట్టారు. ఆయన పార్టీని విజయపథంలో నడిపించగలడా! అని సందేహించినవారున్నారు.

ఆయనతో కలిసి పార్టీలో పనిచేసినవారు, ఆయన పనితీరు గమనించినవారు కొన్ని ఇబ్బందులు వస్తాయన్న హెచ్చరిక చేశారు. అయినా వాటినన్నింటినీ నరేంద్రమోడీ అధిగమించగలిగాడు.

నరేంద్రమోడీ బి.జె.పి.కి కొత్త నేతగా అవతరించాడు. పార్టీ పెట్టిన విశ్వాసం వొమ్ము కానివ్వలేదు మోడీ. ప్రధానమంత్రి అభ్యర్థిగా పార్టీ అంగీకరించిన మరుక్షణం నుండే ప్రచారంలోకి దిగాడు.

తనకంటూ ఒక ప్రత్యేక ప్రచార బృందం, ఎత్తుగడలు వేసే నిపుణుల బృందాన్ని తయారుచేసుకున్నాడు.నరేంద్రమోడీ ఇమేజ్ నిర్మాణంలో అప్పుడు బి.జె.పి. పార్టీ మొత్తం కలిసి పనిచేసింది.

మోడీ తన బ్రాండ్‌ని అమ్మిన తీరు అద్భుతం. తన రాకతో మొత్తం పాలన మారిపోతుంది. పాలనలోని లోపాలు తొలగించబడతాయి. 70 ఏళ్ళుగా జరగని మహత్యాలన్నీ తాను చూపిస్తానన్నాడు.

మోడీ ప్రభుత్వం ఏమీ సాధించలేదు అనేందుకు వీలులేదు. పాలనా వ్యవస్థలోని లోపాలను చక్కదిద్దుతున్నారు. 'ఆధార్'ద్వారా ప్రభుత్వ నిధుల వృధాని అరికట్టగలిగారు. విదేశాంగ విధానం విజయవంతమయింది. విదేశాలలో భారతీయులకు నేడు ప్రత్యేక గుర్తింపు వచ్చింది.

అంతర్జాతీయ వేదికలమీద గతంలో దక్కని స్థానం నేడు భారత్‌కి దక్కుతున్నది. నరేంద్రమోడీ భారత్‌కి సరైన నేత అని విదేశీ నేతలంతా పొగుడుతున్నారు. ఇస్లామిక్ దేశాలు కూడా భారత్‌కి అనుకూలంగా వుంటున్నాయి. ఇజ్రాయిల్‌తో సంబంధాలు పెంచుకున్నా ముస్లిమ్ దేశాలు నిరసన తెలియచెయ్యటంలేదు. ఇది నిజంగా ఘనవిజయం. ఇక దేశీయంగా బి.జె.పి. ఎంతో ఉన్నత స్థితికి చేరింది.

ఒకనాడు కాంగ్రెస్‌కున్న అఖిల భారత పార్టీ అనే ఇమేజ్‌ని ఇప్పుడు బి.జె.పి సొంతంచేసుకుంది. వరస విజయాలతో మంచి ఊపుమీదున్నది. ఈశాన్య భారత రాష్ట్రాల్లో జమ్మూ-కాశ్మీర్‌లో అధికారంలోకి రావటం సామాన్యమైన విషయంకాదు.

త్రిపురవంటి కమ్యూనిస్టు కంచుకోటను బద్దలు కొట్టటం బి.జె.పి. మాత్రమే చెయ్యగలిగింది. తమ సిద్ధాంతానికి అఖిల భారత్ స్థాయిలో ప్రజామోదం పొందగలగటంలో బి.జె.పి., నరేంద్రమోడీ విజయం సాధించారు. అది గత నాలుగేళ్ళ విజయగాథ.

ఇక ఐదో సంవత్సర పాలన మొదలవబోతుంది. ఏ ప్రభుత్వానికయినా తమ పాలన చివరి సంవత్సరం కీలకం. ఈ చివరి సంవత్సరంలో ఏర్పరుచుకునే ఇమేజ్‌తోనే తిరిగి అధికారంలోకి రాగలుగుతారు. ఆ చివరి సంవత్సరంలో రాజకీయంగా వ్యతిరేకత మొదలైనా, ప్రజాభిమానం తగ్గినా ఇబ్బందులు మొదలైనట్టే లెక్క.

సరిగ్గా ఇప్పుడు నరేంద్రమోడీ ఎదుర్కొంటున్న ఇబ్బంది అటువంటిదే.నాలుగేళ్ళుగా తిరుగులేని నేతగా, ఇతరులు ప్రశ్నించేందుకు భయపడే ప్రధానిగా పేరుపొందిన మోడీ ఇప్పుడు పార్లమెంట్‌లో అవిశ్వాస తీర్మానం ఎదుర్కోవాల్సిన పరిస్థితి.

ఆ తీర్మాన ప్రతిపాదన చర్చకు రాకుండా చెయ్యగలిగినదంతా చేస్తున్నారన్న అపప్రధను మూటకట్టుకుంటున్నాడు. అవిశ్వాసంమీద ఓటింగ్ జరిగితే సొంత పార్టీవారే వ్యతిరేకంగా ఓటు వేసేందుకు సిద్ధంగా వున్నారన్న ప్రచారం ప్రతిపక్షాలు చేయగలుగుతున్నాయి.

సంఖ్యాపరంగా బలమున్నా ప్రతిపక్ష అవిశ్వాస తీర్మానం ఎదుర్కొనేందుకు ఎందుకు జంకుతున్నారనేది ప్రశ్న. పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు దాదాపుగా తుడిచిపెట్టుకుపోయినట్టే.

బడ్జెట్‌ని చర్చ లేకుండా ఆమోదింపచేసుకున్నారు. కీలక బిల్లుల విషయంలోనూ అదే తంతు. ఇదంతా రాజకీయ బలహీనతకు సంకేతాలు. ప్రతిపక్షాలు రెచ్చిపోయేందుకు అవకాశం ఇవ్వటం.

2014లో నరేంద్రమోడీని నాయకుడిగా అంగీకరించి కలిసి అడుగులు వేసిన పలు పార్టీలు ఇప్పుడు వ్యతిరేకంగా గళం విప్పాయి.

ఆంధ్రప్రదేశ్‌కి అన్యాయం జరిగిందన్న అంశంమీద టి.డి.పి. కేంద్ర ప్రభుత్వం నుండి, ఎన్.డి.ఎ. నుండి బయటకు వచ్చింది. అవిశ్వాస తీర్మానానికి పట్టుబడుతున్నది. పాతిక సంవత్సరాలకుపైగా బి.జె.పికి మిత్రపక్షంగా ఉన్న శివసేన రాబోయే ఎన్నికల్లో ఒంటరిగా పోటీ చేయబోతున్నట్టు ప్రకటించింది.

పంజాబ్‌లోని పాత మిత్రుడు అకాలీదళ్ కూడా తెగతెంపుల బాటలో ఉందంటున్నారు. బీహార్, యు.పి.లోని చిన్న పార్టీలు ఎన్.డి.ఎ.లో నుండి బయటకు వెళ్ళిపోయాయి. కొన్ని పార్టీలు యు.పి.ఎ.తో సహకరిస్తామంటున్నాయి. మిత్రపక్షాలు ఎందుకు దూరమవుతున్నాయి అనేది ప్రశ్న. మిత్రపక్షాలకు తగిన గౌరవం, భాగస్వామ్యం దక్కటం లేదనేది ఫిర్యాదు.

ఐన్‌స్టీన్ ప్రతిపాదిత సాపేక్ష సిద్ధాంతంకన్నా మెరుగైన సిద్ధాంతం వేదాల్లో వుందని స్టీఫెన్ హాకింగ్ చెప్పారు.
-హర్షవర్ధన్, కేంద్రమంత్రి



మిత్రపక్షాలకు చెయ్యగలిగినదంతా చేస్తున్నాం అని బి.జె.పి. అంటున్నది. అసంతృప్తి అనేది ఎక్కడో, ఎందుకు మొదలవుతున్నదో స్పష్టత లేకపోయినా బి.జె.పి అగ్రనేతల వ్యవహారంతో వేగలేకపోతున్నారన్న వాదనకు బలం చేకూరుతున్నది.

ఏ రాజకీయ పార్టీ అయినా స్వార్థమే చూసుకుంటుంది. తమ ప్రయోజనాలు ఎవరివల్ల తీరతాయనుకుంటే వారితో చేతులు కలుపుతారు.

మంచి ఊపుమీదున్న పెద్దవారితో చేరితే లాభసాటి బేరం అనుకుంటాయి చిన్న పార్టీలు. ఆ పెద్ద పార్టీకి ఆదరణ తగ్గుతున్నదన్న భావన కలగగానే తప్పుకుంటాయి చిన్న పార్టీలు. ఇప్పుడు చిన్న పార్టీలు బి.జె.పి. హవా తగ్గిందనే భావనకు వచ్చాయి.

ఇది ఆధారరహిత భావన కాదు. ఇటీవల జరిగిన ఉత్తరప్రదేశ్ లోక్‌సభ ఉప ఎన్నికలు రెండింటిలో బి.జె.పి. ఓడిపోయింది. అందులో ఒకటైన గోరఖ్‌పూర్ చిరకాలంగా బి.జె.పి. కాషాయ కోట.

ప్రస్తుత ముఖ్యమంత్రి యోగి ఆదిత్యనాథ్ దాస్ ప్రాతినిధ్యం వహించిన నియోజకవర్గం.

గత ఎన్నికల్లో 2 లక్షల 50 వేలవరకు మెజారిటీ సాధించిన బి.జె.పి. ఈసారి 26 వేల ఓట్ల తేడాతో ఓడిపోయిందంటే ఆ పార్టీ గ్రాఫ్ ఎంతగా పడిపోయిందో అర్థంచేసుకోవచ్చు.

ఫూల్‌పూర్‌లోనూ ఓడిపోయింది. బీహార్‌లో లోక్‌సభ స్థానం గెలవలేదు. రాజస్థాన్, మధ్యప్రదేశ్‌ల్లో ఉప ఎన్నికల్లో స్థానాలు కోల్పోయింది. 2014 తర్వాత 9 లోక్‌సభ ఉప ఎన్నికలు జరిగితే ఏడింటిలో ఓడిపోయింది. ఇప్పుడు లోక్‌సభలో బి.జె.పికి వున్న మెజారిటీ రెండు సీట్లుమాత్రమే.

ప్రభుత్వం పడిపోదు. మెజారిటీకి ఢోకా లేదు. అయినా ఓటర్ల దృష్టిలో అది పరాజయంపాలవుతున్న పార్టీ. కాని అదే సమయంలో బి.జె.పి. రాష్ట్రాల ఎన్నికలను గెలుచుకుంది. ఢిల్లీ, పంజాబ్‌లలో తప్పించి మిగిలిన రాష్ట్రాలలో బి.జె.పి.దే గెలుపు.

రాష్ట్రాలు గెలుస్తూ, లోక్‌సభ ఉప ఎన్నికలలో ఓడిపోవటాన్ని ఎలా అర్థంచేసుకోవాలి! ప్రజలు కేంద్ర ప్రభుత్వ పనితీరుమీద తీర్పునిస్తున్నారనుకోవాల్సిందే కదా! నరేంద్రమోడీని ఢీకొనటం చాలా కష్టం అనేది ఆరునెలల క్రితంవరకు వినిపించిన మాట. కాని ఇప్పుడు నరేంద్రమోడీని ఓడించగలమనే ఉత్సాహం ప్రతిపక్ష పార్టీలలో కనిపిస్తోంది.

రాజకీయ పునరేకీకరణ అవసరమని, నరేంద్ర మోడీని ఓడించే ఏకైక లక్ష్యంతో అన్ని పార్టీలు ఏకమవ్వాలన్న నినాదం ప్రతిపక్షాలిస్తున్నాయి.

నిన్నా మొన్నటివరకు స్తబ్ధతతో వున్న కాంగ్రెస్ శిబిరంలో కొత్త ఉత్సాహం కనిపిస్తున్నది.

నాలుగేళ్ళుగా కాంగ్రెస్‌ని దూరంగా పెట్టిన పార్టీలు ఇప్పుడు కాంగ్రెస్‌తో కలిసి పనిచేయటానికి సిద్ధంగా ఉన్నాయి. గత వారం సోనియా ఏర్పాటు చేసిన రాజకీయ విందుకు ఇరవై పార్టీలపైన హాజరయ్యాయి. బి.జె.పి.కి దగ్గరవుతున్నాడనుకున్న శరద్‌పవార్ తిరిగి సోనియాగాంధీతో కలిసి పని చేసేందుకు సిద్ధమయ్యాడు.

గుజరాత్ ఎన్నికలలో గుచ్చిన సామాజిక దండ విలువ ఏమిటో ప్రతిపక్షాలకు తెలియవచ్చింది. ఆ ఎన్నికల్లో మూడు భిన్న సామాజిక వర్గాలు సంయుక్తంగా మద్దతు ఇచ్చినందునే కాంగ్రెస్ గట్టి పోటీ ఇచ్చి బి.జె.పి. మెజారిటీకి గండికొట్టగలిగింది.

మార్చి నెలలోని యు.పి. ఉప ఎన్నికల వేళ తిరిగి అదే సామాజిక వర్గాల సమాహారం తయారైంది. బద్ధ శత్రువుల్లా వ్యవహరించే ఎస్.పి., బి.ఎస్.పిలు చేయి కలపటంతో బి.జె.పిని ఓడించగలిగారు.

రాజకీయ పార్టీల ప్రయత్నాలు పక్కన పెట్టినా పలు సామాజిక వర్గాలు బి.జె.పికి వ్యతిరేకమవుతున్నాయని అర్థమవుతోంది. సాంప్రదాయంగా బి.జె.పి.ని వ్యతిరేకించే ముస్లిమ్ వర్గాలకు జతగా ఎస్.పి. ప్రాతినిధ్యం వహించే వెనకపడిన సామాజిక వర్గాలు,

> “ ⇨ ఉప ఎన్నికల్లో ఓటమి
> ⇨ దూరమవుతున్న మిత్రపక్షాలు
> ⇨ ప్రజలలో వ్యక్తమవుతున్న అసంతృప్తి
> ⇨ దిద్దుబాటుకున్న సమయం ఆరునెలలే ”

బి.ఎస్.పి. ప్రాతినిధ్యం వహించే షెడ్యూల్డ్ కులాలు, తెగలు బి.జె.పి.ని వ్యతిరేకించే దిశగా రాజకీయాలు నడుస్తున్నాయి. ఇది నరేంద్రమోడీకి పెద్ద సవాల్.

మరోవైపు రైతాంగాన్ని కూడగట్టే యత్నం వామపక్షాలు చేస్తున్నాయి. వ్యవసాయదారుల సమస్యల పరిష్కారం కోరుతూ మార్చి నెలలో మహారాష్ట్రలోని నాసిక్ నుండి ముంబయివరకు 180 కి.మీ. మేర రైతుల పాదయాత్ర జరిగింది.

దీనికి విశేషస్థాయిలో మద్దతు లభించింది. దేశంలోని పలు ప్రాంతాలలో వ్యవసాయరంగం సంక్షోభంలో వుంది. కాబట్టి క్రమంగా రైతుల ఓటు బ్యాంక్‌ని నిర్మించేందుకు వామపక్షాలు ప్రయత్నం చేస్తున్నాయి. ఈలోగా దక్షిణ భారతదేశంలో కొత్త గొంతుకులు వినిపిస్తున్నాయి.

దక్షిణాది రాష్ట్రాలు వివక్షతకు గురవుతున్నాయన్న భావనను ప్రాంతీయ పార్టీలు ప్రజలలోకి తీసుకువెళుతున్నాయి. ఇది ప్రమాదకర ధోరణే అయినప్పటికీ తమ రాజకీయ మనుగడకోసం ప్రాంతీయ పార్టీలు అనుసరిస్తున్నాయి.

తమ ప్రాంతాలలో తాము ఎదుర్కొంటున్న ఇబ్బందులకు కారణం కేంద్ర ప్రభుత్వం అనే కొత్త ప్రచారం ప్రారంభించి తమ తప్పులను తెలివిగా కప్పిపుచ్చుకుంటున్నాయి. ఇదే అదనుగా ప్రాంతీయ పార్టీల ఫెడరల్ ఫ్రంట్ ఆలోచన ఆవిష్కృతమైంది.

తొలిదఫా చర్చలు కె.సి.ఆర్., మమతా బెనర్జీల మధ్య కలకత్తాలో జరిగినా అవి అంత సజావుగా సాగలేదన్నది కథనం.

ప్రాంతీయ పార్టీలమధ్య వున్న వైరుధ్యాలు ఫెడరల్ ఫ్రంట్ నాయకత్వం ఎవరిదన్న ప్రశ్నను తెస్తుంది. అవి పరిష్కరించుకుని నరేంద్రమోడీకి వ్యతిరేకంగా ఫలానా వ్యక్తి మా నేత అని నిలపగలిగితే ప్రధాని మోడీకి ఇబ్బందులు మరింత పెరుగుతాయి.

సమస్యలు అన్నివైపుల నుండి చుట్టుముడుతున్నాయి. సొంత పార్టీలోనే ఒక వర్గం తిరుగుబాటుకు సిద్ధమవుతున్నదన్న సంకేతాలున్నాయి.

పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం తగ్గిపోయి, వ్యక్తి ఆధారితంగా నడుస్తున్నదన్నది ఆరోపణ. ఇది బి.జె.పి సంస్కృతికి పూర్తిగా వ్యతిరేకం. కాబట్టి పాత తరం బి.జె.పి. నేతలకు మింగుడుపడటంలేదు.

2014లో వారిలో వున్న ఉత్సాహం ఇప్పుడు కనిపించటం లేదు. 75 సంవత్సరాల వయసుదాటిన వారిని పూర్తిగా పార్టీ టికెట్లకు దూరం చేసే ఆలోచన ఉందన్నది సీనియర్లకు నచ్చని విషయం.

అన్నివైపుల నుండి దాడులు మొదలయిన వేళ 2019 ఎన్నికల ఎత్తుగడలను నరేంద్రమోడీ రూపొందించుకోవాల్సి వుంది. పార్టీని ఏకతాటిమీదికి తీసుకురావాలి. వారి మాతృ సంస్థ సూచనలు, అనుబంధ సంస్థలను కూడగట్టుకోవటం చెయ్యాలి. 2014 ఎన్నికలలో ప్రజలలో ఆశలు రేకెత్తించి గెలవటం సులభం.

2019 ఎన్నికల్లో తాను అయిదేళ్ళలో చేసిన పనులను వివరించి ప్రజలను ఒప్పించటం కష్టం. తాము పెట్టుకున్న కాంగ్రెస్ ముక్త్ భారత్ లక్ష్యానికి తొలి అడ్డంకి 2019 ఎన్నికలు. దీనిని అధిగమించగలిగితే బహుశా నరేంద్రమోడీకి తిరుగుండదు.

గత వారంలో ఒక ఛానల్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూలో బి.జె.పి. జాతీయ అధ్యక్షుడు అమిత్ షా గెలుపుమీద ధీమాని వ్యక్తంచేశాడు.

2014ను మించిన ఫలితాలు సాధిస్తామన్నాడు. ఆయనలో కనిపించిన ఆత్మస్థైర్యం ప్రజాక్షేత్రంలో తిరిగే కార్యకర్తల్లో కనిపించటంలేదు.

ఆర్థిక రంగంలో తీసుకువచ్చిన సంస్కరణలు తమ పార్టీ ఓటుబ్యాంక్ అయిన మధ్యతరగతిని దెబ్బతీసి దూరం చేసిందన్నది కార్యకర్తల మాట.

దిద్దుబాటుకు మిగిలింది ఆరునెలలు మాత్రమే. కళ్ళు తెరిచేలోగా మోగే ఎన్నికల భేరీ మోగుతుంది. ఆ సమయానికి రాజకీయ, పాలనపరమైన, విధానపరమైన సర్దుబాట్లు చేసుకుంటాడా నరేంద్రమోడీ! మోడీమీద ప్రజలకు నేటికీ విశ్వాసముంది. కాంగ్రెస్ పార్టీ ఓటరును నమ్మించలేకున్నది. అయినా ఇదే పరిస్థితి ఎన్నికలవరకు నిలిచివుండాలికదా!

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

# గోటిమీద బొమ్మ

ఎదుటివారి దృష్టిని ఆకర్షించేవి ముఖం తర్వాత చేతులే. చేతివేళ్ళపైగల గోళ్ళకు సాదాగా రంగు వేసి వదిలేసే రోజులు కావివి. గోళ్ళను ఇలా అందంగా, ముచ్చటగా తీర్చిదిద్దుకోవచ్చు.



Courtesy : HAIR

**హార్ట్ టిప్స్ :**
చక్కగా మానిక్యూర్ చేసుకున్న వేళ్ళపై ఎర్రని రంగుతో హృదయాకారంలో తీర్చిదిద్దుకోవచ్చు. గోళ్ళపైభాగాన ఎర్రనిరంగుతో హృదయాకారంలో పెయింట్‌చేసి మిగతా గోరును అలా సహజంగా వదిలేయాలి. పల్చని కోట్‌తో సీలింగ్ చేయాలి.

**క్రోమ్ డెకాల్స్ :**
ఇది సులువైన పెయింట్.పెద్దగా టైమ్ లేదనుకున్నప్పుడు గబుక్కున వేసుకోవచ్చు.క్రోమ్ డెకాల్స్ ప్యాక్‌ను సమీపంలోని బ్యూటీస్టోర్స్ నుంచి కొని, గోళ్ళపై స్టిక్ చేసుకోవాలి.
అదనపు భాగాన్ని, అంచులను ఫైల్ చేయాలి. టాప్ కోట్ ఫినిషింగ్‌తో ముగించాలి.





**అబ్‌స్ట్రాక్ట్ రకాలు :**
ఒక్కో వేలిగోటిని ఒక్కోరకంగా పెయింట్ చేసుకోవాలి. అయితే అన్నీ సరిగ్గా మ్యాచ్ అవ్వాలి. ఈ స్టయిల్‌ను ముందస్తుగా ట్రయల్ చేసుకుంటే మరింత బాగా వస్తుంది.



**రెట్రో పాప్ ఆర్ట్ :**
రెండు నిండుగా వుండే కాంట్రాస్ట్ కలర్స్ ఎంచుకోవాలి. సరదా రకాలను అద్దుకోవాలి. పోల్కా డాట్స్ కాని, అర్ధచంద్రాకారం డిజైన్లు కాని వేసుకుంటే చూడముచ్చటగొలుపుతాయి.

**బొహెమియన్ టాటూలు :**
ఈ స్టయిల్ సాఫ్ట్, న్యూడ్ బేస్ కలర్‌పై బాగా నప్పుతుంది. సింపుల్ లైన్లను కనీసమాత్రంగా గీసుకుని, డాట్స్ అద్దాలి. దీనిని పల్చని నెయిల్ ఆర్ట్ బ్రెష్‌తో కాని, పర్మినెంట్ బ్లాక్ మార్కర్ వాడి కాని వేసుకోవచ్చు.





**బిజ్యూయల్డ్ యాక్సెంట్ :**
అప్పుడప్పుడు రిలీఫ్‌గా వుండేందుకు వీలుగా క్లాసిక్ ఫ్రెంచ్ టిప్స్ ట్రైచేస్తూండాలి. ఇది చాలా రమణీయమైన స్టయిల్.

**స్టెన్సిల్ రకాలు :**
మార్కెట్‌లో అనేక నెయిల్ డెకాల్స్, స్టెన్సిల్స్ లభిస్తాయి. వాటిని ఈ విధంగా ఇంట్రికేట్‌స్టయిల్స్ సృష్టించడానికి వాడుకోవచ్చు.
మృదువైన, కాంప్లి మెంటరీ టోన్స్‌ను ఈ స్టయిల్‌లో ఉపయోగించుకోవాలి.





**నెబుల్లా నెయిల్స్ :** కళ్ళు తిప్పుకోలేనంత ఆకర్షణీయంగా వుంటాయి. నల్లని షేడ్స్‌ను మెటాలిక్ రకాలతో దిద్దుకోవాలి. ముందు బ్లాక్ బేస్‌వేసి, ఆపైన గాలక్సీరంగులద్దాలి.

# హోమియోటుడే

## బంపర్ ఆఫర్...త్వరపడండి




- 'హోమియోటుడే' మాసపత్రిక 7 సం॥లు పూర్తి చేసుకొని 8వ ఏట అడుగు పెట్టిన సందర్భంగా ఒక బంపర్ ఆఫర్ అందిస్తున్నాం.
- రూ.1000/- చందాకట్టినవారికి- రూ.300/- విలువైన పాత సంచికలు,
- రూ. 500/- చందా కట్టినవారికి- రూ. 150/- విలువైన పాత సంచికలు వెంటనే ఉచితంగా పంపిస్తాము.ఈ ఆఫర్‌ని సద్వినియోగంచేసుకోండి
- రూ. 1000/- చందా కట్టినవారికి 50 నెలలపాటు,
  రూ. 500/- చందా కట్టినవారికి 25 నెలలపాటు ప్రతినెలా ఒక కాపీ పంపుతాము.

## ఈ ఆఫర్ స్టాక్ ఉన్నంతవరకు మాత్రమే

2011 సం॥ నుండి వెలువడిన పాత సంచికలు లభిస్తాయి

హోమియోటుడే,
డోర్ నెం. 8-3-281,
సెకండ్ ఫ్లోర్,
హైదరాబాద్ రెస్టారెంట్ పక్కన,
యూసుఫ్‌గూడ బస్తీ,
హైదరాబాద్-500045

ఆంధ్రా బ్యాంక్
కరెంట్ అకౌంట్
RDS Publications :
1712 111 00 000 566
IFSC Code :
ANDB 0001712



ఆర్.డి.ఎస్.ప్రకాష్
ఎడిటర్ & పబ్లిషర్
98480 28655

### ఇతర వివరాలకై ఫోన్ చేయండి
**98480 28655, 9030 272 338**

E.mail: homoeotodaymonthly@gmail.com

# అత్తఫలం

## ₹10,000 బహుమతి కథ

ఇప్పుడిక నామకరణం అని పంతులుగారు అనగానే బారసాల కార్యక్రమం జరుగుతున్న హాల్‌లో ఒక్కసారిగా నిశ్శబ్దం.

అంతవరకు హోమం జరుగుతున్నా, మంత్రాలు బిగ్గరగా చదువుతున్నా ఏమాత్రం ఖాతరుచేయక తమ ఇష్టంవచ్చిన రీతిలో కబుర్లు చెప్పుకుంటున్న బంధువులంతా ఒక్కసారిగా సైలెంట్ అవటంచూసిన జయంతి, శేఖర్ తమలోతామే నవ్వుకున్నారు.

ఏం పేరుపెడతారోనన్న ఆసక్తి ఉండటం సహజం. అది ప్రతి ఇంట్లో బారసాల సమయంలో ఉండేదే. కాని ఇప్పుడు బంధువుల ఆసక్తికి కారణం వారి కుటుంబాల్లో జయంతికి, శేఖర్‌లకున్న ప్రత్యేకత.

బాగా చదువుకున్నవారు, యూనివర్శిటీలో చదువుకునే సమయంలో ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. ఇద్దరూ మంచి ఉద్యోగాలలో ఉన్నారు. జయంతి, శేఖర్ ఆదర్శ దంపతులు. ఇద్దరూ ఒకే మాటమీద ఉంటారు. ఎవరిమాట వినరు.

ఏ నిర్ణయం అయినా సరే వారిద్దరే సంప్రదించి తీసుకుంటారు. అభిప్రాయాలను గౌరవించుకోవటంలో వారికి సాటి రాగలిగిన వారు లేరు. అందువల్ల వారింటికి బంధువులందరూ ఇష్టంగా వస్తుంటారు. జయంతి, శేఖరంకి తొలిసంతానం అబ్బాయి భరద్వాజ్. వాడికి ఇంకా రెండో ఏడు నిండలేదు.

ఇప్పుడు అమ్మాయి పాప జయంతి ఒళ్ళో వుంది. బియ్యం పోసిన వెండిపళ్ళెం, బంగారపు ఉంగరం శేఖర్ చేతికి ఇచ్చి మీరనుకున్న పేరు రాయండి అన్నాడు పంతులుగారు.

శేఖరం జయంతివైపు చూశాడు. అదేమిట్రా పేరు అమ్మాయిని అడుగుతావు అంది శేఖరం తల్లి ఆదిలక్ష్మి తన కొడుకు అన్నింటికి కోడలు మాట వింటాడన్న కోపం ఆమెది.

"అదంతేనమ్మా... అబ్బాయి పుడితే పేరు ఎంపికే నాది. అమ్మాయి అయితే పేరు పెట్టడం జయ ఇష్టం అన్నది మా ఒప్పందం" అని శేఖర్ అనేసరికి జయ ముఖంలో గర్వం, ఆనందం.

అలా తమ మొగుళ్ళు విలువ ఇవ్వరని చెవులు కొరుక్కున్నారు అక్కడికి వచ్చిన వారు.

"పేరుకు ప్రత్యేకంగా ఆలోచన ఎందుకండీ... మీ అమ్మగారి పేరే మన అమ్మాయి పేరు" అని జయంతి అనేసరికి ఒక్కసారిగా శేఖర్‌తోపాటు అందరి ముఖాల్లో ఆశ్చర్యం.

తన పేరు పెడుతున్నారన్న ఆనందంకన్నా ఆదిలక్ష్మిగారి ముఖంలో ఆశ్చర్యమే అధికం. తాము వింటున్నది నిజమేనా అని గిల్లుకుని చూసుకున్న వారు ఆ హాల్‌లో లేకపోలేదు.

అందుకు కారణం లేకపోలేదు. కొడుకు పెళ్ళి తాను చెప్పినట్టు జరగాలన్నది ఆదిలక్ష్మిగారి ఆలోచన. కాని శేఖరం తాను జయంతిని ప్రేమించానని చెప్పాడు. నిజానికి జయంతిని కాదనటానికి ఒక్క కారణం కూడా లేదు.



డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు
సెల్ : 94404 21695







అయినా తనమాట నెగ్గలేదన్న కోపంతో ఆది లక్ష్మి కోడలిని మనస్ఫూర్తిగా స్వాగతించ లేదు. అంటీ ముట్టనట్టుగా ఉండిపోయింది వారి బంధం. కొడుకు ఇంటికివచ్చి ఉండాలన్నకోరిక ఆదిలక్ష్మిలో లేదు. అత్తగారు వచ్చి తనసేవలు అందుకుంటే బాగుం డన్న ఆలోచన జయంతికి లేదు.

మా ఇంటికి ఎందుకు రారు అని జయంతి అడి గితే మీ ఇద్దరు ఉద్యోగాలకు వెళ్ళిపోతే నేను మీ ఇంట్లో ఒంటరిగా ఉండి కాపలాకాయాలా అని ఈసడించేది ఆదిలక్ష్మి.

జయంతి కూడా మొక్కుబడిగా పలకరింపులు, సందర్భం వచ్చినప్పుడు పెట్టుపోతలు చేస్తుండేది.

ఆ అత్తాకోడళ్ళ పలకరింపులు అద్భుతమైన నటన అని బంధువులందరికి తెలుసు. అటువంటిది హఠాత్తుగా తన పిల్లకు జయంతి అత్తగారి పేరు పెట్టడం, అందునా ఆదిలక్ష్మి అనే పాతకాలపు పేరు పెట్టటం ఆశ్చర్యంకాక ఏమిటి!

నామకరణం తర్వాత సాగే ఇతర కార్యక్రమాల ఫ్రింటిలో శేఖర్ యాంత్రికంగా పాల్గొంటున్నాడే గాని అతని మనసు, ఆలోచనలు భార్య ఇచ్చిన షాక్‌మీదే ఉన్నాయి. ఎందుకిలా చేసింది! హఠాత్తుగా అత్తగారి మీద అంత ప్రేమ గౌరవం ఎందుకొచ్చింది? ఎంత ఆలోచించినా అర్థం కావటంలేదు.

వచ్చిన బంధువులంతా ఎప్పుడు వెళ్ళిపోతారా! జయతో ఏకాంతంగా సమయం ఎప్పుడు వస్తుందా అని ఆత్రుతగా ఎదురుచూశాడు. ఆ అవకాశం రాత్రి పదయితేగాని దొరకలేదు.

"వీడిని నా దగ్గర పడుకో పెట్టుకుంటాలేరా" అంటూ బాబును తీసుకుని తన గదిలోకి వెళ్ళి పోయింది ఆదిలక్ష్మి.

పడకగదిలోకివెళ్ళి తలుపులు మూసేసరికి అప్పుడే పేరుపెట్టిన ఆదిలక్ష్మిని దగ్గరగా పట్టు కుని పాలు ఇస్తూపడుకున్న జయంతి. ఆమెముఖంలో చిలిపినవ్వు కనిపిస్తుంది.

ఎందుకలా చేశావని అడుగుదామంటే నోట మాట రావటం లేదు. ఎలా మొదలుపెట్టాలో తెలియక మంచంమీద వాలి భార్యముఖంలోకి నిట్టూర్పు విడిచాడు.

"మరీ అంత అమాయకంగా నటించకు శేఖర్" అంది జయంతి పాలివ్వటం ముగించి జాకెట్ సర్దుకుంటూ.

ఎలా స్పందించాలో అర్థంకాలేదు శేఖర్‌కి "అదిగో ఆ అమాయకపు చూపులే నన్ను పడేశాయి..." అయినా శేఖర్ ఏమీ మాట్లాడలేదు.

"ఎలాంటి దాన్ని ఎలా మార్చావో ఒక్కసారి గుర్తు తెచ్చుకో" అన్నది జయంతి. ఇప్పుడు అత్తగారి పేరు పెట్టడానికి తమయూనివర్శిటీలో సాగిన ప్రేమ వ్యవ హారానికి సంబంధం ఏమిటన్నది శేఖర్ సందేహం.

"మన పెళ్ళయి నాలుగేళ్ళు అవ్వలేదు. అప్పుడే ఇద్దరు పిల్లల తల్లిని చేశావు. నన్ను ఎలా మార్చింది గుర్తులేదా?" అని జయంతి ప్రశ్నించేసరికి తమ ప్రేమకాలంలోకి వెళ్ళిపోయాడు శేఖర్.

చదువుకునే రోజుల్లో జయంతి పెంకిపిల్ల అని, మొండిపిల్ల అని పిలిచేవారు. ఏ అబ్బాయిని దగ్గరకు రానిచ్చేది కాదు. మాటలు కలపటానికి అవకాశం ఇచ్చేది. అసలు పెళ్ళి అంటేనే మండిపడేది.

ఆ పెంకి తనమే శేఖర్‌కి నచ్చింది. అంతటి పెంకి అమ్మాయిని తన దానిని చేసుకోవటంకన్నా కావాల్సిందేముంది' అనుకుని తన పరిచయం ముందుకు తీసుకువెళ్ళాడు.

అబ్బాయిలంటే సదభిప్రాయంలేని జయంతికి శేఖర్‌లోని నవ్వు, పరిమితంగా, మర్యాదగా మాట్లాడే తీరు నచ్చింది. అబ్బాయిల్లో శేఖర్ ప్రత్యేకం అను

కున్నది. ఆ అభిప్రాయంతోనే అంతకుముందు ఏ అబ్బాయికి ఇవ్వని చనువు శేఖర్‌కి ఇచ్చింది.

జయంతి, శేఖర్‌లు నలుగురికి కనపడేలా తిరిగింది లేదు. ఎప్పుడూ ఒకచోట కూర్చుని కబుర్లు చెప్పుకుంది లేదు. ప్రత్యేకంగా ప్రపోజ్ చేసింది లేదు. కాని ఇద్దరు క్రమంగా ఒకరికొకరు దగ్గరయ్యారు.

శేఖర్ చెయ్యి చాస్తే తన మొండితనం వదిలి అతడి చేతిని అందుకుంది.

అప్పుడు కూడా జయంతి పెట్టిన షరతు ఒక్కటే. పెళ్ళి చేసుకున్నా సెక్స్‌కి మాత్రం నో అంది. ఇలాగే స్నేహితుల్లా ఉందాం అంది. అప్పటికి శేఖర్ జయంతి గురించి బాగా తెలుసుకున్నాడు కాబట్టి 'అలాగే' అని అంగీకరించాడు.

**కా**ని ఆ తర్వాత ఒకరోజు జయంతి వాళ్ళింటికి శేఖర్ వెళ్ళినప్పుడు ఇంట్లో ఎవరూ లేరు. చాలాసేపు కబుర్లుచెప్పుకుని, బయటకువస్తున్న శేఖర్‌కి బై చెప్పటానికి గుమ్మంవరకు వచ్చింది జయంతి. ఏదో మరచిపోయినవాడిలా లోపలికి వచ్చిన శేఖర్ ఒక్కసారిగా జయంతిని దగ్గరకు లాక్కుని పెదవులమీద ముద్దుపెట్టి వదిలేశాడు.

ఆ క్షణంలో శేఖర్‌కి భయం వేసింది. జయంతి తిరగబడుతుందని వణికిపోయాడు. కాని జయంతి అదేమీ చేయలేదు.

నెమ్మదిగా తలవంచుకుని, శేఖర్ దగ్గరికివచ్చి గట్టిగా కౌగిలించుకుంది. శేఖర్ కళ్ళలో కళ్ళుపెట్టి చూడలేకపోతున్నది.

> దేశాన్ని పెద్ద విపత్తునుండి కాపాడేందుకు అన్ని పార్టీలు ఏకమవ్వాల్సిన సమయం వచ్చింది.-మమతా బెనర్జీ,
> బెంగాల్ సి.ఎమ్.



ఒక్కసారిగా తలెత్తిన జయంతి అలా చూస్తూ ముందుకువంగి పెదవులు కలిపింది.

అలా ఎంతసేపు ముద్దులు ఇచ్చిందో, ఎంతసేపు అందుకుందో తెలియని తన్మయత్వంలో ఉండిపోయింది.

బయట జయంతి అమ్మ, నాన్నలు వచ్చిన శబ్దం అవకపోతే ఆరోజు ఎంతదూరం వెళ్ళేదో జయంతి. నాటివరకు పెళ్ళి అప్పుడే వద్దన్న జయంతి ఆ ముద్దుల అనుభవం తర్వాత పెళ్ళి ఎప్పుడు అని ప్రశ్నించటం మొదలుపెట్టింది.

ఈలోగా చదువులు అయిపోయి, ఉద్యోగాలు వచ్చి జయంతి, శేఖర్ ఒక ఇంటివారయ్యారు.

తొలిరాత్రి అనేదానికి ఎంతో వ్యతిరేకతగా ఉండే జయంతి ఆ రాత్రి చేసిన హడావుడి చూసి శేఖర్ ఆశ్చర్యపోయాడు. తొలిముద్దుకు అంత ప్రభావముంటుందని అప్పటివరకు తెలియదు శేఖర్‌కి.

తొలిరాత్రి కబుర్లు, ఒకరినొకరు అర్థం చేసుకోవటం వంటి జయంతి మాటలను గుర్తుచేస్తే "ఇంక ఆపు... అవన్నీ ఈ రుచి తెలియకముందు చెప్పినవి. కొసరు అందించి అసలు ఇవాళ కాదంటే నిన్ను చంపేస్తా" అంటూ మీదికి దూకింది.

పెళ్ళి, పిల్లలు అనేది జయంతికి చిరాకు అయిన విషయం. ఆ విషయం గుర్తుచేయబోతున్న శేఖర్‌ని "అవన్నీ నాకు తెలుసురా... మగడా... నువ్వు ముందురా" అంటూ అన్నింటాతానే చొరవ తీసుకుంది.

నెల తిరిగేసరికి జయంతి నెల తప్పిందన్న వార్త ఆ విషయం తెలిసిన రాత్రి "శేఖర్ ఫస్ట్ బాల్ సిక్స్ కొట్టిన బ్యాట్‌మెన్‌వి రా" అంటూ ముద్దులతో ముంచెత్తింది జయంతి.

ఎంతలో ఎంత మార్పు అని శేఖర్ ఆశ్చర్యపోతుంటే "అదంతా తింటే కదా రుచి తెలిసేది" అని వాళ్ళమ్మ చెప్పిన విషయం గుర్తుచేసింది.

"నువ్వు ఆరోజు ఆ సాహసం చేసి ముద్దుపెట్టి ఉండకపోతే నువ్వు ఇప్పటికి నాకోసం పందిటమంచం చుట్టూ పరిగెడుతూ ప్లీజ్... ప్లీజ్ అంటూ బ్రతిమలాడుకుంటూ ఉండేవాడివి తెలుసా!" అని శేఖర్‌ని గట్టిగా వాటేసుకుంది.

ఒక్కరాత్రికూడా శేఖర్‌కి దూరంగా ఉండలేనంతగా అల్లుకుపోయింది జయంతి జీవితం.

పెళ్ళికి వ్యతిరేకం, సంసారానికి వ్యతిరేకంగా మాట్లాడే తమ పెంకిఘటం జయంతిని ఇంతలా లొంగదీసుకున్న అల్లుడంటే వాళ్ళ ఇంట్లో గౌరవం పెరిగింది. ఆలోచనలు అక్కడఆపి ఒక్కసారి జయంతివైపు చూశాడు.

"**ఆ**రోజు విషయాలు ఆలోచించరా అంటే పాత రికార్డు తిరగేస్తాడేమిట్రా నా మొగుడు" అంటూ శేఖర్ చేతిని తన చేతిలోకి తీసుకుంది. ఇద్దరూ మరింత దగ్గరగా తలలు ఆనించి పసిగుడ్డువైపు ప్రేమగా చూశారు.

ఇప్పుడైనా గుర్తుకువస్తున్నదా... నేనెందుకు మీ అమ్మపేరు పెట్టానో అని అడిగింది జయంతి.

కడుపుతో ఉన్న జయంతి తన లైంగిక అనుభవం, ఆనందాన్ని ఏమాత్రం వదులుకోలేనంది.

అలా దాదాపుగా ఎనిమిదవ నెలవరకు ఎటువంటి అడ్డంకి లేకుండా అనుభవాన్ని పొందింది. తొలికాన్పు అబ్బాయి పుట్టటం, వాడి ఆలనాపాలనా చూడటంలో సరదాగా గడిచిపోయింది.

కొడుకు భరద్వాజ్‌కి ఏడునెలలు నిండుతున్న సమయం నుండి జయంతిలో ఏదో మార్పు స్పష్టంగా కనిపిస్తోంది. శేఖర్‌తో అంతకుముందున్నంత చనువుగా ఉండటం లేదు. ప్రతిదానికి విసుగు పెరిగిపోయింది. అసహనం, కేకలు ఎక్కువయ్యాయి.

తనమీద అంత ప్రేమ కలిగిన జయ ఇప్పుడెందుకిలా ప్రవర్తిస్తోంది!

శేఖర్‌కి అర్థంకాలేదు ఎంత ఆలోచించినా. పసివాడి ఆలనాపాలనా చూసుకోవటంలో అలసిపోయి, దానివలన ఇలా ప్రవర్తిస్తున్నదా! అనుకుని పిల్లాడి డైపర్స్ మార్చటం, మధ్యలో లేచి పాలసీసా కడిగి



## ప్చ్... బాలేదు!

ఏక్ దో తీన్ అంటూ మాధురీదీక్షిత్ చేసిన పాపులర్ పాటను 'బాఘీ 2'లో రీమేక్ చేయగా, శ్రీలంక బ్యూటీ జాక్వెలిన్ ఫెర్నాండెజ్ ఆధునిక మోహిని అవతారంలో ఆడిపాడింది.

"మాధురీదీక్షిత్ మాదిరి చెయ్యడం చాలా కష్టం. అయినా నా వంతు ప్రయత్నం చేశాను" అంటూ జాక్వెలిన్ ముందే చెప్పింది. చిత్రబృందం విడుదల చేసిన వీడియో సాంగ్ చూసిన మాధురి అభిమానులు మాత్రం చప్పరించేస్తున్నారు. జాక్వెలిన్ హావభావాలకంటే అందాల ప్రదర్శనపై ఎక్కువ దృష్టిసారించిందనేది వారి అభిప్రాయం.

తీసుకురావటం వంటి సహాయాలన్ని చేస్తున్నాడు. అయినా జయంతిలో ఎటువంటి మార్పులేదు. అదే ప్రవర్తన, అదే విసుగు, అవే కేకలు.

జయంతిని దగ్గరకు తీసుకుందామంటే మధ్యలో అబ్బాయి. వాడి వేళకానివేళ ఏడుపులు, ఇల్లు గతంలో వున్నదానికి పూర్తిగా వ్యతిరేకంగా మారింది. పడకగదిలోకి వెళ్ళాలంటే శేఖర్‌కి భయం.

ఏదో పని ఉన్నట్టు పదకొండు, పన్నెండు గంటల వరకు హాల్‌లో గడుపుతున్నాడు.

ఎంత గొప్ప ప్రేమికులం.. ఎంత చక్కగా జీవితం ఆనందించాలనుకున్నాం. అటువంటిది ఒక్క సంవత్సరం తిరిగేసరికి ఇంత మార్పా!

ఇంత విసుగా... మొగుడంటే అంత కోపమా! ప్రేమించి సంవత్సరం పైన కలిసి తిరిగిన నామీదే ఇలా విరుచుకుపడుతున్నావంటే ఇక పెద్దలు కుదిర్చిన సంబంధంలో అయితే వాడికి మరెంత నరకం చూపించేదో అనుకున్నాడు శేఖర్.

కాని జయంతి విసుగుకు అసలు కారణం అర్థం చేసుకోలేకపోయాడు. అటువంటి సమయంలో శేఖర్ తల్లి ఆదిలక్ష్మి వారింటికి వచ్చింది.

అత్తగారు వచ్చింది కాబట్టి కనీసం అరుపులు, కోపం లేకుండా ఉంటుందని అనుకున్నాడు శేఖరం. కాని అవి ఏమాత్రం తగ్గకపోగా మరికొంచెం పెరిగాయి. అత్తగారిమీద కోపం నా మీద చూపించటం లేదుకదా అని అనుకున్నాడు శేఖర్.

అలా కాదని ఆ రాత్రి జయంతితో మాట్లాడాలని నిర్ణయించుకుని "అది కాదు జయా... నీ కోపం.." అని శేఖర్ మాట ముగియకుండానే "భార్య అవసరాలు ఏమిటో అర్థం చేసుకోలేడు.. మొగుడు... పైగా ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడట..." అంటూ పెడసరి ధోరణిలో మాటలు విసిరింది.

ఈ మాటలన్నీ తన తల్లి చెవిన ఎక్కడ పడతాయోనన్న భయం శేఖర్‌ది. మా మాటకాదని ప్రేమించిన అమ్మాయిని పెళ్ళిచేసుకున్నావుగా... అనుభవించు అంటూ తల్లి దెప్పుతుందేమో నన్న బెంగ. ఏం చేయాలో తెలియక తల పట్టుకు కూర్చున్నాడు శేఖర్.

సరిగ్గా అప్పుడు పడక గది తలుపుమీద కొట్టిన చప్పుడు. తలుపు తీస్తే ఎదురుగా అమ్మ. అనుకున్నదే జరిగింది. అమ్మకు దొరికిపోయాను. భార్య విధేయుడినన్నమాట ఎప్పుడో అన్నది అమ్మ. ఇప్పుడు ఇక ఏం అంటుందో అనుకుంటూ నిలబడ్డాడు శేఖర్.



జర్మనీని నాజీలు నాశనంచేసినట్టుగా మధ్యప్రాశ్చ దేశాలను అయితుల్లా నాశనం చెయ్యాలనుకుంటున్నాడు.

-మహమ్మద్ బిన్ సల్మాన్,
సౌదీ యువరాజు

## ఐటమ్ మాత్రమే కాదు

'నా పేరు సూర్య'లో ప్రత్యేక పాట చేస్తూనే,దాన్ని ఐటమ్ అనొద్దంటున్నది ఎల్లి అవ్రామ్.

"అల్లుఅర్జున్ అంటే నాకెంతో అభిమానం. ఆయన డ్యాన్స్ చాలా చాలా ఇష్టం. ఈ సినిమాలో తనతో కలిసి డ్యాన్స్ చేయడానికి చాలా థ్రిల్లింగ్‌గా ఫీలయ్యా. చాలా పోయిటిక్‌గా ఉండి, జీవితం గురించిన సందేశం ఇచ్చే భావంగల పాట.

నేను అంగీకరించడానికి ఇది మరో కారణం. అందుకే దీన్ని కేవలం ఐటమ్ సాంగ్ అంటే నేను అంగీకరించను. నేను నా ఎక్స్‌ప్రెషన్ల విషయంలోనూ చాలా శ్రద్ధ చూపాను" అంటున్నది.



అమ్మాయి జయంతి... ఆ పిల్లాడిని నాకివ్వు. ఎందుకో ఏడుస్తున్నట్టున్నాడుగా... నా దగ్గర పడుకోబెట్టుకుని సముదాయిస్తా అంటూ వాళ్ళబ్బాయిని తీసుకుని వెళ్ళిపోతూ "తలుపేసుకోరా శేఖరం" అంది ఆదిలక్ష్మి.

తలుపువేసి జయంతి దగ్గరికిచేరిన శేఖర్ "జయ... ఇదేమన్నా బాగుందా అమ్మముందు" శేఖర్ మాటను మధ్యలోనే తుంచేసి-

"నా బాధ మొగుడికి అర్థంకాలేదు. కాని అత్తగారికి అర్థమైంది..." అంటూ శేఖర్‌ని ఒక్కసారిగా చెయ్యిపట్టి మీదికి లాక్కుంది.

ఏడెనిమిది నెలలుగా జయంతిని తాకని శేఖర్‌కి ఆ స్పర్శ చాలా కొత్తగా ఉంది.

ఆరునెలలకు పైగా అందని ఆనందం, తృప్తి మొత్తం ఆ ఒక్క రాత్రిలో తనివితీరా అందుకున్నారు. ఆ రాత్రి భావప్రాప్తుల రాత్రిగా ముగించారు.

తెల్లవారింది. పిల్లాడిని అత్తగారి నుండి తెచ్చుకుంది. పిల్లాడి పని, ఇంటిపని చేస్తున్నది. కాని నిన్నటివరకున్న కోపంలేదు. విసుగు మాయమైంది. శేఖర్ ఎప్పుడు తిరిగి తనను తాకుతాడా అని ఎదురు చూడసాగింది.

ఆరోజు రాత్రి పదిగంటలప్పుడు ఇవ్వాళ కూడా బాబును నా దగ్గర పడుకోబెట్టుకుంటాలే అంటే జయంతి వద్దనలేదు. మరో సందర్భంలో అయితే నా బాబు నా దగ్గరే ఉండాలనుకునేదేమో!

కాని ఆరోజు, ఆ మరుసటి రోజు కూడా అత్తగారి మాటను జవదాటని కోడలైంది జయంతి.

ఆ తర్వాతరోజు అత్తగారు 'ఇక నేను వెళ్ళిపోతా' అంటే జీవితంలో మొదటిసారిగా అత్తగారు మరి కొన్నిరోజులు తమతోనే ఉంటే చాలా బాగుండు అనుకుంది జయంతి. ఇప్పుడుఅర్థమైంది శేఖర్‌కి జయంతి తమ కూతురికి తన తల్లిపేరు ఎందుకు పెట్టిందో! ఆరోజు ఆమె ఆ అవకాశం ఇచ్చి ఉండకపోతే జయంతిప్రవర్తన ఎటువైపు మళ్ళేదో! కదా! అనుకున్నాడు శేఖర్.

మూడురోజుల తర్వాత ఊరికి బయలుదేరిన ఆదిలక్ష్మి ట్యాక్సీ ఎక్కి కూర్చుని కోడల్ని పిలిచి "మరో బిడ్డను కనే ఆలోచన ఉంటే నాకు కబురు చెయ్యి జయంతి" అని నెమ్మదిగా చెప్పింది.

ఆ మాటకు జయంతితోపాటు శేఖర్ కూడా సిగ్గుపడుతూ ఆపుకోలేని నవ్వుతో గబగబా ఇంటి మెట్లుఎక్కారు.

# అంతా రాజకీయమే

## మీరు కావాలి

రాహుల్‌గాంధీ కాంగ్రెస్ అధ్యక్షుడయినతర్వాత పార్టీలో సంపూర్ణ మార్పులు తెస్తాడని, నాయకత్వం కొత్త తరం చేపడుతుందని భావించారు. వయసు మళ్ళిన కాంగ్రెస్ నేతల మనసులో గుబులు మొద లైంది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుల సరాసరి వయసు 72 సంవత్సరాల పైబడి వుంది.

అటువంటి వృద్ధులవల్ల పార్టీలో యువనాయకత్వం ఎదగటం లేదన్నది ఫిర్యాదు. ఉత్తరాది రాష్ట్రాలలో సచిన్ పైలెట్, జ్యోతిరాదిత్య సింధియా, జితిన్ ప్రసాద్‌వంటివారిలో నాయకత్వ లక్షణాలు ఉన్నాయి కాబట్టి వారికి ప్రాధాన్యతనివ్వాలన్నది రాహుల్‌గాంధీ ఆలోచన. అయితే ఆ మార్పులు చేసేందుకు ఆయ నకు స్వేచ్ఛనివ్వటంలేదు పాత తరం.

వారు తప్పుకోరు, పార్టీని సక్రమంగా నడపరు. మార్పు రాకుంటే పార్టీ ముందుకు వెళ్ళలేదు. ఆ విషయం ఇటీవల ప్లీనరీ సమావేశంలో రాహుల్ గాంధీ ప్రస్తావించాల్సివచ్చింది.

పాత తరం మార్గదర్శకులుగా, అనుభవం అంతా అందిస్తే కొత్త తరం పార్టీని ముందుకు తీసుకు వెళతారన్న రాజీ మార్గాన్ని రాహుల్‌గాంధీ ప్రతిపా దించి పార్టీ వృద్ధులను శాంతపరిచాడు. ◆

## యు.పి. షాక్

ఓటర్లు బాగా తెలివయినవారు. ఆలోచించి నిర్ణ యాలను తీసుకోగలరు. ఈ విషయం బి.జె.పి.కి బాగా తెలిసివచ్చింది.

యు.పి.లో జరిగిన గోరఖ్‌పూర్, ఫూల్‌పూర్ లోక్ సభ స్థానాలు రెండింటినీ బి.జె.పి. కోల్పోయింది. అది ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రి చేతిలో వున్న సీట్లు.

ఆ రెండు నియోజక వర్గాలలో ఓటర్లు బి.జె.పిని కొట్టిన దెబ్బకు దిమ్మతిరిగింది. ఎస్.పి., బి.ఎస్.పి పార్టీలు సహకరించుకున్నందున గెలిచాయి.

ఆ రెండు పార్టీలు రెండు భిన్న సామాజిక వర్గాల పార్టీలు. దళితులు, వెనకబడిన తరగతులు, యాద వుల పార్టీలు అవి. సామాజికంగా ఆ వర్గాలు శత్రు వులు. అంత సులభంగా కలవనివి.

అయినా ఆ విభేదాలన్నింటినీ మరచిపోయి, ఓటింగ్‌లో బి.జె.పిని ఓడించాయంటే వారిలో ఎంతటి అసంతృప్తి గూడుకట్టుకుని వున్నదో బి.జె.పి ఆలో చించాలి. ఇక ఈ యు.పి. షాక్‌నుండి తేరుకుని 2019 ఎన్నికలకు ఎలా సమాయత్తమవుతుందో బి.జె.పి అనేది ఎదురుచూడాల్సిన విషయం. ◆

## మమత ముందంజ

బి.జె.పి. ఏతర పార్టీలలో కొత్త ఉత్సాహం వచ్చింది. ముఖ్యంగా ప్రాంతీయ పార్టీలు బి.జె.పి మీద కసితో వున్నాయి. టి.డి.పి. కూడా ఎన్.డి.ఎ. నుండి బయటకు రావటం వాటిలో ఉత్సాహం పెంచింది. అయితే ప్రాంతీయ పార్టీలను ఏకతాటి మీదికి తీసుకురాగలిగినది ఎవరు!

చంద్రబాబునాయుడు రంగంలోకి దిగితే ప్రాంతీయ పార్టీల కూటమి సాధ్యమవుతుంది. అయితే తెలం గాణ సి.ఎమ్. కె.సి.ఆర్‌కి చంద్రబాబు నేతృత్వంకింద పనిచేయటం ఇష్టం లేదు. అందువల్ల చంద్రబాబు కాకుండా మరో ప్రాంతీయ పార్టీ నేత కావాలి.

ప్రస్తుతం ప్రాంతీయ పార్టీలలో బలంగా వున్న నేత మమతా బెనర్జీ. ఏదో ఒక విధంగా ఆమెను ఒప్పించి, జాతీయ స్థాయిలో కూటమి నడిపేలా చేస్తే చంద్రబాబునాయుడిని వెనక్కి నెట్టగలమన్నది కె.సి.ఆర్. ఆలోచన. అందుకే హడావుడిగా వెళ్ళి మమతా బెనర్జీని కలుస్తున్నాడు.

అధిక ఎమ్.పిలు కలిగిన ప్రాంతీయ పార్టీ నేతగా మమతా బెనర్జీకి నాయకత్వం దక్కే అవకాశం ఎక్కువే. అయితే రాష్ట్రం వదలటమా లేదా అనే నిర్ణయం మమత తీసుకోవాలి. ◆

## జయ విజయం వెనక

జయబచ్చన్ రాజ్యసభకు ఎంపికైంది. యు.పి. లోని సమాజవాద్ పార్టీ ఆమె పేరును ప్రతిపాదిం చింది. అమితాబ్ గతంలో కాంగ్రెస్ పార్టీ తరఫున ఎమ్.పి.గా గెలిచాడు. ఆ తర్వాత బచ్చన్ కుటుంబం కాంగ్రెస్‌కి దూరమై, అమర్‌సింగ్ ఆర్థిక సహాయంతో తేరుకుని ములాయమ్‌సింగ్‌కి మిత్రులయ్యారు.

ఆ తరువాత అమర్‌సింగ్, ములాయమ్‌సింగ్‌ల స్నేహం చెడింది. అమితాబ్ కుటుంబం ములాయం సింగ్‌తో అంటీముట్టనట్టుగానే వ్యవహరిస్తున్నది. హఠాత్తుగా సీనియర్ పార్టీ నేతలను కాదని జయ బచ్చన్‌ని ఎమ్.పి. స్థానానికి పంపాలని ఎస్.పి. పార్టీ నిర్ణయం తీసుకోవటం ఆశ్చర్యం కల్గించింది.

దీనికి కారణం తండ్రి ములాయం, కొడుకు అఖిలేష్ యాదవ్‌లకు నచ్చకాదట అఖిలేష్ యాదవ్ భార్య డింపుల్ యాదవ్‌కి, జయబచ్చన్‌కి మధ్యవున్న స్నేహంతో ఆ టికెట్ ఇచ్చారు.

డింపుల్ యాదవ్‌కి సినిమా నటులను పరిచయం చేయటం, మేకప్ టిప్స్‌ని అందించటంద్వారా జయ బచ్చన్ దగ్గరై తన పలుకుబడి అటునుంచి ప్రయోగిం చింది. ఫలితం ఇప్పుడు అత్యంత సంపన్న ఎమ్.పిగా రాజ్యసభలో రికార్డుతో అడుగు పెడుతోంది. ◆

## పుత్ర ప్రేమికులు

ఆంధ్ర, తెలంగాణ సి.ఎమ్.లు గురుశిష్యులు. ఆ గురుశిష్యులిరువురికీ చాలా పోలికలున్నాయి. అందులో శిష్యుడు తన కొడుకును తొలిగా మంత్రిని చేస్తే గురువు కొంచెం ఆలస్యంగా మంత్రిని చేశాడు. ఇద్దరికీ కొడుకులంటే అమితప్రేమ.

అదే వరసలో ఇద్దరు సి.ఎమ్.లు తమ వారసుల మీద అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. సిరి సిల్ల కె.టి.ఆర్. నియోజకవర్గం. అక్కడ టి.ఆర్.ఎస్. మునిసిపల్ ఛైర్మన్ "కాంట్రాక్టర్లనుండి పర్సెంటేజీలు తీసుకోమని మా మంత్రిగారే చెప్పారు" అని మీడియా ముందు చెప్పి నాలిక కరుచుకున్నా బయటకు రావా ల్సిన నిజం బయటకు వచ్చింది.

ఇక నిన్నా మొన్నటివరకు పవన్‌కళ్యాణ్ అంత మంచోడు మరొకడు లేడు, ఆయన్ని ఏమీ అనవద్దు అని తన పార్టీవారికి చంద్రబాబు చెప్పేవాడు.

ఇప్పుడు పవన్‌కళ్యాణ్ స్వయంగా లోకేష్ అవి నీతి గురించి విమర్శించేసరికి తండ్రి చంద్రబాబు హృదయం చలించింది. తమది కడిగిన ముత్యపు వంశం అని నమ్మమని చంద్రబాబు చెపుతుంటే, రహస్యం బయటపెట్టిన ఆ మహిళా మునిసిపల్ ఛైర్మన్‌చేత రాజీనామా చేయించారు కె.సి.ఆర్. ◆

## ఎవరికి లాభం

పోటాపోటీగా వైకాపా, టి.డి.పిల కేంద్రంమీద అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించాయి. కాని ఇప్పుడు ఆ అవిశ్వాసంవల్ల తమకు వచ్చే రాజకీయ లాభం కన్నా కాంగ్రెస్‌కే ఎక్కువ మైలేజ్ అనే సందేహం వారిని వెంటాడుతున్నది.

ఈలోగా ఆ అవిశ్వాస తీర్మానం చర్చకు రాన టానికి వీలులేకుండా సభలో టి.ఆర్.ఎస్. అలజడి కొనసాగిస్తోంది. సభలో అవిశ్వాస తీర్మానం ప్రవేశ పెట్టినా అవి ఏ పార్టీ అవిశ్వాసంగా భావిస్తారో వారికే ప్రధానంగా మైకు అందుతుంది. ఇక మిగిలిన వారికి సభలో బలంబట్టి సమయం కేటాయిస్తారు. అంటే కాంగ్రెస్‌కి ఎక్కువ సమయం వస్తుంది.

ఆ సమయములో కాంగ్రెస్ ఆంధ్రప్రదేశ్‌కి అన్యాయం అనే విషయంకన్నా నరేంద్రమోడీని వ్యక్తి గతంగా ఎండకట్టేందుకే ప్రాధాన్యతనిస్తుంది. కాబట్టి దీనివలన ఆంధ్రప్రదేశ్‌కి ఏం లాభం!

వైకాపా, టి.డి.పిలకు వచ్చే రాజకీయ లబ్ధి ఏమిటి! రెండు పిల్లుల తగాదా కోతి తీర్చినట్లు మాత్రమే అవుతుంది. ఇది ఇప్పుడు ఆ రెండు పార్టీల రెండవ ఆలోచన.

# సత్యాన్వేషణ



## మత్స్యావతార ప్రార్థన

**వేదోద్ధార విచారమతే, సోమకదానవ సంహరణే**
**మీనాకార శరీర నమో, భక్తంతే పరిపాలయమాం॥**

సోమకాసురునిచే దొంగిలింపబడిన వేదములను ఉద్ధరించు ఉద్దేశ్యముతో సముద్రములో దాగివున్న సోమకుడనే రాక్షసుని సంహరించు నిమిత్తమై మత్స్యావతారమును దాల్చిన శ్రీమహావిష్ణో! నీకు నమస్కారము. భక్తుడనైన నన్ను రక్షింపుము. ❐

## పోలేరమ్మ తీర్థం

**(తేది : 31.3.2018)**

ఎవరైనా ఇంట్లోనుండి బయటికి వెళ్ళేప్పుడు తల్లితో 'అమ్మా! వెళ్ళొస్తా'నని చెప్తారు.

అదే మరి ఆ ఊళ్ళోనే పుట్టి, పెరిగినవాళ్ళైతే ఆ ఊరిని విడిచి మరొక ఊరికి ఏదో పనిమీద వెళ్తుంటే 'గ్రామదేవత అయిన తల్లీ! వెళ్ళొస్తా'నని చెప్పి పని పూర్తిచేసుకుని తిరిగి గ్రామంలో ప్రవేశించేటప్పుడు కూడా 'అమ్మా! నీ దయవల్ల పని పూర్తిచేసుకుని తిరిగి రాగలిగా'నంటూ అమ్మ ఆశీస్సుని తీసుకుని వస్తూండేవారు ఒకప్పుడు.

గ్రామానికి సంబంధించిన పొలిమేరలో ఉండే తల్లి కాబట్టి ఈమెని 'పొలిమేరమ్మ' అని పిలుస్తూండేవారు. ఆ పేరే క్రమంగా 'పోలేరమ్మ'గా మారింది పలకడంలో ఉన్న భేదం కారణంగా.

సంవత్సరానికి ఓమారు ఆ తల్లికి జాతర(ఉత్సవం) చేస్తుంటే ఎంత దూరంలో ఉన్నవారైనా ఇక్కడికొచ్చి తల్లిని దర్శించి జాతరలో పాల్గొని వెళ్ళడమనేది నేటికీ కన్పిస్తూండే ఆచారం. ❐

## మత్స్యజయంతి

**(తేది : 5.4.2018)**

శ్రీమహావిష్ణువుకున్న వేయి పేర్లలో ఒకటి 'అమానీ' అని. ఏమాత్రపు అభిమానమూ లేనివాడు అని దీనికర్థం. శ్రీహరి స్థితికర్త (రక్షించే లక్షణం బాధ్యతగలవాడు) కాబట్టి, జీవులందరికీ సంబంధించిన అనేక రహస్యాలు దాగిన వేదాలు అపహరింపబడ్డాయని తెలిసిన వెంటనే, చతుర్దశ (14) భువనాలకీ అధీశుడైనా సరే సిగ్గూ, అభిమానమూ పడకుండా చేపరూపాన్ని ఎత్తాడాయన.

ఎక్కడైనా, ఏ చిన్ననాటకంలోనైనా రాజ వేషం, నాయకుని వేషం వేయడానికి ఎవరైనా సిద్ధంగా ఉంటారుగాని బిచ్చగాడు రోగి వంటి వేషాలకి సిద్ధమని అంటారా?

శ్రీహరి ఓ చేపగా అవతారాన్నెత్తాడంటే మనని రక్షించడంకోసం ఎంతతక్కువ ప్రాణిరూపంలోకైనా ఆయన దిగిపోతాడని అర్థమన్నమాట!

ఎంత గొప్పదైవం!! ❐

## వేదాల విలువ

**సో**మకుడనే పేరున్న రాక్షసుడు నిరంతరం బ్రహ్మని గమనిస్తూండేవాడు.

నాలుగు వేదాలనీ నిరంతరం ఆయన పఠిస్తూ ఉంటే వాటిలో కొంత అర్థమై కొంత కాక-

మొత్తమ్మీద వేదాల్లో ఏదో గొప్పదనం ఉందని వాడికి అర్థమైంది. దాంతో బ్రహ్మ ఎప్పుడు ఏమరుపాటుతో ఉంటాడా? అని గమనించి ఆయన కొద్ది అజాగ్రత్తగా ఉన్నవేళ ఆ వేదాలని కాస్తా నోటితో గుటుక్కుమనిపించేశాడు.

**శ్రీ**హరి వాడి వెంటపడగా సముద్రంలోకి కొన్ని కోట్ల చేపల్లో ఒకడుగా మారిపోయి పారిపోయాడు. శ్రీహరి చేపరూపాన్ని ఎత్తి, చేపగా ఉన్న ఆ రాక్షసుణ్ణి గమనించి వధించి వేదాలని తెచ్చి బ్రహ్మకిస్తూ- ఏమరుపాటుతనం సరికాదనీ, వేదాలు విలువైనవనీ సున్నితంగా మందలించాడు.

ఓ చేపగా శ్రీహరి కావడానిక్కారణం వేదాల విలువని మనకి పరోక్షంగా చెప్పడానికే. ❐

## స్పర్శతో ఓదార్పు

**పూ**ర్వపు ఇతిహాస పురాణాలనిగాని చదివితే ఓ మహావిశేషం ప్రతి సందర్భంలోనూ కన్పిస్తుంది.

ఎవరైనా ఎక్కడైనా మానసికంగాగాని గాయపడి దుఃఖిస్తూంటే, వెంటనే ఎక్కడ పనిని అక్కడ ఆపేసి గబగబా ఆమె దగ్గరికొచ్చి భుజాన చేయివేసి దగ్గరికి తీసుకుని, హృదయానికి విన్పించేలా ఆత్మీయంగా మాట్లాడడం మనకి పురాణాల్లో కన్పిస్తుంది.

**వే**న్నీళ్ళలో చన్నీళ్ళు పోస్తూంటే ఎలా, ఆ నీటికి వేడిమితనం తగ్గిపోతుందో అలా దుఃఖంతో ఉన్న వాళ్ళని దగ్గరికి తీసుకుంటే మన శాంతస్థితి వారి శోకంతో కూడిన మనసు వేడిని చల్లారుస్తుంది క్రమక్రమంగా.

ఈ రోజున సెల్‌ఫోన్లు వచ్చాక, స్పర్శతో ఓదార్పు అనేది లేకపోయాక మానసికమైన కుంగుబాటుతనం (డిప్రెషన్) ఎలా తగ్గుతుంది? అందుకే పెరుగుతూ వెళ్తోంది. స్పర్శతో ఓదార్చడానికీ, ఓదార్పబడడానికీ ఇద్దరికీ సమయం లేదు. ⓢ

{ సదాచారం అవలక్షణాలను దూరం చేస్తుంది. }



Courtesy : HEALTH & NUTRITION



# నిద్ర అవసరం

మనిషి శరీరానికి ప్రతిరోజూ రోజులో మూడవ వంతు సమయం కనీస నిద్ర అవసరం. అంటే రోజుకి ఎనిమిదిగంటలు తప్పనిసరిగా నిద్రపోవాలి. నేటి ప్రపంచంలో దాదాపుగా ప్రజలందరికీ ఏమి తినాలో తెలుసు.

ఎలా వ్యాయామాలు చేయాలో తెలుసు.కానీ జనాభాలో చాలామంది అవసరమైనంత నిద్ర కావాలన్న విషయాన్ని దాదాపుగా నిర్లక్ష్యం చేస్తున్నారు.

గోద్రేజ్ ఇన్‌టీరియో వారు చేసిన నిద్రకు సంబంధించిన సర్వేలో భారతదేశ ప్రజలు నేడు నిద్రకు ఎంత దూరమయ్యారో తేటతెల్లమవుతోంది.

## సర్వేలో తేలినవి

- 80% కంటే ఎక్కువమంది వ్యక్తులు, మామూలు స్థాయినుంచి అతిఎక్కువ స్థాయివరకు నిద్ర లేక బాధపడుతున్నారు.
- 60% మంది ప్రజలు నిద్రపోయేముందు స్మార్ట్ ఫోన్‌లు, టాబ్‌లు, కంప్యూటర్‌లు వాడుతున్నారు. 9% మంది మాత్రమే నిద్రించటానికి సరైన సమయమని, రాత్రి 10 గంటలకు నిద్రిస్తున్నారు.
- 28% కంటే ఎక్కువమంది ప్రజలు రోజుకు ఆరు గంటలు మాత్రమే నిద్రిస్తున్నారు.
- 32% కంటే ఎక్కువమంది రాత్రిపూట దాదాపుగా నిద్రపోలేకపోతున్నాం అని చెప్పారు.
- సర్వేలో పాల్గొన్నవారిలో 70% మందికి సరైన పద్ధతిలో నిద్రించే అలవాటు లేదు.
- దాదాపు 40% మంది రాత్రి 12 దాటిన తరువాతే నిద్రపోతున్నాం అని చెప్పారు.
- ఏదో ఒక తెరను అది మొబైల్/కంప్యూరట్/టి.వి. ఏదైనా కావచ్చు. దాదాపు 60% వరకు నిద్ర తగ్గటానికి ప్రధాన కారణంగా కనిపిస్తున్నాయి.

పైన చెప్పిన లక్షణాలన్నీకూడా జీవనశైలిలో వచ్చిన మార్పులవల్ల అని చెప్పుకోవచ్చు. పనిలో ఒత్తిడి పెరగటం, ఆహారపు అలవాట్లు, శరీర జీవగడియారంలో వచ్చిన మార్పులు, జీవనశైలిపై ప్రభావాన్ని చూపిస్తున్నాయి. నిద్రకు దూరంచేస్తున్నాయి.

దాదాపు నేటి పెద్దలతరం నిద్ర లేకపోవటంవల్ల జరిగే భవిష్యత్తు పరిమాణాల గురించి సరైన అవగాహనను కలిగి లేదు. భయంకరమైనటువంటి రాబోయే ఫలితాలను వారు గుర్తించలేకపోతున్నారు. రోజురోజుకు భారతదేశంలో నిద్రలేమి వేగంగా పెరుగుతూ పోతుంది. ఆ స్థితినుంచి బయటపడకపోతే జరిగే అనర్థాలను తట్టుకోవటం ఎవరివల్ల కాదు.

## శరీరంపై ప్రభావం

**స్టేజ్-1 :** హార్మోన్ల సాధారణ పనితీరును దెబ్బ తీస్తుంది. మానవశరీరం ప్రతిరోజూ 50 కంటే ఎక్కువ హార్మోన్‌లను విడుదల చేస్తుంది.

కలత నిద్రవల్ల లేదా నిద్రలేమి వల్ల వీటి ఉత్పత్తిలో ఆటంకాలు ఏర్పడతాయి.మనిషిఎదుగుదలకు దెబ్బ తిన్న కణాలను చికిత్సచేసేందుకు పనికివచ్చే హార్మోన్ నిద్ర సమయంలోనే బాగా పనిచేస్తుంది.

నిద్రలేమివల్ల ఈ హార్మోన్ ఉత్పత్తి సరిగ్గా లేక శరీరంలో ఎదుగుదల తగ్గిపోతుంది.దెబ్బతిన్నకణాలు తిరిగి ఆరోగ్యంగా పనిచేయలేవు. అంతేకాక శరీరంలోని జీవక్రియలను,ఆకలిని నియంత్రించే హార్మోన్లు కూడా సరిలేక, శరీరం శక్తిని పెంచుకోవటం కోసం అతిగా ఆహారం తినేందుకు ప్రోత్సహిస్తుంది.

**స్టేజ్-2 : శారీరక శక్తిలో హెచ్చుతగ్గులు, మానసిక స్థితిలో ఊగిసలాటలు :** చాలాకాలంనుండి నిద్రలేమితో బాధపడుతూవుంటే దానివల్ల శరీరంలో శక్తి తగ్గిపోతుంది.శక్తి తగ్గిపోవటంవల్ల మూడ్స్‌లో నిలకడ వుండదు. పగటికాలంలో ఎక్కువ నిద్రమత్తుగా వుంటుంది. దాంతో ఆనందం దూరమౌతుంది.

మూడ్స్‌లో మాటిమాటికి మార్పులు రావటంవల్ల



రోజువారీపనులకు ఆటంకం ఏర్పడుతుంది.

నిద్రమత్తు ఎక్కువగా వుండటంవల్ల పనులు సరిగ్గా సాగవు. కొన్నిసార్లు అపాయాన్నికూడా కల్గించవచ్చు. దాంతో ఏ పనిమీద దృష్టి నిలవదు. ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడపడితే అక్కడ శరీరం నిద్రలోకి జారిపోతుంటుంది.

ఇలాంటి నిద్రను 'మైక్రోస్లీప్స్' అని పిలుస్తారు. వీటివల్ల ట్రాఫిక్‌లో వాహన ప్రమాదాలు ఎక్కువవుతూ వుంటాయి.నిద్రమత్తులో డ్రైవర్లు పక్కన వాలిపోతూ యాక్సిడెంట్లకు కారణమవుతూవుంటారు.

స్టేజ్ 3:దీర్ఘకాల అనారోగ్యాలకు,రోగాలకు మరియు క్యాన్సర్‌లకు దారితీయవచ్చు.నిద్ర లేకపోవటంనుంచి శరీరం తొందరగానే కోలుకోవచ్చు. కానీ నిద్రలేమి చాలాకాలంపాటు కొనసాగితే దాని పరిణామాలు శరీరంలో అప్పటికే మొదలైవుంటాయి.

ఉదాహరణకు మన శరీరాన్ని రక్షించే రోగనిరోధక వ్యవస్థ దెబ్బతింటుంది. బాగా తక్కువ నిద్ర లేదా నిద్రను ఆపుకోవటంవల్ల శరీరంలో కొన్ని ప్రత్యేక వ్యాధులు ఉత్పన్నమయి పెరుగుతుంటాయి.

గుండె రక్తనాళాల ఇబ్బందులు, మధుమేహం, అధిక రక్తపోటు మరియు కొన్నిరకాల క్యాన్సర్‌లు నిద్రలేమివల్ల వచ్చే అవకాశముంది.

## నిద్రలేమికి పరిష్కారాలు

చాలా రకాల నిద్రలేమి సమస్యలు సరైన పద్ధతిలో నిద్రపోవటం మొదలుపెడితే దూరమవుతాయి.

సరిగ్గా నిద్రపోవటానికి, నిద్రలేమిని దూరంచేసుకోవటానికి ఈ కింది పనులు మంచి సహాయకారిగా వుంటాయి.

**1. ఒకే రొటీన్‌ను పాటించండి :** నిద్రపోయే సమయాన్ని, నిద్ర లేచే సమయాన్ని రెంటినీ నిర్ణయించుకోండి. ఆ నిర్ణయాన్ని గట్టిగా అమలుపరచండి. నిద్రను దూరం చేసే ఫోన్‌లు, టాబ్లెట్లు, కంప్యూటర్‌లు. టి.విలలో లేట్‌నైట్ షోలకు దూరం జరగండి. నిద్రకు ఉపకరించే పనులను మిగిలిన అలవాట్ల మాదిరిగానే రోజువారి జీవితంలో భాగం చేయండి.

**2. వ్యాయామం :** శారీరక వ్యాయామంవల్ల ఆరోగ్యం మెరుగుపడటమే కాదు,నిద్రలేమి తగ్గుతుంది.మంచి నిద్రపడుతుంది. రోజు విడిచి రోజు కనీసం వారానికి 4సార్లు కార్డియో వ్యాయామాలను చేయండి.జాగింగ్, స్విమ్మింగ్, సైక్లింగ్ మరియు సాధారణ నడక కార్డియో వ్యాయామంలో భాగాలు.

**3. నిపుణున్ని కలవండి :** మీ ప్రయత్నం మీరు చేశాక ఇంకా నిద్రకు సంబంధించిన ఇబ్బందులు తగ్గకుంటే మంచి నిపుణున్ని కలిసి సలహా కోరండి. వారిని కలవటంవల్ల మీకు, మీ నిద్రలేమికి అసలు కారణమేమిటో తెలుస్తుంది.

పాలపర్తి శ్రీకాంత్

సీరియల్

# మనిషిలో మనిషి




"నీ జీపును ఈ కొండవెనక వదిలివచ్చినావు గదా. అది కండిషన్‌లోనే ఉంది. ట్యాంక్‌లో ఆయిలుంది. సక్రమంగా ఉంది. అంతా బాగుండి కూడా తానుగా అది అక్కడి నుంచి కదలగలదా?"

"డ్రైవర్ లేకుండా కదలదు స్వామీ"

"కదా... నడిపేవాడుంటేనే కదులుతుంది.మన శరీరంకూడా అంతే.ఆత్మ అనే ప్రాణశక్తి ఉంటేనే మన శరీరం సక్రమంగా విధులు నిర్వహిస్తుంది.

అది లేకుంటే ఆరోగ్యం సక్రమముగా ఉన్నా ఉలుకూ పలుకూ లేకుండా పడుండాల్సిందే, నీ జీప్ లాగే. శరీరం పనిచేయాలంటే నడిపించటానికి ఆత్మ అనే జీవశక్తి డ్రయివరుగా ఉండాలి. లేదంటే కోమాలోకి వెళ్ళటమే, నీ రాకుమారిలా.

శరీరాన్ననుసరించి వచ్చే జీవశక్తిలో వంశానుగతమయిన రూపురేఖలు, నమ్మకాలు, ఆచారాలు, వ్యాధుల వంటివి ఉంటాయి. వీటినే సైన్సు జీన్స్ అంటుంది.



ఇక ప్రాణశక్తిగా వచ్చే ఆత్మననుసరించి, ఆ ఆత్మ యొక్క జన్మజన్మల సంస్కారం వస్తుంది.

E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు

పూలు వాడి రాలిపోయినా, వాటి సుగంధం దారాన్ని అంటిపెట్టుకునే ఉన్నట్టు, గత జన్మల అలవాట్లు, వ్యసనాలు, ఇష్టాలు ఏర్పడతాయి.

గత జన్మలో నీవొక పరిశోధకుడివి. ఎన్నో కొత్త పరికరాలు తయారుచేసి ప్రజలకు అందించావు.

ఆ సంస్కారమే ఈ జన్మలో నిన్నొక బాలమేధావిగాను, గొప్ప సైంటిస్ట్‌గానూ తీర్చిదిద్దింది. కాబట్టి ఇప్పుడు నీ సంజనా శరీరంలో జీవశక్తి మాత్రమే ఉంది. ఇంకో ఐదుమాసాలవరకు అది పనిచేస్తుంది. ఈలోపు ప్రాణశక్తి తిరిగిరాలేదంటే జీవశక్తి హరించిపోయి ఆమె నిర్జీవమవుతుంది.

తన చేతికి మట్టి అంటకుండా, పర్లాకిమిడి సంస్థానాన్ని ఆక్రమించేందుకు స్వామి సత్యానంద చేసిన భయంకరమైన కుట్ర ఇది.

ఇలా ఒక మనిషిలోని ఆత్మశక్తిని వేరుచేసి మరో రూపంలో ఎక్కడో బంధించటమే ప్రాణవిఘాత క్షుద్రవిద్యగా పిలవబడుతోంది.

ఎప్పుడయితే ఇక్కడ శరీరం నిర్జీవమవుతుందో

అప్పుడు శరీరం ఉండదు. తన టైమ్ వచ్చేవరకు పైకి పోలేక ఆ ఆత్మ దుఃఖిస్తూ అలమటించాల్సిందే" అంటూ ఓపిగ్గా వివరించాడు మణిసిద్ధుడు.

"ఒక మనిషిని ఇలా చేయటం సాధ్యమేనంటారా స్వామీ" అంతా విని అమాయకంగా కార్తికేయ అడిగిన ప్రశ్న ఇది. ఆ ప్రశ్న విని "హ.. హ... హ..." అంటూ నవ్వాడు మణిసిద్ధుడు.

"పిచ్చివాడా! నీ సంజనాకు ఏ గతిపట్టిందో చూశాక కూడా నువ్వీ ప్రశ్న అడుగుతున్నావంటే నవ్వొస్తోంది. మీ సైన్సు చేయలేని, తర్కానికి అందని ఎన్నో అద్భుతాలను మంత్రశక్తులు చేయగలవు.

నీకు తెలుసో లేదో మన జానపద గాథల్లో ఓ దుష్ట మాంత్రికుడు తనకు చావు లేకుండా ఉండేందుకు తన ప్రాణాలను చిలక రూపంలో ఎక్కడో రహస్యంగా పంజరంలో ఉంచుతాడు.

ఆ రహస్యం తెలుసుకున్న యుక్తిపరుడు రాకుమారుడు ఎన్నో సాహసాలు చేసి వెళ్ళి ఆ చిలకను పట్టి తెచ్చి మాంత్రికుడ్ని చంపుతాడు. ఇలా తన ప్రాణాల్ని తనే భద్రపర్చుకొనే విద్యను, ప్రాణ నిక్షిప్త విద్య అంటారు. ఇలాగే మరోటుంది.

తన శరీరాన్ని మరుగున దాచుకొని మరో ప్రాణం లేని శరీరంలో ప్రవేశించి కార్యం సాధించుకోగానే తిరిగి తన నిజ శరీరంలోకి ప్రవేశించే ప్రక్రియ. దీన్నే పరకాయ ప్రవేశ విద్య అంటారు.

ఇవన్నీ నీకు అభూతకల్పనలుగా తోచవచ్చు. కాని సామాన్యులకు అర్థంగాని నిజాలు. నమ్మితే అన్నీ ఉన్నాయి. మావంటి సిద్ధులకుమాత్రమే తెలిసిన నిగూఢ విద్యలు ఇవి" అన్నాడు.

"నమ్ముతున్నాను స్వామీ. ఆ సత్యానందనుగాని మంత్రవాది భైరవేశ్వర్‌నుగాని ఏమీ చేయలేమా?" అడిగాడు కార్తికేయ.

"ప్రస్తుతం వాళ్ళని ఏం చేసి ప్రయోజనం లేదు నాయనా. కాని ఒక్కటిమాత్రం చెప్పగలను. సహనంతో వెళ్ళి పట్టుచిలుక రూపంలోని రాకుమారి ఆత్మను నువ్వు విడిపించగలిగితే చాలు. ప్రయోగం తిప్పికొట్టబడి ఆ దుష్టమంత్రవాది భైరవేశ్వర్ అక్కడికక్కడే నెత్తురు కక్కుకుని ఛస్తాడు. ఈ కార్యం నువ్వు చేయగలవా? అంతటి సాహసం నీలో ఉందా?"

"ఉంది స్వామీ... ఏంచేయాలో, అక్కడికి ఎలా వెళ్ళాలో చెప్పండి. వెళ్ళి సాధించుకొస్తాను"

"ఈ శరీరంతో అక్కడికి పోలేవు కార్తికేయ. అనవసరంగా నీ శరీరాన్ని పోగొట్టుకుంటావు. చెప్పాగా నరక ద్వారం లోపలికి, మానవమాత్రులెవరూ పోలేరు. కాలి బూడిదైపోతారు" అని చెప్పాడు.

ఆ మాటలు వినగానే కార్తికేయ కళ్ళు విశాలమయ్యాయి. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అక్కడికెళ్ళగానే కాలి బూడిదయిపోతే ఇక సంజూని కాపాడ్డం ఎలా? అసలు మణిసిద్ధుడు ఏం చెప్పబోతున్నాడో అర్థంకాలేదు కార్తికేయకి.

"స్వామీ... నరక ద్వారమంటే... యమలోకమంటారు. అక్కడా?" అనుమానంగా అడిగాడు.



20

## జరిగిన కథ

కార్తికేయ జీప్‌ని ఛేజ్ చేస్తుంటాడు తన మనుషులతో సాదూభాయ్. మర్మయోగి ఓ కొండ ప్రాంతానికి తీసుకువెళ్తాడు.

అక్కడున్న జలపాతంవద్ద స్నానాదికాలు పూర్తిచేసుకుని మర్మయోగితోపాటు ఓ గుహలోకి ఎంటరవుతాడు.

అక్కడో శివలింగం, చాలామంది యోగులు, సిద్ధులు కనిపిస్తారు. వారిలో మణిసిద్ధుడు అనే సిద్ధయోగి కార్తికేయను పలకరిస్తాడు.

సాదూభాయ్‌కి అడవిలో కార్తికేయ జీప్ కనపడుతుంది. స్వామి సత్యానంద ఎంత దుర్మార్గుడో అతని నిజస్వరూపం ఏమిటో కార్తికేయకు వివరిస్తాడు.

మలయాళ మాంత్రికుడు భైరవేశ్వర్ ద్వారా రాకుమారిమీద మంత్రప్రయోగం స్వామి సత్యానంద చేయించాడని, ఆమె బ్రతికే రహస్యంకూడా చెబుతాడు మణిసిద్ధుడు.

తర్వాత జరగబోయేది చదవండి.



## నోరు విప్పాలి

అవకాశాల పేరుతో అమ్మాయిలను వేధించే విషయమై ఇలియానాను కదిలిస్తే అనేక కబుర్లు చెప్పింది.

"మహిళలు చిత్రపరిశ్రమలో తాము ఎదుర్కొంటున్న సమస్యల గురించి మాట్లాడితే వారికి అవకాశాలు రావు. వారి కెరీర్ క్లోజ్ అయిపోయినట్లే. ఇది పిరికితనంతో చెపుతున్న విషయం కాదు.

అవకాశాల కోసం చాలామంది ఎంతో సందిగ్ధంలో పడి ఒప్పుకోవాలా? వద్దా? అని తర్జనభర్జన పడుతుంటారు. పెద్ద పెద్దవారిపై లైంగిక వేధింపులకు సంబంధించిన ఆరోపణలు వస్తే పెద్ద హీరో హీరోయిన్లు నోరువిప్పితే తప్ప మార్పు సాధ్యపడదు" అని చెప్పింది.

"అంతదూరం వెళ్ళనక్కర్లేదు నాయనా. యమలోకం, నరకం అనేవి భూమినుండి దక్షిణంగా ఎనభై ఆరువేల యోజనాల దూరంలో ఉంటే సుమారు ఒక కోటి పన్నెండు లక్షల కిలోమీటర్‌ల దూరంలో ఉందనేది గరుడ పురాణ ప్రమాణం. అది పాపులకు సుప్రీంకోర్టులాంటిది. నేను చెప్పేది అదికాదు.

ఈ భూమిలోపలే అరడజను నరకాలున్నాయి. అక్కడికి చేర్చే ద్వారాలే నరక ద్వారాలు. ఇవి హైకోర్టులాంటివి. పాపులకు శిక్షలు విధించటంలో ఇక్కడ సెటిల్‌గాని కేసులు మాత్రమే సుప్రీంకోర్టు యమపురికి తరలించబడతాయి.

ఇవన్నీ నీకు అర్థంకావు. ఇప్పుడు నీకు అవసరం నీ సంజనా ఆత్మ బంధింపబడివున్న నరక ద్వారం ఎక్కడుందో తెలియటం. అవునా?"

"అవును స్వామీ"

"అమెరికాకి దక్షిణాన మెక్సికో ఉంది. దాని క్రింద గ్వాటిమాలా, దానిక్రింద నికరాగ్వా ఉంది. ఆ దేశంలో ప్రపంచంలోనే అతిపెద్దదిగా పిలవబడే అగ్నిపర్వతం ఒకటి ఉంది. ఎత్తయిన ఒక పర్వత శిఖరములో కొన్ని కిలోమీటర్ల వెడల్పున తెరచిన మృత్యువు నోరులా ఉంటుంది.

అందులోంచి నిరంతరం అగ్నికీలలతోబాటు పొగలు, విషవాయువులు ఎగసిపడుతూంటాయి. కిలోమీటర్లకొద్దీ భూమి లోతులలోంచి ప్రేలుడు శబ్దాలతోబాటు మంటల బుగబుగలు చాలా దూరం విన్పిస్తూంటాయి. ఆ అగ్నిపర్వతం పేరు మసాయా.

ఇంచుమించు అన్ని మతగ్రంథాల్లోనూ, మసాయా ప్రస్తావన కన్పిస్తుంది. బైబిలు మసాయాని మౌత్ ఆఫ్ హెల్‌గా వర్ణించింది. ఆ మసాయాలో, అగ్నిపర్వతం మంటల వెనక మరో లోకం ఉంది. అదే భూమ్మీది ఆరు నరక కూపాల్లో ఒకటి.

పాపాత్ములు ఈ అగ్నిగుండంలోంచే నరకంలో ప్రవేశిస్తారు. అక్కడ ఏ శిక్షలు అమలుచేయాలో తేలని మిస్టీరియస్ కేసులు, సుప్రీంకోర్టులాంటి యమపురికి ట్రాన్స్‌ఫర్ చేయబడతాయి.

అలాగని అక్కడికెళ్ళి చూడ్డం కూడా సాధ్యంకాదు. పగటివేళ మసాయా అగ్నిపర్వతాన్ని కొంతమేర ఎక్కగలరు. అంతకుమించి పైకి పోలేరు. కాని రాత్రివేళ స్థానికులు ఆ పర్వతాన్ని సమీపించడానికి కూడా భయపడతారు. ఎందుకంటే కొండశిఖరాన ఎగసిపడే అగ్నిజ్వాలల వెలుగులో పొడవుగా నీడల్లాంటి ఆకారాలు కావలి తిరగటం చాలామంది చూశారు.

నరక మార్గమయిన మసాయా అగ్నికొండమీద అదృశ్య శక్తులు సదా కావలి తిరుగుతూంటాయి. వాటి కళ్ళుగప్పి పైకి వెళ్ళటం సాధ్యంకాదు.

రాత్రివేళ కొండపైనుంచి ఆత్మల ఘోష ఏడుపులు విన్నవాళ్ళు ఉన్నారు. అసలక్కడ ఏం జరుగుతోందో చూడాలని సాహసించి రాత్రివేళ కొండ ఎక్కినవాళ్ళు ఎవరూ ప్రాణాలతో తిరిగిరాలేదు.

మానవులు ఎవరినీ అక్కడ కావలి శక్తులు కొండమీదికి అనుమతించవు. అయితే పశుపక్ష్యాదుల్ని ఆత్మలను పట్టించుకోవు.

మసాయా అగ్నిపర్వతం లోపల మరో లోకం ఉంది. అదే నరక లోకం. అక్కడకు వెళ్ళాలంటే అగ్నిగుండం లోంచి వెళ్ళాల్సిందే... ఆత్మలని ఆ మార్గంగుండానే యమభటులు తీసుకుపోతూంటారు..." అంటూ చెప్పటం ఆపాడు మణిసిద్ధుడు.

"స్వామీ. భూమి దిగువన మొత్తం ఆరు నరక కూపాలు ఉన్నాయన్నారు. వాటిలో మసాయా అగ్నిపర్వతం ఒకటయితే, మిగిలిన అయిదు నరకాలు ఎక్కడెక్కడ ఉన్నాయి?" అని కుతూహలంగా అడిగాడు కార్తికేయ మణిసిద్ధుడిని.

"లోకాలు అనేకం ఉన్నాయని మన పురాణాలు ఘోషిస్తున్నాయి. వాటిని ఎవరూ నమ్మరు. మసాయా తరువాత మిగతా నరకాలు అయిదూ ఎక్కడ వున్నాయో చెపుతాను విను.

గ్జిబల్బా అగ్నిపర్వతం సెంట్రల్ అమెరికా, గిజా పిరమిడ్స్ ఈజిప్టు, అక్కడే గాడ్‌హెడ్స్ అనే గుహ, హెక్లా అగ్నిపర్వతం ఐస్‌లాండ్, అలాగే సేలమ్ అగ్నిపర్వతం. ఈ అయిదుచోట్ల భూమిలోపల నరక లోకాలు వున్నాయి. అవి తెలుసుకోవాలని వెళ్ళి ప్రాణాలు పోగొట్టుకున్న సాహసికుల అస్తిపంజరాలు ఆ యా మార్గాల్లో గుట్టలుగా కనిపిస్తాయి. ఇవన్నీ చాలా భయంకరమైన ప్రాంతాలు"

"మసాయాలో నా సంజనా ఎక్కడ బందీగా ఉంది స్వామీ?"

"ఈ మసాయా అగ్నిపర్వతం వెనేక, రహస్య ప్రాంతంలో ఓ చీకటి గుహ వుంది. ఆ గుహ మార్గం చాలా దూరం ప్రయాణించి, ఒక కిలోమీటరు దిగువన అగ్నిపర్వతం నోటివద్దకు చేరుస్తుంది.

పైకి ఎగసే పొగలు, మంటల వేడి ఆ గుహలోకి దూసుకువచ్చి ప్రాణాల్ని కాల్చేస్తుంది. అలా గుహ మార్గం అగ్నిపర్వతం నోటివద్దకు చేర్చే చోటునే నరక ద్వారంగా పిలుస్తారు. సుమేరియన్లు, గ్రీకులు, క్రిష్టియన్లు, రెడ్ ఇండియన్లు అంతా ఈ నరకపు దారిని గేట్ ఆఫ్ హెల్‌గా పిలుస్తారు.

అయితే- ఆ గుహ మార్గం చివరివరకు వెళ్ళి చూడగలిగినవాళ్ళు ఇంతవరకు లేరు.

అక్కడికి చేరేలోపలే కొన్ని వేల డిగ్రీల వేడిమికి దారిలోనే కాలి బూడిదైపోతారు. అలాంటి మృత్యుకుహరంలాంటి గుహమార్గం చివరకు చేరుకోగలిగితే, అడుగు ఎత్తున గాజు పంజరం, అందులో పట్టుచిలుక రూపంలో నీ సఖి సంజనా మెరుస్తూ కన్పిస్తాయి.

ఆ వేడికి గాజు కరిగిపోతుందికాని మంత్ర నిర్మితమైన గాజు పంజరం గాబట్టి చెక్కుచెదరకుండా అలాగే ఉంటుంది.వెళ్ళి ఆ పంజరాన్ని పగలగొట్టి తిరిగిరాగలిగితే చాలు. సంజనా ప్రాణం వెనక్కి వచ్చేస్తుంది. భైరవేశ్వర్

**పంచాంగం... జాతకం చెప్పటంలాంటిది కాదు... అది ఖచ్చితంగా సైన్సే.**

-కె.సి.ఆర్., తెలంగాణ సి.ఎమ్.



మరణిస్తాడు" అని చెపుతాడు.

"మంత్ర నిర్మితమైన పంజరం అంటున్నారు. పగులుతుందా స్వామీ?"అడుగుతాడు కార్తికేయ.

"పంజరాన్ని గూటిలోంచి కిందకు తోసేస్తే చాలు. సులువుగా పగిలి పట్టుచిలుక బయటపడి అదృశ్య మవుతుంది. ఇక దానికోసం చూడకుండా వెనక్కి వేగంగా రాగలగాలి" అని చెప్పాడు.

"కాని... ఆ గుహలోకి... ఆ చోటుకి చేరటం ఎలా స్వామీ? మాడి మసైపోతామంటున్నారు?"

"దానికి ఒకే ఒక్కమార్గం ఉంది నాయనా. నేను చేయగల సాయంకూడా అదే"

"చెప్పండి స్వామీ. ఏమిటది?"

"ముందు నేను చెప్పేది జాగ్రత్తగా విను నాయనా... శ్రీకృష్ణభగవానుడు శ్రీమద్ భాగవతంలో అష్టసిద్ధులు గురించి చెప్పాడు.

మొదటిది : అణిమ

మన శరీరపు పరిమాణాన్ని సూక్ష్మస్థాయికి తగ్గించుకోగలగటం... ఆరడుగులున్న నువ్వు ఒక ఇసుక రేణువంత స్థాయికి కుచించుకుపోవటం.

ఉదాహరణకి త్రేతాయుగంలో సీతమ్మవారి జాడ కనుగొనేందుకు లంకకి వెళ్ళిన ఆంజనేయ స్వామి తన శరీరాన్ని, అతి సూక్ష్మస్థాయికి తగ్గించుకొని, పదుగురి కంటబడకుండా జాగ్రత్త పడ్డాడు. అణిమ అనే సిద్ధి పొందినవాడు అంజనీ కుమారుడు. ఆంజనేయుడు.

రెండవది : మహిమ

మన శరీరాన్ని ఊహించలేనంత పెద్ద పరిమాణానికి పెంచుకోవటం. దోమ ఏనుగంత స్థాయికి పెరగటం. హనుమంతుడు తన శరీరాన్ని అత్యంత భారీ స్థాయికి పెంచుకొని లంకను తగలబెట్టాడు. అలాగే కుంభకర్ణుడితో యుద్ధం చేశాడు.

విష్ణుమూర్తి వామనావతారంలో అనూహ్యమైన స్థాయికి శరీర పరిమాణాన్ని పెంచుకొని, మూడు అడుగులతోటే మూడు లోకాల్ని ఆక్రమించాడు.

మూడవది : గరిమ

గరిమ సిద్ధి అంటే శరీరం బరువును కొన్ని లక్షల రెట్లకు పెంచుకోవటం. ద్వాపరయుగంలో ద్రౌపతి కోరికమేరకు సౌగంధిక పుష్పాలను తెచ్చేందుకు భీముడు గంధమాధన పర్వతం ఎక్కుతుండగా ఒక పండు ముసలి కోతి దారికి అడ్డంగా తన తోకను ఉంచి విశ్రాంతి తీసుకుంటోంది.

దారికి అడ్డంగా ఉన్న నీ తోకను వెనక్కి తీసుకో- నేను గంధమాధన పర్వత శిఖరాగ్రానికి చేరుకోవాలని ముసలి కోతిని శాసించగా ఆ కోతి కిచ-కిచ నవ్వి నేను బాగా ముసలిదాన్నయిపోయాను.

తోకను వెనక్కి లాక్కొనే శక్తి కూడా లేదు. కాస్త నువ్వే తీసి పక్కన పెట్టరాదూ... నువ్వు మహాబలశాలివి కదా... నా తోకను ఎత్తి పక్కన పెట్ట లేవా అని అడగటంతో భీముడు ఆ కోతి



తోకను ఎత్తి పక్కన పెట్టేందుకు ప్రయత్నించి విఫలమయిపోవటమేకాక విభ్రాంతికి లోనవుతాడు.

అప్పుడు భీముడు దివ్యదృష్టితో అవలోకించగా ఆ ముసలి కోతి ఎవరో కాదు, సాక్షాత్తూ ఆంజనేయ స్వామి అని తెలుసుకుని సిగ్గుపడిపోయి స్వామి కాళ్ళమీద పడిపోగా గర్వం వలదు భీమ... ఈ ప్రపంచంలో నేనే బలవంతుడినన్న గర్వం కూడదు అని ఆంజనేయస్వామి హెచ్చరిస్తాడు.

నాల్గవది : లఘిమ

మన శరీరాన్ని దూది అంత తేలికైన బరువుకి తగ్గించుకోవటం. మన శరీరాన్ని ఎప్పుడైతే ఎండుటాకు బరువుకు తగ్గించుకుంటామో గాలిలో తేలిగ్గా, సునాయాసంగా ప్రయాణించవచ్చు.

మరో మాటలో చెప్పాలంటే యోగ విద్యతో గాలిలోకి లేవటం, పద్మాసనంలో స్థిరంగా గాలిలో ఉండిపోవటం, అలాగే నీటిమీద నడవటం, నీటిమీద కూచోవటంలాంటివన్నమాట.

ఐదవది : ప్రాప్తి

కోరుకున్నదాన్ని పొందటం. దేన్నయినా ఎక్కడైనా పొందగల్గటం.



ప్రజలు ప్రశాంతతను కాపాడితే నా ప్రభుత్వం అభివృద్ధిని అందిస్తుంది.

-మమతా బెనర్జీ, సి.ఎమ్. బెంగాల్

## భయం మేలు

ప్రస్తుతం తెలుగు పరిశ్రమలో పూజాహెగ్డే పరుగు బాగున్నట్లే ఉంది.

అగ్రనాయకుల చిత్రాల్లో అవకాశాలు దక్కించుకుని ఆనందాలను విరజిమ్ముతున్నది. 'రంగస్థలం' సినిమాలో ప్రత్యేక పాటలో ఆడిపాడిన పూజ ఎన్ని సినిమాలు చేసినా కొత్త సినిమా అవగానే ప్రయాణం కొంగొత్తగా వుంటుందంటున్నది.

"పాత్రలో ఒదిగిపోగలనో లేదో, సహనటులతో కలసిపోతానా అన్న భయ సందేహాలు ప్రతిసారీ ఉంటుంటాయి. సెట్‌లో కాలు పెట్టగానే అన్నీ కరిగిపోతాయనుకోండి. అటువంటి భయాలే నాకు మేలుచేస్తుంటాయని చెప్పుకోవాలి.

ఎందుకంటే భయంతో మరిన్ని కసరత్తులు చేస్తుంటా" అని చెప్పింది పూజాహెగ్డే.

ఆరవది : ప్రకామ్య

కన్న కలల్ని వాస్తవం చేసుకోవటం.

ఏడవది : ఈశిత్వ

ఈ విశ్వ సృష్టిమీదే ఆధిపత్యం పొందటం. ప్రభువు కావటం.

ఎనిమిదవది : వశిత్వ

నింగి, నీరు, అగ్ని, గాలి, భూమి ఈ పంచభూతాల మీద ఆధిపత్యం పొందటం.

ఈ ఎనిమిది అష్టసిద్ధులు. వీటి తరువాత అతీంద్రీయ శక్తులు.

ఇవి పదిహేను.

1. త్రికాలజ్ఞత్వం : భూత, భవిష్యత్, వర్తమాన కాలాల జ్ఞానాన్ని కలిగివుండటం.

2. అద్వానద్వమ్ : భిన్నత్వం లేకుండా ఏకత్వంతో ఉండగలగటం.

3. పరాచిత్త-ఆది-అభిజ్ఞాత : ఇతరుల మనసుల్లో ఏముందో తెలుసుకోగలగటం.

4. అగ్ని-ఆర్క-అంబు-విస-ఆధీనమ్-ప్రతిష్టంభ: ఎండ, వేడి, అగ్ని, నీరు, విషంయొక్క దుష్ఫలితాల్ని అడ్డుకోగలగటం.

5. అపరాజ్య : అసాధ్యమయినవాటిని, వారిని జయించగలగటం.

6. అనూర్మి-మత్తవమ్ : ఆకలి, దప్పిక, ఇతర శారీరక అవసరాలు లేని స్థితికి వెళ్ళటం. ఈ స్థితిలో సిద్ధుడికి స్వీకరణ, విసర్జనలుండవు. గాలిలోని శక్తి నుంచే అన్ని శారీరక అవసరాలు తీరిపోతాయి.

7. దూర శ్రవణం : సుదూర తీరాల్లో వ్యక్తుల మధ్య, సమూహాల మధ్య జరిగే సంభాషణల్ని స్పష్టంగా వినగలగటం.

8. దూరదర్శనమ్ : సుదూర తీరాల్లోని వ్యక్తులను, పరిసరాలను, ప్రాంతాలను స్పష్టంగా చూడగలగటం.

దూర శ్రవణ విద్యని, దూరదర్శన

విద్యని ఏక కాలంలో సిద్ధుడు ఉపయోగించుకోవా లంటే ఉపయోగించుకోవచ్చు.

9. కామరూపం : మనం ఏ రూపంలోకి మారా లనుకుంటే ఆ రూపాల్లోకి మారిపోవటం.

వేరే వ్యక్తి రూపంలోకి (స్త్రీ అయినా, పురుషుడైనా) మారిపోవచ్చు లేదా ఏదైనా క్రిమికీటక జంతురూపం లోకి కూడా మారిపోవచ్చు.

10. మనోవిత్త : మన శరీరాన్ని ఇప్పుడిక్కడ అదృశ్యమయం చేసి మనం కోరుకున్న చోటుకి తీసు కెళ్ళగలగటం. ఉన్నచోట అకస్మాత్తుగా మాయమై కోరుకున్న చోట ప్రత్యక్షం కావటం.

11. పరకాయ ప్రవేశం : కాయం అంటే శరీరం... వేరే చనిపోయిన వ్యక్తి శరీరంలోకి, జంతువులు, పక్షులు, క్రిమికీటకాల నిర్జీవమయిన శరీరంలోకి సిద్ధుడు ప్రవేశించవచ్చు. అయితే దీనికి కొన్ని నియమనిబంధనలు విధిగా పాటించితీరాలి. అవి తరువాత ఉపదేశిస్తాను.

12. స్వచ్ఛంద మృత్యువు : భీష్ముడిలాగా ఇష్టమైన సమయంలో మరణించగలగటం. ఫలానా సంవ త్సరం, మాసం, కాలంలో శరీరాన్ని పరిత్యజించటం.

13. దేవాణాం అణుదర్శనమ్ : గడిచిన కాలం లోకి వెళ్ళి అంటే (భూతకాలంలోకి) వెనక్కి వెళ్ళి దర్శించి రాగలగటం. మూడు లోకాల్ని దర్శించి రాగలగటం.

14. సంకల్పసిద్ధి : ఏది కావాలని కోరుకుంటారో దాన్ని సాధించటం.

15. ఆజ్ఞా అప్రాప్తిత గతి : ఇతరులు మనమీద రుద్దే ఆజ్ఞల్ని నిరోధించగలగటం.

అష్టసిద్ధులు, 15 అతీంద్రియ శక్తులే కాకుండా మరో ఎనిమిది మానవాతీత శక్తులున్నాయి.

1. గత జన్మ జ్ఞాపకాలు.

2. పంచేంద్రియాలకు అందనివాటినికూడా ఆరో ఇంద్రియంతో అవలోకించటం.

3. భూమిని వదిలి గాల్లోనే ఉండిపోవటం.

4. ఒకే కాలంలో రెండుచోట్ల, అంతకంటే ఎక్కువ చోట్ల కనిపించటం.

5. ఒక కొత్త వస్తువును సృష్టించగలగటం.

6. వర్షం, తొలి సంధ్య, మలి సంధ్యని నియం త్రించటం.

7. ప్రఖ్యాసిద్ధి. వచ్చే జన్మలో ఏ తల్లి గర్భంలోకి కావాలంటే ఆ తల్లి గర్భంలోకి పిండస్థ శిశువుగా ప్రవేశించే శక్తి.

8. సూర్యకిరణాలను ఉపయోగించి ఒక పదార్థాన్ని మరో పదార్థంగా తయారు చేయగలగటం..." చెప్పడం వొకింత సేపు ఆపాడు మణిసిద్ధుడు.

కార్తికేయ విభ్రాంతితో చూస్తూ మౌనంలో కూరుకుపోయున్నాడు.

"వామాచారం ద్వారా సాధించినా, దక్షిణాచారం ద్వారా సాధించినా సాధ కుడు సాధించేవి, ఇప్పుడు నేను చెప్పేవే... సంప్రదాయం ఏదయినప్పటికీ సాధకుడికి సమ కూరేవి ఇవే నాయనా...

దక్షిణాచారం ద్వారా అయితే సుదీర్ఘమైన కాలం తరువాత సిద్ధిస్తాయి. నీతినియమాలు గల సిద్ధులు తమకు సిద్ధించిన శక్తుల ద్వారా లోక కళ్యాణానికి ఉపయోగపడతారు నిస్వార్థంగా.

స్వార్థబుద్ధి, మోహాలు, వ్యామోహాలు, కోరికలు, అహం ఉన్న సిద్ధులు తమ శక్తుల్ని ఐహిక సుఖాల కోసం ఉపయోగించుకొని కొన్నాళ్ళకు సర్వ శక్తుల్ని కోల్పోయి అకాల మరణానికి లోనవుతారు. మరణం ఎవరికైనా, ఎప్పటికయినా తప్పదు. అది కాలధర్మం. సృష్టికర్త శాసనం. సకాల మరణమే సర్వ మరణా లలో శ్రేష్ఠమైనదని మన పురాణాలు ఘోషిస్తున్నాయి. ఇక నీ విషయానికొస్తే భైరవేశ్వర్ స్వార్థంతో తనకు లభించిన శక్తుల్ని మీ కుటుంబ నాశనానికి ఉపయోగి స్తున్నట్లు తెలుస్తోంది. ఇవన్నీ ఎందుకు చెప్పానంటే నీకు కొంత అవగాహన ఉండాలికాబట్టి.

ఆ అవగాహనకు నీ శ్రమ, పట్టుదల, తెలివి తేటలు తోడుకావాలి. ఏది చేసినా లోక కళ్యాణమే నీ పరమావధి అయివుండాలి. నేను అష్ట సిద్ధులు పొంది మణిసిద్ధుడనయ్యాను.

నాకు తెలిసిన ఈ ఎనిమిది విద్యల్లో ఒకటయిన పరకాయ ప్రవేశ విద్యను నీకు అనుగ్రహిస్తాను.దీనికి నీ తెలివితేటలు జోడించి వెళ్ళి కార్యం సాధించుకు రావాలి.అయితే ఈ విద్యను జీవిత కాలంలో ఎన్నడూ దురుపయోగం చేయనని, చెడుకి ఉపయోగించ నని నాకు మాట ఇవ్వాలి. ఇస్తావా? నేర్చుకుంటావా?"

**ఇంకా ఉంది**

## చిలిపి



**ఆడది కోరుకునే వరాలు రెండు. అవి ఏవి?**
వంట చేసే భర్త, కట్నం లేని పెళ్ళి.

**మీరు జీవితంలో మోసపోయింది ఎప్పుడు!!**
మా ఆవిడ్ని పెళ్ళిచూపులలో చూసినప్పుడు!!

**స్వాతి వీక్లీకి, ఇతర వీక్లీలకీ ఉన్న తేడా?**
ఇతర వీక్లీలు సచిత్రవార పత్రికలైతే స్వాతి సపరివార పత్రిక.

**పెళ్ళిళ్ళు వేసవికాలంలోనే చేస్తారెందుకు?**
మల్లెపూలు దొరుకుతాయికనుక.

**సన్యాసం పుచ్చుకున్నవాళ్ళు గడ్డాలు, మీసాలు పెంచుకుంటారెందుకు?**
వాళ్ళ గయ్యాళి భార్యలు గుర్తుపట్టి ఇంటికి తీసుకుపోకుండా!

**ఆడవాళ్ళ సూట్‌కేసులు తెరిస్తే ఏముంటుంది?**
ఓ చిన్న శారీ షోరూమ్ ఉంటుంది.

**లక్ష్మణుడితోపాటు ఊర్మిళ అరణ్యవాసానికి ఎందుకు వెళ్ళలేదు?**
అంతఃపురంలో హాయిగా నిద్రపోవచ్చని.

**నిజాన్ని నిర్మొహమాటంగా చెప్పే ఏకైక వస్తువు?**
అద్దం.



**2019 ఎన్నికల్లో ప్రతిపక్షాలన్నీ కలిసి మోడీని ఎదుర్కొంటారన్న విషయం నాలో కొత్త ఉత్సాహం తెస్తున్నది. -అమిత్‌షా, బిజెపి అధ్యక్షుడు**

పర్సనల్ ఎజెండా

# తాప్సీపన్ను



టాలీవుడ్ నుంచి బాలీవుడ్ వెళ్ళిన తాప్సీపన్ను ముంబయిలో హ్యాపీ. 'బేబీ', 'షబనా', ఇప్పటి 'జుడ్వా 2' వంటి సినిమాలన్నీ ఆనందాన్ని అందించాయి. ఆమె చెప్పే విశేషాలు :

▸ **పలానామాదిరి కనపడాలన్న:** ఆరాటం, భయం నాకు ఎప్పుడూ లేవు. నా నుంచి స్టీరియో టిపికల్ రూపాన్ని ఎవ్వరూ అంచనా వెయ్యలేదు

▸ **కొందరు నా రూపం గురించి :** ఇలా వుండాలి అంటూ సూచించిన సందర్భాలు ఉన్నాయి. స్టడీగా అనుసరించినా నేను ఎప్పుడూ హారిబుల్ దుస్తుల్లో నన్ను నేను చూసుకోలేదు

▸ **నేనేం ధరించాలి అన్నదాన్ని :** ఎప్పుడు, ఎలా వుండాలి అన్న విషయాలను నా మెదడుపెట్టి మరీ ఆలోచిస్తాను

▸ **నా పిఆర్ యంత్రాంగం :** ఎప్పుడూ కూడా నన్ను పలానామాదిరి మాట్లాడమని చెప్పలేదు. నేను ఎటువంటిదాన్నో ముందే వారికి వివరించాను. నేనో ఇమేజ్‌ను ఏర్పరచుకున్నాను. వార్తల్లో ఉండడంకోసం నన్ను నేను మార్చుకోలేను

▸ **పర్‌ఫార్మెన్స్‌కు ప్రశంసలు వచ్చి:** సినిమా ఫెయిలైనా అది ఏ ఒక్కరి బాధ్యతో కాదు. 'నామ్ షబనా'లో ఇదే జరిగింది. కొద్ది సినిమాలు చేసిన తారలకంటే సినిమాకు రప్పించగల పెద్ద నటులుంటుంటారు. పోల్చడం కాదు వాస్తవాన్ని చెప్తున్నాను

▸ **'పింక్'ను ఉదాహరణగా తీసుకుంటే :** దీనిలో మహిళలకు సంబంధించిన అంశాలు వున్నాయి. అంతకుమించి బచ్చన్ సర్ బ్రాండ్ ఉంది.

అక్షయ్ పోస్టర్‌పైన లేరు. ట్రైలర్‌లోనూ లేరు. అతనికోసమే ప్రేక్షకులు సినిమాకు వస్తే ఓ వారమే ఆడుతుంది. కాని, ఈ సినిమా అలా కాదు. ఈ ఆరంభం ఆనందాన్ని ఇచ్చింది.

నన్ను చూడడానికి కనీసం ప్రేక్షకులు రెండు గంటలు కూర్చుంటున్నారు కదా

▸ **నిరంతర పోటీ :** పర్‌ఫార్మెన్స్‌ను ప్రభావితం చెయ్యదుకాని, నాకు అటువంటి రకం పాత్రల అవకాశం ఎందుకు రాలేదు అనిపిస్తుంటుంది

▸ **నేను ఎప్పుడూ కూడా :** నా పనికి, నా వ్యక్తిగత జీవితానికి నడుమ విస్తృతమయిన దూరం ఉంచడానికి ప్రయత్నిస్తుంటా

▸ **పరిశ్రమలో :** నాకెవరూ స్నేహితులు లేరు

▸ **ప్రతిరోజూ:** ఢిల్లీని మిస్సవుతున్నానని అనిపిస్తుంటుంది. ముంబయిలో ఢిల్లీలోమాదిరి. వ్యక్తిగతం లేదు. ఇక్కడ ప్రతిదీ నన్ను ఆక్రమిస్తున్నట్లుగా వుంటుంది. ఢిల్లీలో నా ఇల్లు ఆరో ఫ్లోర్‌లో వుంటుంది. ప్రపంచ శిఖరంపై ఉన్నట్లు ఫీలవుతుంటా.

బాల్కనీలో కూర్చోవడం అబ్బురంగా వుంటుంది. కిందకు చూస్తూ కాఫీ తాగడం మంచి అనుభూతి. అలాగే ఆహారం కూడా. ఢిల్లీ వదిలేసినా బరువు తగ్గలేదు



# బ్రహ్మ ముడి

పూర్వం కాశీనగరంలో రాజపాలుడనే యువకుడొకడుండేవాడు. అతనికి పసితనంలోనే తల్లిదండ్రులు పోయారు.

అతను ఉన్నతోద్యోగుల సహకారంతో శ్రద్ధగా చదువుకుని, దివాణంలో ఒక ఉద్యోగం కూడా సంపాదించాడు. ఉద్యోగం దొరికాక రాజపాలుడికి పెళ్ళిమీద బుద్ధిమళ్ళింది.

తల్లిదండ్రులున్నట్టయితే అతనికి అది వరకే పెళ్ళి అయిఉండేది. ఈపాటికి భార్య కాపురానికి వచ్చి, సంసారం ఏర్పాటై ఉండేది.

భార్యలేని కారణం చేత అతనింకా సత్రంలో భోజనమూ, మఠంలో నిద్రా అన్నట్టుగా జీవితం గడపవలసి వచ్చింది. ఇతరుల సహాయంలేకుండా పెళ్ళాడటం సాధ్యంకాదని తెలుసుకుని, రాజపాలుడు తన మిత్రుడొకడితో తన మనసులో ఉన్న మాట చెప్పుకున్నాడు.

"ఫలాన న్యాయాధికారిగారికొక పెళ్ళి కావలసిన కూతురున్నది. అన్నివిధాలా నీకు తగిన పిల్ల. ఇవాళరాత్రే నేను వారికి నీ విషయం చెప్పి, శత విధాల వారిని ఒప్పిస్తాను. రేపు అరుణోదయం వేళకు మణికర్ణికాఘట్టం వద్ద మెట్లమీద మనం కలుసుకుందాం. నీవక్కడికిరా. నా ప్రయత్నం ఏమయినదీ నీకు చెబుతాను..." అన్నాడు మిత్రుడు.

ఆ రాత్రి రాజపాలుడికి కన్ను మూతపడలేదు. నాలుగోజాము ఆరంభంలోనే అతను బయటికి చూసి, అప్పుడే తెల్లవారిపోయిందనుకుని, గబగబా మణికర్ణికా ఘట్టానికి బయలుదేరాడు.

అతను ఉదయకాంతి అనుకున్నది వెన్నెల. మణికర్ణికాఘట్టం నిర్జనంగా ఉన్నది. రాజపాలుడు తన స్నేహితుడి కోసం చాలాసేపు వేచి ఉండవలసి వస్తుందనుకుంటూండగా, దూరాన మెట్లమీద ఎవరో కూర్చుని ఉండటం కనబడింది.

ఆ మనిషితో కబుర్లు చెబుతూ కాస్సేపు కాలక్షేపం చెయ్యవచ్చు గదా అని రాజపాలుడాయనను సమీపించాడు.

మెట్లమీద కూర్చుని ఉన్నవాడు వృద్ధుడు. ఆయన వెన్నెల కాంతిలో పత్రాలపైన ఏదో రాస్తున్నాడు. రాజపాలుడు ఆవృద్ధుడి వెనకనుంచి తొంగిచూశాడు, కాని వృద్ధుడురాస్తున్న లిపి చాలావింతగా ఉన్నది.

"తాతగారూ, నేను అనేక లిపులు ఎరుగుదును. మీరు రాస్తున్న లిపి ఏమిటో నాకేమాత్రం బోధపడ



లేదు" అన్నాడతను వృద్ధుడితో.

వృద్ధుడు తల ఎత్తి చూసి "నీకెలా అర్థమవుతుంది? ఇది బ్రహ్మలిపి..." అని మళ్ళీ తన రాతలో నిమగ్నుడయ్యాడు.

"తమరురాసేదేమిటి?" అన్నాడు రాజపాలుడు.

"సూర్యోదయం లోపుగా పుట్టేవాళ్ళ జాతకాలు" అన్నాడు వృద్ధుడు తల ఎత్తకుండానే.

ఆ వృద్ధుడే బ్రహ్మ అయి ఉంటాడా అని రాజపాలుడికి అనుమానం వేసి, అంతులేని ఆశ్చర్యం కలిగింది. కొంతసేపటికి వృద్ధుడు రాయటం పూర్తిచేసి, పత్రాలు కట్టగట్టి ఒక పక్క పెట్టి, రెండో పక్కనుంచి ఒక సంచీ తీసి, అందులో నుంచి ఎర్రపోగులూ, తెల్లపోగులూ తీసి వాటికి ముడులు వెయ్యనారంభించాడు.

"తాతగారూ, మీరు వేసే ఆ ముళ్ళేమిటి?" అని రాజపాలుడడిగాడు.

"బ్రహ్మముళ్ళు. ఏ పురుషుడికి ఏ ఆడది రాసిపెట్టి ఉన్నదో వాళ్ళకు ముళ్ళు పెట్టేస్తున్నాను" అన్నాడు వృద్ధుడు తల ఎత్తకుండా, తన పని తాను చూసుకుంటూ.

"అయితే నాకు ఎవరు ముడిపడి ఉన్నదీ తమకు తెలిసే ఉంటుంది. మరికాస్సేపటిలో నా వివాహం స్థిరమైనట్టు వార్త వస్తుందని ఎదురు చూస్తున్నాను" అన్నాడు రాజపాలుడు.

వృద్ధుడు తల ఎత్తి అతనికేసి చూసి,

"నీ పెళ్ళి ఇంతలో జరగదు. నీకు కాబోయే భార్య ఇప్పుడింకా మూడేళ్ళపిల్ల. ఆ పిల్లకు పది హేడోఏడు వచ్చేదాకా మీ ఇద్దరికీ వివాహం జరగదు" అన్నాడు.

"ఇంకా పద్నాలుగేళ్ళదాకా నా పెళ్ళికాదా? ఎంత దారుణం! నేను నమ్మను" అన్నాడు రాజపాలుడు.

"అలా చూడు, ఆ వచ్చే ఒంటికన్ను దాని చంకనున్నదే నీకు కాబోయే భార్య" అన్నాడు వృద్ధుడు. రాజపాలుడు గబగబా మెట్లెక్కివచ్చి ముసలిదాన్ని సమీపించాడు. ఆ ముసలిదానికి ఒక కన్ను గుడ్డి, కుళ్ళుగుడ్డలు కట్టుకుని ఉన్నది.

అది పిల్లను పైమెట్టుపైన కూర్చోబెట్టి, గంగలో స్నానం చెయ్యటానికి మెట్లు దిగి వెళ్ళింది. ఆ పిల్లకు మూడేళ్ళ వయసే ఉంటుంది. ఆ పిల్ల ఆ ముసలిదాని కూతురై ఉంటుంది.





ఆ పిల్ల తనకు భార్య అవుతుందంటే రాజపాలుడికి భరించరాని రోత కలిగింది. వృద్ధుడికోసం చూస్తే ఎక్కడా కనబడలేదు. ఆ వృద్ధుడిమాటలు నమ్మాలో, నమ్మరాదో రాజపాలుడు నిర్ణయించుకోలేక పోయాడు. ఆ పిల్లను చంపేస్తేగాని అతనికి మనస్సు స్థిమితపడేటట్టు లేదు.

అతను తన మిత్రుడి కోసం ఇంక వేచి ఉండ దలచలేదు. అతను తలపెట్టిన పని నెరవేరి ఉంటే, అతడు లోగడ చెప్పినట్టు ఈ పాటికి వచ్చి తనను కలుసుకునేవాడే, పని జరిగి ఉండదు.

అలా అనుకుని రాజపాలుడు ఊళ్ళోకి బయలుదేరాడు. కొద్దిదూరం వెళ్ళేసరికే అతనికి తెలిసిన దివాణం నౌకరొకడు కనిపించాడు.

రాజపాలుడు వాణ్ణి దగ్గిరికిపిలిచి, "ఒరే, చిన్న పిల్ల రూపంలో ఒక పిశాచి ఉన్నది. దాన్ని కత్తితో పొడిచి చంపావంటే నీకు పదివరహాలు బహుమాన మిస్తాను" అన్నాడు.

"పిశాచినిచంపాల్సిందే.అదిఎక్కడున్నదో చూపించండి, ఇప్పుడే చంపివస్తాను" అన్నాడు నౌకరు.

రాజపాలుడు వాణ్ణి వెంటబెట్టుకుని వెనక్కు వచ్చేసరికి, ఒంటి కంటిది స్నానం పూర్తిచేసి పిల్లనెత్తుకుని నది నుంచి వెళ్ళిపోతూ కనబడింది.

"అదుగో, ఆ మనిషి చంకలో ఉన్న పిల్లే! నీ పని పూర్తిచేసి నా దగ్గరికి రా!" అని చెప్పి రాజపాలుడు, శిశుహత్య కళ్ళారా చూడలేక అక్కడ నుంచి త్వరగా వెళ్ళిపోయాడు. నౌకరు ముసలిదాన్ని కలుసుకుని, దాని వెనకనే నడుస్తూ, చల్లగా కత్తి పైకితీసి, పిల్లను పొడవబోయేసమయానికి, ముసలిదాని చంకలో ఉన్న పిల్ల దైవికంగా వాడికేసి పెద్దకళ్ళతో చూసింది.

ఆ కళ్ళు చూస్తే నౌకరుకు ఆమె మామూలు పిల్లే అనిపించింది. ఆ పిల్లను హత్య చెయ్యటానికి వాడికి చేతులాడక, ఎత్తిన కత్తితో పిల్ల కనుబొమ్మ మీదుగా చిన్న గాటుపెట్టి, కాలి సత్తువ కొద్దీ అక్కడి నుంచి పారిపోయాడు.

వాడు తరువాత రాజపాలుడి వద్దకు వెళ్ళి, పిశాచిని చంపానని చెప్పి, తన బహుమానం తాను పుచ్చుకున్నాడు.

రాజపాలుడు శిశుహత్య చేయించినందుకు బాగానే పశ్చాత్తాపపడ్డాడు గాని, తనకా అలగా పిల్లభార్య కాకుండా తప్పిపోయినందుకు చాలా సంతోషించాడు. అతను పెళ్ళాడటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు గాని, ఒక్కటీ కలిసిరాలేదు.

ఏళ్ళు దొర్లిపోయాయి. రాజపాలుడు ఉద్యోగంలో కూడా పైకి వచ్చాడు.

పద్నాలుగేళ్ళు గడిచాయి. రాజపాలుడి పైన ఒక కొత్త న్యాయాధికారి వచ్చాడు. పనిలో రాజపాలుడి సమర్థతా, నిజాయితీ చూసి ఆయన చాలా సంతోషించి, అతనికింత వయసు వచ్చినా ఇంకా పెళ్ళి కాలేదని విని ఆశ్చర్యపడ్డాడు.

మోహిని లాగుంది. ఆమె కాపురానికి వచ్చాక రాజపాలుడికి జీవితం స్వర్గతుల్యంగా అయింది.

అయితే తన భార్య తన జుట్టును నుదుటిలో కుడిభాగం కప్పుకునే లాగా దువ్వుకుని, అక్కడ ఒక ఆభరణం అమర్చుతూ ఉంటుంది.

మిగిలిన నగలన్నీ పెట్టెలో దాచినప్పుడు కూడా ఆమె ఆ ఆభరణాన్ని తియ్యదు. దీన్ని గురించి రాజపాలుడొకసారి ప్రశ్నిస్తే ఆమె "నేను మూడేళ్ళదాన్నయి ఉండగా ఒక దుర్మార్గుడు నన్ను కత్తితోపొడిచి చంపాలని ప్రయత్నించి, నుదిటిమీద చిన్నగాటు పెట్టి పారిపోయాడు. ఆ మచ్చ వికారంగా ఉంటుందని జుట్టు ఇలా దువ్వుకుంటాను" అన్నది.

రాజపాలుడు నిర్ఘాంతపోయి, "అయితే ఆ రోజు నిన్ను నదిదగ్గరకు ఎత్తుకుని వచ్చిన ఒంటి కంటిది మీ అమ్మ కాదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఆమె మరింత నిర్ఘాంతపోయి, "ఆ మనిషి మీకెలా తెలుసు?

అది నన్నుపెంచిన దాది.నేను ఈ అధికారిసొంత కూతురును కాను, అన్న కూతురును. నాక్కూడా



"పెళ్ళి చేసుకుందామని ఎంతో కాలంగా చూస్తున్నాను. ఒక్క ప్రయత్నమూ కలిసి రాలేదు" అన్నాడు రాజపాలుడు.

"నాకు పెళ్ళి ఈడు కూతురున్నది. చాలా అందగత్తె. బాగా చదువుకున్నది. పనిపాటలలో సమర్థురాలు. ఆమెను చేసుకో" అన్నాడు అధికారి.

రాజపాలుడు సంతోషంగా ఒప్పుకున్నాడు. అధికారి కుమార్తెను అతనికిచ్చి పెళ్ళి చేశారు. ఒంటినిండా రత్నాభరణాలు దిగవేసుకుని పెళ్ళి కూతురు అపర

మీలాగే చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు. ఆ ఒంటికంటి దాదే నన్ను పెంచింది. మా పినతండ్రి నన్ను పెంపుడు చేసుకున్నాడు" అని చెప్పింది.

రాజపాలుడు ఏమీ దాచకుండా తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. ఆమె అతని దుస్సంకల్పాన్ని గురించి ఆగ్రహించక, "అయితే మీరానాడు మణికర్ణికాఘట్టంలో చూసినది నిజంగా బ్రహ్మదేవుడే అయి ఉంటాడు" అన్నది.

**పి.కోదండరావు**





# ఏ జంట అయినా

Courtesy : Grahasobha

పెళ్ళయిన కొత్తలో బయటకు, ఉద్యోగానికి కూడా వెళ్ళలేనంత తీరిక లేకుండా కొత్త దంపతులు కలిసి కాలం గడుపుతారు. తర్వాత పనులు మామూలే. ఇంకొన్నాళ్ళకు తొలినాటి తీపిదనం జీవితంలో మరుగునపడినట్లు అనిపిస్తుంది. సరైన వ్యక్తిని ఎంచుకోవడం, సంతోషంగా, ఎటువంటి పొరపొచ్చాలు లేకుండా జీవించడం అనేది కథలు, కబుర్లలో సుఖాంతంతో ముగుస్తాయి.

కాని వాస్తవికజీవితంలో సరైన భాగస్వామిని ఎంచుకున్నాక, సదరుబాంధవ్యాన్ని పోషించుకుంటూ, నిర్వహించుకోవాల్సిన బాధ్యతజీవితకాలం ఉంటుంది.

అన్నింటికంటే ముఖ్యవిషయం ఏమిటంటే బాంధవ్యం పర్‌ఫెక్ట్‌గావుండాలని తాపత్రయపడేకంటే, పరస్పరం ఒకరిలోఒకరికిగల వ్యత్యాసాలను, పర్‌ఫెక్ట్‌గా లేకపోవడాన్ని ఇద్దరూ ఆమోదించగలగడం ముఖ్యం. అదెలాసాధ్యపడుతుందన్న అవగాహన వుండాలి.

## * శృంగారం

పని డిమాండ్లు, ఆర్థిక అంశాలు, పిల్లలు తదితర పనుల్లో నిమగ్నం అయి తమ నడుమ సన్నిహిత మధురక్షణాలను సృష్టించుకోవడంలో, వ్యక్తిగతాన్ని మెయిన్‌టెయిన్ చేయడంలో చాలా జంటలు విఫలం అవుతుంటాయి.ఇది నెమ్మదినెమ్మదిగా వారి నడుమ శారీరక, భావోద్రేక కనెక్షన్ తెగిపోవడానికి దారి తీస్తుంది. ఇది వైవాహికబంధంలో ఎంతమాత్రమూ సమంజసం కాని సంగతి. దంపతులమధ్య వయస్సు, సమయం, బాధ్యతలతో నిమిత్తం లేకుండా శృంగార జీవితం అన్నది ఇష్టంగా, సరదాగా సాగాలి.

పుట్టినరోజులకు,వివాహవార్షికోత్సవాలకు పూలు, పండ్లు,బహుమతులు,కేకులు ఇచ్చుకుంటే సరిపోదు. ఒకరిపట్ల ఒకరికి ప్రత్యేక శ్రద్ధ కావాలి. ఎవరిని ఎవరు ఎక్కడ స్పృజిస్తే స్పందిస్తారో తెలుసుకోవాలి. ఆకర్షణ అన్నదానికి అంతం లేదు.

శృంగారజీవితం ఒకేమాదిరి ఎటువంటి నూతనత్వం లేకుండా సాగితే యాంత్రికంగా, పేలవంగా అయిపోతుంది. కొత్త అన్వేషణ నిరంతర ప్రవాహంలా సాగాలి.ఇలాంటి నూతనత్వం ఆ జంటపై థెరపటిక్ ప్రభావాన్ని చూపుతుంది. చక్కని వ్యక్తిగత వాతావరణం అవసరం. చిన్ని చిన్ని చర్యలద్వారా సరికొత్త అనుభూతులు పొందగలగాలి.

కౌగిలింత సాన్నిహిత్యాన్నిఇస్తుంది. ఒకరి చేతులు ఒకరు పట్టుకోవడం, ముద్దుపెట్టడం వంటివి చేరువతనాన్నిస్తాయి.ఏ చిన్నపనైనా ఒకరికోసం ఒకరుఅన్న మాదిరివున్నప్పుడే యాంత్రికధోరణికి తావుండదు.

## * కలిసి కార్యక్రమాలు

ఏ పనిని అయినా ఒకరికొకరు షేర్‌చేసుకుంటూ కలసి కొనసాగించడంవల్ల దగ్గరితనం పెరుగుతుంది. ఇద్దరం ఒక్కటే అన్న భావం, భరోసా వస్తాయి.

ఇద్దరూ కలసి వాకింగ్ చేసినా, కలసి యోగా చేసినా ఒకరికొకరు స్ఫూర్తి అవుతారు.శారీరక, మానసిక, భావోద్రేక, మానసికస్థాయిలు స్థిరంగా, ఒక్కటిగా వుంటాయి. కలసి మౌనంగా వాకింగ్ చేసినా, భావోద్రేక దృక్పథం స్థాయిలు బావుంటాయి.

కలిసి సరుకులు తెచ్చుకోవడం, వంటచేయడం, ఇల్లు సర్దుకోవడంవంటి పనులన్నీ బాంధవ్యాన్ని దృఢపరుస్తాయి. వారంలో కనీసం రెండుసార్లయినా ఒకేసారి ఇద్దరూ కలిసి నిద్రించడంవల్ల ఎంతో ప్రభావం వుంటుందని మానసిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు.

ఒకరి అభిప్రాయాలు ఒకరు పంచుకోవడం అంటే కమ్యూనికేషన్ అనేది ఆరోగ్యపూరిత బాంధవ్యంలో ప్రధాన అదరువు. అభిప్రాయాలను మనస్ఫూర్తిగా వ్యక్తం చేయడం, ఎదుటివారు చెప్పేది శ్రద్ధగా ఆలకించడం భార్యాభర్తలు ఇద్దరూ పాటించాల్సిన సింపుల్ రూల్. మనస్సులోని ఆలోచనలకు స్వచ్ఛమైన మాటల రూపం ఇస్తుండాలి.

కోరినదాన్ని మొహమాటం లేకుండా చెప్తుండాలి. అపార్థాలకు, సంశయాలకు తావివ్వకూడదు. మనస్సులో విషయాలు వెల్లడిచేయకుండా ఒకరి మనస్సు మరొకరుచదివేయాలనిభావించడంలో అర్థంలేదు.

## * అంగీకారం, ఆమోదం

మౌనం, సహనం భార్యాభర్తలు అనుసరించాల్సిన ఉత్తమ లక్షణాలు. ఎటువంటి క్లిష్టపరిస్థితులు ఎదు

## సున్నితత్వం

మనస్సులోని భావాలు, ఆలోచనలను పారదర్శకంగా చెప్తున్నప్పటికీ సున్నితంగా, స్పష్టతతో వుండడమూ అంతే ముఖ్యం.అర్థంచేసుకునే తత్వాన్ని అలవరచుకోవాలి. ఇచ్చిపుచ్చుకునే పరిస్థితుల్లో రెండోవారి భావాలను అర్థంచేసుకునే లేదా ఊహించగల సామర్థ్యం వుండాలి.

ఎదుటివారి అవసరాలు, ఎమోషన్లు, ప్రవర్తనా ధోరణిపట్ల అవగాహనతోనూ, గౌరవించే విధంగానూ వ్యవహరించాలి. బలహీనతలు, బలాల గురించిన పరస్పర అవగాహన ముఖ్యం.

రైనా, ఎటువంటి మార్పులు, చేర్పులూ వున్నవాటిని ఆమోదించి, త్వరితగతిన వాటినుంచి బయటపడే లాఘవం అవసరం.

జీవితంలో తమపట్ల, ఇతరులపట్ల వాస్తవికంగా, అనుకూల వైఖరితో, రేషనల్‌గా వ్యవహరించాల్సిన అవసరం వుంది. ఒత్తిడిపూరిత పరిస్థితులనుంచి బయటపడగల లాఘవం మ్యాజికల్ పదార్థం. ప్రణాళికలు తలకిందులైనా ఇటువంటి ధోరణిని విడనాడకూడదు. దంపతులు పోట్లాడుకున్నా ఇదే ధోరణితో బయటపడి, ఒకరికొకరు లిఫ్ట్ ఇచ్చుకోగలగాలి.

## ప్రశంసలు

సందర్భాన్నిఅనుసరిస్తూ ఒకరినిఒకరు ప్రశంసించుకోవడంవల్ల ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. నిజానికి చాలామంది జంటల నడుమ సాధారణంగా ఒకరినొకరు ప్రశంసించుకోవడమనేది వెనుకంజలో వుంటుంది.

'టేక్ ఇట్ ఫర్ గ్రాంటెడ్' ధోరణితో వుంటారు కాబట్టి ప్రశంసించుకోవాలన్న ఆలోచన వుండదు. అయితే ప్రతిరోజూ ఒకరినొకరు ప్రశంసించుకోవడం లేదా ఒకరి గురించి ఇంకొకరు మంచి మాటలు చెప్పుకోవడంవల్ల సంతోషం కలగడం మాత్రమే కాదు,

ఒకరిని ఇంకొకరు నిశితంగా పరిశీలిస్తున్నారన్న సంతృప్తి దక్కుతుంది.

పరస్పర అవగాహనా సామర్థ్యం పెరుగుతుంది. వంట బావుందనో, డ్రెస్ బావుందనో 'థ్యాంక్స్' అన్న చిన్నమాట చెప్తే చాలు. ఎవరిని ఎవరు ఏ విషయంలో ప్రశంసిస్తూ చిన్నపదం వాడినా అది కృతజ్ఞత వ్యక్తీకరణే కాగలదు.

## * లోపాల సర్దుబాటు

తను తనలాగే ఉన్నట్లు చాలాసార్లు తమ జీవిత భాగస్వామికూడా తనలాగే వుండాలనుకుంటారు. ఎవరికికూడా పూర్తి 'పర్‌ఫెక్షన్'అనేది వుండదు. అందరిలో ఎవరి అలవాట్లు, లక్షణాలు వారికి వుంటుంటాయి. వాటిలో మంచి చెడ్డలూ రెండూ వుంటాయి. మన లక్ష్యం మాత్రం మంచిని, అనుకూలమైనవాటిని పెద్దవి చేసుకుని, గుర్తించేలా వుండాలి. ఇక్కడ



Courtesy : Vanitha

పరస్పర అవగాహన అనేది ముఖ్యం.

అందరంకూడా విభిన్న పరిస్థితులు, విలువలు, నైతికసూత్రాలు, అలవాట్లు, ఆలోచనల నడుమ పెరుగుతాం. ఆరోగ్యపూరిత, సామరస్య వైవాహిక బంధంలో ప్రధానంగా పాటించాల్సిన విషయం జీవితభాగస్వామిని మార్పు లేకుండా యథాతథంగా ఆమోదించగలగడం. తప్పులు వెతక్కూడదు.

ఉదాహరణకు భార్య ఫిట్‌నెస్ ఫ్రీక్ అనుకుందాం, భర్తకు వర్కవుట్లు చేసే అలవాటే లేకపోవచ్చు. ఆమె అతనూ తన మాదిరే ఉదయాన్నే లేచి వర్కవుట్లు సాగించాలని కోరుకోవడం సరైనది కాదు. అతనికి సాయంవేళ వాకింగ్ అంటే ఇష్టం కావచ్చు. ఇటువంటి అలవాట్లను ఒకరికోసంఒకరు రాత్రికి రాత్రే మార్చేసుకోవాలనుకోవడం సబబుకాదు.

ఒత్తిడి తేవడమన్నది ఏ విధమైన అనుకూల ఫలితాలనూ ఇవ్వకపోగా వ్యత్యాసాలకు దారితీస్తుంది. ఒకరిలో గల తేడాలను ఇంకొకరి ప్రేమ, గౌరవాలతో ఆమోదించగలగాలి. అప్పుడే బాంధవ్యం దృఢపడుతుంది.

## * వర్తమానంపై దృష్టి

ఏ జంట అయినా మనస్ఫూర్తిగా సంతోషంగా వుండాలని కోరుకుంటే వాళ్ళిద్దరి దృష్టి ప్రస్తుతంపై కేంద్రీకృతమై వుండాలన్నది మానసిక శాస్త్రవేత్తల అభిప్రాయం. మానవ మెదడు ఎప్పుడూ గతంలోని భారాలను మోస్తుంటే వర్తమానంపై ప్రభావం పడుతుంది. గతంలో జరిగినవి ఏవీ కూడా వర్తమానంపై ప్రభావం చూపకూడదు.

గతంలోకి తొంగిచూడవచ్చు, వాటినుంచి నేర్చిన పాఠాలతో వర్తమానంపై దృష్టిసారించాలే తప్ప,వాటినే నెమరువేసుకుంటూ వర్తమానాన్ని నిర్లక్ష్యం చెయ్యకూడదు. వర్తమానాన్ని మనస్ఫూర్తిగా అనుభవిస్తూ, భవిష్యత్ ప్రణాళికలు వేసుకోవాలి.

## * ఎలక్ట్రానిక్స్

రెస్టారెంట్లలో చూసినా, పడకగదిలోకి చేరినా చాలామంది జంటల చేతుల్లో స్మార్ట్‌ఫోన్లే కనిపిస్తాయి. ఇద్దరూకలిసి బయటకువచ్చామన్న విషయాన్నిపక్కన పెట్టేసి ఎవరిఫోన్లతో వారు బిజీగాకనపడుతుంటారు. వారిచేతుల్లో ఎటువంటి గాడ్జెట్లూలేకుండా కలిసిగడపడం ముఖ్యం. బాంధవ్యాల్లో అనిశ్చితికి స్మార్ట్‌ఫోన్లు కారణం అవుతున్నాయన్నది ఓ సర్వే.

దంపతులనడుమ వ్యక్తిగతసమయాన్ని ఇవిమింగేస్తున్నాయి. దీంతో బాంధవ్యం యాంత్రికం అయిపోతున్నది. కలిసి డిన్నర్ చేయవచ్చు.

కాని, భౌతికంగా పక్కపక్కనే వుంటున్నారు కాని, చేతుల్లోని ఫోన్లు బుర్రలను ఎక్కడెక్కడికో తీసుకువెళ్తుంటాయి. ఏవో ఒక మెసేజ్‌లు, అధికారిక సంభాషణలు మనస్సును ఆక్రమించేస్తున్నాయి. భార్యతో లేదా భర్తతో ఎటువంటి అవాంతరాలు లేని ప్రశాంత పూరితమైన డిన్నర్ చేయడం అవసరం.

## డేట్ నైట్

ఓ ప్రత్యేక రోజును ప్లాన్ చేసుకోవాలి. సినిమాకో, కాఫీకో, డిన్నర్‌కో కలిసి వెళ్ళి క్వాలిటీ సమయాన్ని గడపాలి. రిలేషన్‌షిప్ ఆరోగ్యంగా కొనసాగాలంటే దానంతట అది సాగిపోదు. అందుకోసం నిర్వహణ మోడ్ ఎప్పుడూ వుండాలి. దానికి తగిన పెట్టుబడులను ఇరువురూ పెడుతుండాలి.

పెట్టుబడి అంటే ధనసంబంధం కాదని గ్రహించాలి. రోజువారీకార్యక్రమాలకు అప్పుడప్పుడు భిన్నత చేకూర్చుతుండాలి. కొత్తదనం ఆపాదించాలి. ఎప్పటికప్పుడు 'రిఫ్రెష్ బటన్' నొక్కాలి. దంపతుల నడుమ సెల్ఫ్ కేర్ వుండాలి. జీవితంలో స్పార్క్‌కు ఇదెంతోఅవసరం. దంపతులనడుమ అన్యోన్యబాంధవ్యం ఎల్లవేళలా పరిరక్షించుకోవడానికి పాటించాల్సిన నిబంధనలు కావివి. అనుసరించాల్సిన అనురాగ పూరిత చర్యలు. వీటికి ఫుల్‌స్టాప్‌లు, కామాలు వుండవు. నిరంతరం సాగుతూవుండాల్సిందే!

యు.సూర్యప్రకాశ్‌రావు

కామెడీ కథ

# ప్రకృతి వైద్యం




ఉదయం ఎనిమిది గంటలయింది.

ఇంట్లో టిఫిను చెయ్యడానికేమీ లేవు. మార్కెట్టుకి వెళ్ళి తెమ్మని చెబుదామంటే ఆయన అయిపులేరు. రోజూ ఇంతే... ఇల్లంతా వెతకాలి. వీధులన్నీ గాలించాలి ఎక్కడ దాక్కున్నారా అని.

ఈయన ప్రకృతి వైద్యచికిత్సలో ఎంతమంది చిక్కుకున్నారో? అది వికటించి ఎంతమంది కేసులు పెడతారో? ఇవాళ ఆ సూచనలేవీ లేవు.

"ఇంతకీ ఈఅల్లావుద్దీన్ అద్భుత దీపం ఎక్కడి కెళ్ళాడే?" అడిగాను మా అమ్మాయి సంహితని.

ఈలోగా ఆయన రానేవచ్చారు.

"చెప్పు... ఏమిటి విషయం?" అడిగారాయన.

"రేపు అమ్మాయికి పెళ్ళిచూపులు. పదింటికి మంచి ముహూర్తమని చెప్పారు సిద్ధాంతిగారు. మరి... ఆటైమ్‌కిసంబంధం వాళ్ళొచ్చేసరికి తినుబండారాలన్నీ తయారుచేసి ఉంచాలి గదా! అందుకు కావలసిన సరుకులు కొనడానికి వెళ్ళాలి మీరు"

అది విని అయిష్టంగా తలాడిస్తూ "ఆడాళ్ళు... మీరు పోకూడదుటే?!" అన్నాడు.

మొండివాడు రాజుకన్నా బలవంతుడట... నేనూ రుకున్నానా... "అబ్బ... ఇల్లు కడిగి ముగ్గువేయాలి. సోఫాలు, కర్టెన్లు మార్చాలి. ఇంకా చాలా ఉన్నాయి లెండి" అని కాస్త చిరాకుపడ్డాను.

"ఊ..." తలాడిస్తూ బయటికొచ్చాడు.

ఆమర్నాడు... అనుకున్నట్లుగానే తెల్లారి లేచిన దగ్గర్నుంచీ ఊపిరి సలపని పనుల్లో పడి పోయాం ఇంటిల్లిపాదీ. అంతా హడావుడి.

క్యారెట్లని కోరుతున్నాను హల్వా కోసం... "పెళ్ళి చూపులంటే ఎక్కడైనా ఏ బూందీనో, కారప్పూసనో లేదా ఏ మైసూరుపాకో చేస్తారు కానీ ఇలా హల్వాలు చేస్తారా ఎక్కడైనా?" అన్నాను విసుగ్గా అది చేయమని ఆయనగారు ఆర్డరేసినందుకు.

అంతే.ధూం ధాం... అంటూ నామీద ఒకటే ఎగురుడు "అందరూ పెట్టే ఆ బూందీ, బూరెల్లో ఏముంటాయి విటమిన్స్సా, మినరల్స్సా? క్యారెట్‌తో చేసే హల్వాలో ఎన్ని విటమినులున్నాయి...అసలు మనిషికి అతి ప్రధానమైన 'ఏ' విటమిన్ ఉంది తెలుసా?" అంటూ ఆయన గ్రంథం విప్పబోతుంటే,

చేత్తో నా చెంపమీద నేనే తట్టుకుని ఓటమిని అంగీకరించినట్లుగా సైగచేశాను.

పదిగంటలకి ఠంచనుగా పెళ్ళిచూపులవాళ్ళు రానే వచ్చారు. సాంప్రదాయబద్ధంగానే సంహితని అలంకరించి వాళ్ళముందు కూచోబెట్టాం. పెళ్ళి కొడుకు ఇప్పుడొచ్చే సినిమాహీరోలకంటే చూడముచ్చటగా, చక్కగా ఉన్నాడు. పైగా ప్రభుత్వోద్యోగేనట. క్యారెట్ హల్వా తెచ్చి అందరికీ పంచాం.

"వావ్... వండ్రఫుల్..." రుచి చూసి మెచ్చుకున్నాడు పెళ్ళికొడుకు. అతని తల్లిదండ్రులు కూడా నిజమేనన్నట్లుగా తలలాడించారు.

నాకు గొప్ప అవార్డు వచ్చినంత సంబరం కలిగింది. కాఫీ తేవడానికి వంటగదిలోకెళ్ళాను. ఐదు నిమిషాల తర్వాత సంహిత వచ్చింది రవ్వంత ఆయాస పడుతూ. "ఏమైందే?" కంగారుగా అడిగాను.

"డాడీ ఆ పెళ్ళివాళ్ళతో క్యారెట్ ప్రత్యేకత గురించి సోది చెబుతున్నాడే... అసలు విషయాలు మర్చిపోయి" అంది వగరుస్తూనే.

అదిరిపోయాను కొంపలు మునిగినట్లు.

ఈయనకీ వైద్యాలపిచ్చొకటి. కొన్నాళ్ళు అలోపతీ, కొన్నాళ్ళు ఆయుర్వేదం, కొన్నాళ్ళు హోమియోపతీ, మరికొన్నాళ్ళకి అన్నిటినీ కలిపి ప్రయోగిస్తూంటారు. ఇప్పుడు కొత్తగా ప్రకృతివైద్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆయనకి దైవచింతన కంటే దేహచింతనెక్కువ. మా ఆరు అల్మారాలలోనూ నిండుగా ఉన్న పుస్తకాలన్నీ ఏదో ఓ వైద్యానికి సంబంధించినవే.

మార్కెట్లో ఏ రకమైన వైద్యపుస్తకం వచ్చినా మరుసటిరోజున మా ఇంట్లో ఉండి తీరాల్సిందే.

ఏ పేపర్లోనైనా కాన్సర్ గురించీ, 'క్షయ'ని గురించీ, కళ్ళజాగ్రత్తలగురించీ, పళ్ళచిగుళ్ళగురించీ వ్యాసాలు

ఎస్వీ కృష్ణజయంతి

వచ్చాయా... వాటిని జాగ్రత్తగా కత్తిరించి పదిలంగా ఫైలు చేస్తారు. నాలుగో అల్మారానిండా ఆ ఫైళ్ళే.

ఎప్పుడన్నా నేను పనిమీద మా పుట్టింటికి బెంగుళూరు వెళ్ళాల్సివచ్చినప్పుడు ఇంట్లో ఉన్న నా ఇద్దరు కూతుళ్ళు సంహిత, అద్వైతలిద్దరూ వాళ్ళ నాన్నచేసే ప్రకృతీవైద్యపరమైన వంటల తయారీకి గురయి కళ్ళు పీక్కుపోవాల్సిందే. నేనింటికి రాగానే ఇద్దరూ గొల్లుమంటారు.

"ఇదివరకులా కాదంటమ్మా ఇకనుంచి మనింట్లో. పొద్దున్నే కాఫీ, టిఫిన్లకి బదులు ఏకంగా భోజనం చేయడమేనట. ఆకలేస్తుంది గదా అని గబగబా తినేయకూడదంట. నెమ్మది నెమ్మదిగా... ఒక్కోముద్ద నమిలీ నమిలీ మింగాలట.

ఇంకా నాన్న చెప్పటం చూడు. ద్రవపదార్థాలని నమలాలట. ఘనపదార్థాలని తాగాలట. తిన్నంత సేపూ నీళ్ళు తాగరాదట. తిన్న తర్వాత ఓ గంట గడిచాక రెండు లీటర్ల నీళ్ళు తాగాలట.

పాపం... అలా చేసినందుకు అక్కయ్యకి ఓ సారి వాంతయ్యిందే! అయినా నాన్న వదల్లేదు. ఇక వేపుళ్ళు చేసి భోజనంలో తినకూడదట. అందులో విటమినులూ అవీ నశిస్తాయట. పచ్చికూరగాయల్ని ఎక్కువగా ఉడికించకూడదట.

కొరుక్కుని తినేయాలిట. అసలు మనం తినేది అసహజమైన ఆహారమట..." అది విని నాకు మూర్ఛ వచ్చినంత పనైంది.అప్పట్నుంచి రాత్రిళ్ళు రోజూ ఆయన్ని తిట్టందే నిద్రపట్టడం లేదు.

ఆయనగారి ప్రకృతివైద్యంతో పిల్లల్ని హడలెత్తిస్తున్నందుకు. పిల్లల పెళ్ళిళ్ళు త్వరగా కుదర్చమని ఆ దేవుణ్ని మొక్కని రోజులేదు.

ఇప్పుడు భగవంతుని దయవల్ల పెద్దపిల్లకి మంచి సంబంధం వచ్చింది. మళ్ళీ ఆ సంబంధం వాళ్ళతో కూడా ఆయన తన పైత్యం గురించి వివరిస్తున్నాడని తెలీగానే కాఫీ కప్పులటాగే వదిలేసి గబగబా హాల్లోకి పరిగెత్తుకువచ్చాను.

అప్పటికే ఆయన లెక్చర్ చాలా తీవ్రస్థాయిలో ఉంది. "ఇప్పటిదాకా క్యారెట్ గురించి అన్ని ప్రత్యేకతల్ని చెప్పానే. అలాగే మరోటుంది అది గుడ్డు.అంటే ఎగ్. కోడిగుడ్డన్నమాట. ఆ గుడ్డుని పగులగొట్టి దానంతా వాడేసి పెంకుని పడేస్తాం కదా... కానీ ఆ పెంకులోనే ఎన్నో ప్రత్యేకతలున్నాయి. ఆ పెంకుని పగలగొట్టి పిండిగా నలగ్గొట్టి" అని చెప్పబోతుంటే,

నేను పెద్దగా అరిచినట్లుగా "అసలు విషయం మరిచిపోయారండీ" సిద్ధాంతిగారు అర్జంట్‌గా ఒకటి చెప్పమన్నారు.ఇటురండి" అన్నాను. ఆసరికే ఆయనగారి క్లాస్‌ని వంటబట్టించుకున్న పెళ్ళికొడుకు ఠకీమని,

"యస్... మీరు చెప్పింది ముమ్మాటికీ కరెక్టండీ... ఆ పెంకుని పిండిగా నలగ్గొట్టి" అని ఆగాడు తన ప్రతిస్పందనని తెలియజేయాలన్నట్లుగా. ఆయనగారు తన లెక్చర్‌ని ఇంకా చెప్పమన్నట్టుగా! దాంతో

## చేదు అనుభవాల్లేవ్

చిత్రపరిశ్రమ గురించి విన్న అనేక ప్రతికూల విషయాలు తనకి ఎటువంటి చేదుఅనుభవాలనూ ఇవ్వలేదంటున్నది 'అలియాస్ జానకి' ఫేమ్ అనీషా ఆంబ్రోస్.

"మొదట్లో మా అమ్మానాన్నలు సినిమాల్లోనటిస్తానంటే అస్సలు ఒప్పుకోలేదు. బ్రేకప్స్, వివాదాలు, కాస్టింగ్ కోచ్ వంటి విషయాలు వింటుంటాం కదా. వీటి గురించి భయపడ్డాను. కాని అటువంటివేమీ ఎదురవలేదు. ఇక్కడివారు ఎంతో ప్రొఫెషనల్‌గా పనిచేసేవారు ఉన్నారు.

అటువంటి నిర్మాణసంస్థలు వున్నాయి. కాబట్టి చిత్రపరిశ్రమకు వచ్చే యువతులు భయపడాల్సిన అవసరం లేదనేది నా అభిప్రాయం. ఓ నటిగా నాకు సూటయ్యే అన్ని పాత్రలూ చేయాలన్నది నా కోరిక" అని చెప్పింది అనీషా ఆంబ్రోస్.



ఆయనగారు నా అరుపుని మర్చిపోయి "ఈ అరటి పండు గురించి విన్నారా" అంటూ టేబుల్ మీద ఉన్న అరటిపండుని చూపించారు... హిప్నాటిస్ట్ మెస్మరిజమ్‌లోకి తీసుకెళ్ళబోయేట్టుగా.

నాకు బి.పి. లేదుగానీ ఇంచుమించు అలాంటిదే పెరుగుతోంది ఆ వ్యవహారం చూస్తుంటే. ఆ అరటి పండు మీద గంట, తేనె మీదొక గంట, వెల్లుల్లి మీదొక గంటా... అవలీలగా క్లాసు పీకేయగలడు నా పతిదేవుడు! వ్వార్ని... దానికిదా సమయం? వీళ్ళా అవి వినవలసినవాళ్ళు? వామ్మో... ఉన్నఫళాన జెండా పీకేస్తారేమోనని గుండె లయ తప్పింది.

కానీ... చిత్రాతిచిత్రంగా నాకు నిజంగానే బి.పి. పుట్టించేంత సంఘటన జరిగింది. ఆ పెళ్ళికొడుకు సైతం ఏకంగా నా పతిదేవుడి చేతిలో ఉన్న అరటి పండుని లాక్కుని, "ఓ మామగారూ... ఓకే ఓకే... ఈ అరటిపండు గురించి ఇంకా చెప్పండి. ఇది నాకు కడుపునొప్పి తెప్పిస్తుంది.

ఏముందిందులో...జిగటపిండిపదార్థం తప్ప.దీన్ని ఒక్కదాన్ని ఐదు రూపాయలు పెట్టి కొని తినడం కంటే ఓ వెల్లుల్లి కొని దాన్ని తేనెలో కలుపుకునినానేసుకుని తినడం చాలా బెటరని ఈ మధ్యే పేపర్లో ఓ వ్యాసం చదివి తెలుసుకున్నాను. అప్పట్నుంచి అరటి పండ్ల గురించే మర్చిపోయాను" అనడం.

"అవును అన్నయ్యగారూ...మా వాడు చెప్పింది కరక్టే సుమండీ. అది విన్న దగ్గర్నుంచి నేనిక అరటిపండ్లు కొనడం మానేశాను" అంటూ అతని తల్లి, "నేను కూడా అంతే బావగారూ... వాళ్ళేది తెచ్చిపెడ్తే అది తినడం" అని అతడి తండ్రీ...

ఇదంతా చూడగానే నాకు గుండాగి ఈ క్షణానే పోతానేమోనన్పించింది.

నా కూతురిని తల్చుకుని జాలేసింది.

తర్వాత అందరూ కారప్పూస తినడంలో పడిపోయారు. కాఫీలు ఇవ్వడానికి వంటింట్లోకి మళ్ళీ దూరాను. ఈసారి ఆ కప్పులు తీసుకునివచ్చేసరికి టాపిక్ శరీరంలో వివిధభాగాల మీదికి వెళ్ళింది.

మనిషి శరీరంలో ఎన్ని గాలన్ల నీరుంటుందో మొదలుకొని శరీరంలోని పదార్థాలతో ఏమేమి చేయవచ్చునో చెబుతున్నారు.

నేనిక వినడం మానేశాను. ఎందుకంటే... అవన్నీ మాకు కొట్టిన పిండే. మారెండో అమ్మాయి అద్వైతని అర్ధరాత్రి లేపిఅడిగితే 'మనిషి శరీరంలో 10గ్యాలెన్ల నీరు ఉంటుందనీ, తక్కిన పదార్థాలతో ఏడు బార్ సోపుల్నీ, 9000 పెన్సిళ్ళనీ,

2,200 అగ్గిపుల్లలకి సరిపడా మండే మతాబునీ, ఓ పెద్ద బకెట్టుకు సున్నాన్నీ, నిండు గరిటెడు మెగ్నీషియన్నీ, రెండు అంగుళాల పొడవున్న తీగ మేకునీ తయారుచేయొచ్చు' అని చెబుతుంది, నిద్ర మత్తయినా వీడకుండా. మరి ఆయనగారి పెంపకమా? మజాకా? ఈసారి పెళ్ళికొడుకు తండ్రి తన 'దేహచింతన' గురించి ప్రకటించుకుంటున్నాడు.

తనకు ఇష్టమైన వైద్యం ఆయుర్వేదమట... అలోపతి అంటే గిట్టదట.

ఓ దేవుడా... వీళ్ళు ఆ అండపిండ



మా కాంగ్రెస్ పార్టీలో అభ్యర్థుల ఎంపికలో డబ్బు పాత్ర ప్రముఖంగా మారింది.

-వీరప్ప మొయిలీ, కాంగ్రెస్ నేత

బ్రహ్మాండ దేహచింతననీ, వైద్యచింతననీ వదిలి సంసారచింతనతో పెళ్ళివిషయాలు ఎప్పుడు మాట్లాడుకుంటారయ్యా?

నేను రెప్పవేయకుండా ఓ ఐదు నిమిషాలు మా వారి వైపు చూశాను. ఏ క్షణమైనా నావైపు చూస్తారేమో పక్కకు పిల్చుకుపోయి రెండు తగిలించి 'కిం కర్త వ్యం' గుర్తుచేద్దామని!

ఊహూ... చూళ్ళేదు సరికదా కాఫీ తాగుతూ, అందులో 'కెఫిన్' అనే విషపదార్థమున్నట్లు, కేన్సర్లా గట్రా జబ్బులొచ్చే ప్రమాదాలున్నాయంటూ ఆయన చెబుతుంటే నా కోపం నషాళానికంటింది.

కమ్మగా తాగేదాంట్లో, తినేదాంట్లో విషపదార్థాలు వెతుక్కుంటూ కూర్చున్నవాళ్ళ విజ్ఞానానికి నా నరాల్లో రక్తానికి బదులు కారపునీళ్ళు ప్రవహిస్తున్నట్లని పించింది. "ఏవండోయ్... లోపల మీ పర్సనల్ ఫోన్ కేకలు పెడుతున్నారు. పెరట్లో బట్టలుతుకుతున్న దాన్నల్లా శుభ్రంగా సబ్బుచేతిని కడిగేసుకునివెళ్ళాను. "ఏం చేస్తున్నావింతసేపూ? ఎంతసేపు పిలవాలి నిన్ను?" అన్నారు నా పతిదేవుడు అసహనంగా.

'గిన్నెలు కడుగుతున్నా' అని చెప్పబోయాను. వెంటనే ఆయనగారితో జోకులు వేయడం, సతి ధర్మాల్లో విరుద్ధాంశంగా భావించి "ఆ... ఏం లేదండీ... బట్టలుతుకుతున్నాను" అన్నాను.

"ఆ.. గొప్పపనే... ఆ బట్టలపనీ, నీళ్ళపనీ పెట్టు కున్నావంటే నీకిక ఈ ప్రపంచమే గుర్తుకురాదు"

"అబ్బ. ఏంటి చెప్పండి"

"అసలు ఈరోజు పేపరు చదివావా?"

"లేదే. ఏమైంది? ఏమిటి విశేషం?"

"ల్యూకోడర్మామీద చక్కటి వ్యాసం వచ్చిందే"

"అర్థంకాలేదా.. ల్యూకోడర్మా అంటే బొల్లి. తెలుగులో దాని శాస్త్రీయనామము 'శ్వేత కుష్ఠు' అంటారు. అదన్నమాట"అని నిర్వచనం చెప్పారు.

"అయితే ఏమిటంట?"

"ఏమిటంట అంటే ఏం చెప్పనే పద్మా... ల్యూకో డర్మాకు యునానీ వైద్యంలో మంచి మందు ఉందట. అదే ఈ వ్యాసంలో సారాంశం.ఇప్పటికి చాలా కేసులు నయమయ్యాయట"

"అయితే ఏంటండీ... అర్జంట్‌గా మనింట్లో ఎవరి కన్నా బొల్లి రావాలనా మీ ఆశయం?"

"ఛ... ఛ... నీ లైఫే వేస్టు.

ఇలాంటి వ్యాసాల్లో ఎంత విజ్ఞానం ఉంటుందీ, ఎంత కథ... నేనింతకాలం 'యునానీ' వైద్యాన్ని నిర్లక్ష్యం చేశాను... ఇప్పుడు దిగులేస్తోంది"

నాకు తిక్కరేగింది.



మోగుతోంది" బొంకాను.

"ఫోనా? ఇటు తీసుకురా" "పర్సనల్ అండీ... మీరే మాట్లాడాలట. వెంటనే రమ్మంటున్నారు"

తన సబ్జక్టు సగంలో ఆపేసినందుకు... హీరో థర్డ్ క్లాస్ విలన్‌ని చూసినట్టు నావైపొకసారి చూపుల తూపుని విసిరి లోపలికి వచ్చేశారు. నేను వెంటనే టైమ్ వేస్ట్ చేయకుండా చెప్పేశాను.

పెళ్ళిమాటలు మాత్రమే మాట్లాడమని. అన్నీ కుదిరి, బేరసారాలు, కట్నకానుకలు, ఒప్పందాలు, ముహూర్తాలు అన్నీ అయ్యాకే ఎంతకాలమైనా... జీవి తాంతం మాట్లాడుకోవచ్చని సలహా ఇచ్చాను.

దాంతో ఆయన నావైపు చురచుర ఓ చూపుచూసి గంటకి రెండుందల కిలోమీటర్ల నిట్టూర్పు ఒకటి అతిగాఢంగా వదిలి... అర్థమైనట్లు తలాడించి అక్క డ్నుంచి కదిలారు. ఆ తర్వాత దేవుడి దయవల్ల, నా పతిదేవుడి లెక్చరు సాన్నిహిత్యంవల్ల అన్నీ కుదిరి పెళ్ళిముహూర్తం ఖరారైంది.

"పద్మా... పద్మా..." మావారు బయటిగదిలోంచి జుట్టుపీక్కోవాలన్పించింది. 'డర్మా ఏమిటి బర్మా లాగ?' గొణుక్కుని "ఆహా... ఏదైనా పనిముట్టు కని పెట్టారా?" అన్నాను ఆసక్తి నటిస్తూ.

"నీ తలకాయ్. నువ్వు ఎం.ఏ. చదివావు కానీ, నీ తలలో మెదడు పెరగలేదు. ఇన్నేళ్ళు నాతో కాపురం చేసిన నీకు ఏం వచ్చిందసలు?

పూలకి కట్టిన దారానికీ, ఇంగువ చుట్టిన గుడ్డకీ వాటి వాసన అద్దుతుందంటారే...

మరి నీకూ? నా సాహచర్యంతో నీకీ జన్మకి వైద్యజ్ఞానం వస్తుందా అంట?"

ఒంట్లో ఏం వచ్చినా అన్నిటికీ రోగాల పేర్లు పెట్టే యడం, పుట్టుమచ్చ కాస్త పెద్దదిగా కనబడితే కేన్స రనడం, కడుపునొప్పి వస్తే అల్సరనడం,

చిన్నగా దగ్గితే టి.బి. అనడం, తెల్లటి మచ్చ కనబడితే దాన్ని గిల్లి,గిచ్చి,రక్కి,పొడిచి డాక్టరు దగ్గ రికి పోయి వందలు వేలయినా సరే ఖర్చుపెట్టి అది ఫలానా జబ్బు కాదని నిర్ధారించుకున్నాకే స్థిమితపడే ఈయనగారి సాహచర్యంలో ఏం జరుగుతుంది?

"దిగులుపడకండీ... వాటిమీద పుస్తకాలు ఉంటాయి తెప్పించండి. అది ఏదో చైనా వైద్యం ఒకటుందిగా ఆక్యుపంక్చర్ అనీ...

అదీ మరిచిపోకండి. వాటి మీద పుస్తకాలుంటాయి అవీ తెప్పించండి.అవన్నీ తెప్పించి మాపైన రుద్దండీ... మా మెదళ్ళని తినేయండీ" అన్నాను ఆవేశంతో.

"ఏమిటే నీ ఆపసోపాలు? ఈ నవీనకాలంలో అన్ని వైద్యాలూ ఎంత ప్రగతిని సాధిస్తు న్నాయి? అది ఏ వైద్యమైనా మానవాళి శ్రేయస్సుకేగా!" అన్నారాయన అయోమయంగా ముఖం పెట్టి.

మమ్మల్ని ఇక ఏ దేవుడూ రక్షించలేడన్న విషయం స్పష్టమైపోయింది నాకు. అలా నిలువుగుడ్లేసుకుని శూన్యంలోకి చూస్తుండిపోయాను.

నా పతిదేవుడి సాహచర్యంతో ఇకముందు నేను వేదాంతినై, పుస్తకాల్లో, పేపర్లలో ఆధ్యాత్మికతమీద రాసేవ్యాసాలు, ఆర్టికల్సూ, అన్నీ చదివి...

ఆ వైరాగ్యమంతా అందరికీ ఎక్కించడానికి తయారవుతానేమో?!!

# వారఫలం

**మార్చి 29 నుండి ఏప్రిల్ 4, 2018 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064

**మేషం :** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. ఆర్థిక లావాదేవీలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అన్నిటా ఊహాత్మకంగా వ్యవహరించుకోగలరు. బంధుమిత్రుల విందులలో పాల్గొనగలరు. ఉత్సాహమునిచ్చు సమాచారములు ఉంటాయి. సంప్రదింపులు-గతంలో నిలచినవి చేపట్టి పూర్తిచేసుకొందుకు వీలయిన సమయం. కుటుంబమున కొత్తదనములు ఉంటాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమ వారములు అనువైనవి.

**వృషభం :** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. ఈ వారమందు విమర్శలు-ప్రతి విమర్శలతో సాగగలరు. అంచనాలు కొన్ని ప్రతికూలించగలవు. ఆంతరంగికములను వెల్లడించకుండా లౌక్యంలతో సాగండి. కుటుంబ పెద్దల వాత్సల్యములు పొందగలరు. పిల్లల ఉన్నత చదువులపై దృష్టి నుంచగలరు. అవివాహితులు నిరుత్సాహాలకు గురికాకుండా సాగాలి. ఆర్థిక అనుకూలతలచే పోరాటపటిమతో సాగగలరు. ఈ రాశివారికి గురు, శుక్ర, సోమ, బుధ వారములు అనువైనవి.

**మిథునం:** మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. ఈ వారమందు ఖర్చులు ఎక్కువగా ఉండగలవు. డబ్బుకు లోటులేని స్థితులుంటాయి. విందులకు హాజరవ్వగలరు. చేపట్టిన పనులను పట్టుదలలతో పూర్తిచేసుకోగలరు. భాగస్వామికి మీ సహాయ సహకారాలు అవసరమవ్వగలవు. హడావిడిగా పనులను పూర్తిచేయకండి. బంధుమిత్రుల కలయికలు ఏర్పడతాయి. ప్రయాణములందు మెలకువలు పాటించుకోండి. ఈ రాశివారికి గురు, శుక్ర, బుధ వారములు అనువైనవి.

**కర్కాటకం:** పునర్వసు 4వపా, పుష్యమి, ఆశ్లేష. మీ యత్నములను ఒంటరిగా సాగించవలసిరావచ్చును. కుటుంబాన సామాన్యతలు కొనసాగుతాయి. పరిచయాలు బలపడతాయి. ఋణవిముక్తికై యత్నములు సాగుతాయి. ఖర్చులకు తగినట్లుగా ప్రయోజనములు ఉంటాయి. సంతానము నుండి కొన్ని వ్యతిరేకములు పొందు సూచనలు ఉన్నాయి. ఇతరులకు ఉచిత సలహాలిచ్చుటకు దూరంగా ఉండండి. ఈ రాశివారు ముఖ్యమైన పనులు చేపట్టుటకు శని, ఆది, బుధ వారములు అనువైనవి.

**సింహం:** మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. అభీష్టాలను నెరవేర్చుకొను దిశగా యత్నములను చేపట్టుకోగలరు. కుటుంబ వ్యక్తుల సహాయాలచే కొన్ని పనులను తేలికగా పూర్తి చేసుకోగలరు. సంతానపు వ్యవహారాలను కొన్నిటిని సరిదిద్దవలసిరావచ్చును. సలహాలువంటివి స్వీకరించకండి. ఆలోచనలందు సరళత్వము లోపించకుండా జాగ్రత్తలు అవసరము. అధికారులవంటివారితో రాజీయత్నంలతో సాగండి. ఈ రాశివారికి గురు, శుక్ర, సోమ వారములు అనువైనవి.

**కన్య :** ఉత్తరఫల్గుని 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా. వివాహ యత్నములను తీవ్రంగా సాగించగలరు. కొన్ని సమాచారములు ఉత్సాహమునిస్తాయి. సంప్రదింపులను వేగవంతం చేస్తారు. చేపట్టుకొన్న పనులు అటుయిటుగా పూర్తికాగలవు. ఖర్చులు కొన్ని అధికంగా ఏర్పడినా ప్రయోజనములను పొందుతారు. పెద్దల సలహాలు స్వీకరించలేకపోతారు. మొండిబకాయిలపై దృష్టి సారించగలరు. వస్తు జాగ్రత్తలు అవసరం. ఈ రాశివారికి శని, ఆది, బుధ వారములు అనువైనవి.

**తుల:** చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3 పా. మీ నిర్ణయములకు మంచి ఆలోచనలను తోడుచేయండి. ఒకప్పుడు వ్యతిరేకించినవారు మీకు దాసోహమవ్వగలరు. మిత్ర సలహాలు, ఆప్తుల ఆదరణలు పెరుగుతాయి. పనులను సకాలంలో పూర్తిచేసుకోగలుగుతారు. ఆదాయ మార్గముల వృద్ధికై కొత్త పనులను తలపెట్టగలరు. అన్నిటా వ్యక్తిగత పర్యవేక్షణలకు ప్రాధాన్యతనీయండి. ఈ రాశివారు ముఖ్యమయిన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, సోమ వారములు అనువైనవి.

**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ముఖ్యమనుకొన్న పనులను చేపట్టి పూర్తిచేసుకోవాలి. కుటుంబ వ్యక్తుల సహాయ సహకారాలు అన్నిటా ఉంటాయి. ఖర్చులకు తగినట్లుగా ఆదాయాలు ఉండగలవు. వాగ్విషయములందు లౌక్యముతో సాగండి. పెట్టుబడులకు తగిన సమయం కాదు. చెల్లింపులను పూర్తిచేసుకోగలుగుతారు. ఏకపక్ష పోకడలు పనికిరావు. ఈ రాశివారు ముఖ్యమయిన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శని, ఆది, బుధ వారములు అనువైనవి.

**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. ఈ వారంలో కొన్ని చికాకులు పెరుగుతాయి. ఇబ్బందులు ఏర్పడతాయని ఊహించుకొంటారు. మీ పనులను ఎవ్వరికి అప్పగించక మీరే చేసుకొంటే ఏ సమస్య రాదు. ఆర్థికంగా కొన్ని అదనపు ఖర్చులుంటాయి. మీ పనులను పరిపూర్ణంగా పూర్తిచేసుకోగలుగుతారు. పిల్లల, కుటుంబ సభ్యుల వ్యవహారాలు అనుకూలంగా సాగుతాయి. శివాలయ దర్శనాలు తప్పనిసరి చేయండి. వీరికి శని, ఆది, సోమ వారములు అనువైనవి.

**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. మానసికంగా హుషారుగా ఉండడానికి ప్రయత్నాలు అవసరం. ముఖ్యము అనుకొన్న పనులనే చేపట్టుకోండి. పనిలో సంతృప్తి లేకపోయినా కర్తవ్యాలకు అంకితమవ్వండి. వ్యాపార, వ్యవహారాలకు తొందరతనములు ఏర్పడకుండా జాగ్రత్తలు అవసరం. ఆత్మీయులను దూరం చేసుకోకుండా లౌక్యంలతో సాగండి. కాలాతీతములు ఏర్పడకుండా వ్యవహరించుకోండి. ఈ రాశివారికి గురు, శుక్ర వారములందు అన్నిటా మెలకువలు అవసరం.

**కుంభం:** ధనిష్ఠ 3, 4 పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. కొన్ని ఊహించని పరిచయాలు మీ ఉన్నతికి ఉపకరిస్తాయి. అవకాశాలను అందిపుచ్చుకోగలరు. ఆత్మీయుల నుండి సహకారాలు పొందుతారు. బంధుమిత్రులతో సత్సంబంధములు నెలకొంటాయి. అవసరాలకు తగినట్లు డబ్బు సర్దుబాట్లు వుంటాయి. ఊహించుకొన్నట్లుగా అన్నిటా వ్యవహరించుకోగలరు. పిల్లల ఉన్నతికై యోచించగలరు. ఈ రాశివారికి శని, ఆది వారములందు అన్నిటా మెలకువలు అవసరం.

**మీనం:** పూర్వాభాద్ర 4వపా, ఉత్తరాభాద్ర, రేవతి. మీతో ప్రమేయం లేనట్లుగా వ్యవహారాలు సాగుతాయి. మనోచింతనలకు దూరంగా ఉంటూ తెచ్చిపెట్టుకొన్న బిజీతనముతో సాగవలసి వుంటుంది. ఆదాయాలకు తగినట్లుగా ప్లానింగ్‌తో వ్యవహరించుకోవాలి. ప్రముఖులు-అధికారులువంటివారితో సత్సంబంధములు నెలకొంటాయి. కుటుంబ వ్యవహారాలలో దాపరికములకు దూరంగా ఉండండి. వీరికి సోమ, మంగళ వారములందు అన్నిటా మెలకువలు అవసరం.

**పునాది లోతుగా ఉంటే భవనం బలంగా ఉంటుంది. బాధలు అధికంగా అనుభవిస్తేనే జీవితం అందంగా తీర్చిదిద్దబడుతుంది.**

# సెక్స్ AND సైకాలజీ



కె.ఎల్. కాకినాడ

మా ఆయన ధోరణి నాకు ఏమీ అంతుపట్టడు. చివరికి పడకగదిలోకి రావాలన్నా తల్లి ఆదేశం ఉండాల్సిందే. అమ్మ ఏంచెబితే అలాగే చేస్తా రాయన. అసలు నా గురించి ఏమీ పట్టించుకోడు. ఏదడిగినా సరిగ్గా సమాధానం ఇవ్వడు. నేనాయనని ఏమాత్రం కాల్చుకుని తినను. ఐనా నేనంటే లెక్కే లేదు. అమ్మ కొంగుచాటున ఉండటమేమిటి? భార్య ఉందని ఆలోచన చేయకపోవడమేమిటి? ఇలాంటి భర్తని మార్చడం కుదురుతుందా?

కొందరికి తల్లితో చాలా ఎటాచ్‌మెంట్ ఉంటుంది. పెళ్ళయినప్పటికీ భార్యతో ఎటాచ్‌మెంట్ ఏమాత్రం పెంచుకోరు. సాధారణంగా పెళ్ళి అయినతరువాత భార్యమీద మోజు కలుగుతుంది. వాళ్ళల్లో కలిగే లైంగిక ప్రేరణలు భార్యకి దగ్గర చేస్తాయి.

తల్లితో మరీ ఎటాచ్‌మెంట్ ఉన్నవాళ్ళల్లో ఈ ఫీలింగ్స్ ఎక్స్‌ప్రెస్ అవ్వవు. దానికితోడు తల్లి యాటిట్యూడ్ కూడా దీనికి తోడవుతుంది.

సాధారణంగా పెళ్ళి అయినతర్వాత భార్యతో క్లోజ్‌గా మెలగడానికి, తిరగడానికి తల్లి ప్రోత్సహిస్తుంది. కాని మీ విషయం తీసుకున్నట్లయితే తల్లి, కొడుకు తనకి ఎక్కడ దూరమైపోతాడోనని అతనితో మరింత ఎటాచ్‌మెంట్ పెంచుకుంటోంది. దాంతో అతను మీకు దగ్గర కాలేకపోతున్నారు.

అయినప్పటికీ ఇలాంటివాళ్ళు మారతారు. అతనికి కౌన్సిలింగ్ కావాలి.

కౌన్సిలింగ్ ద్వారా అతనిలో దాంపత్య జీవితం గురించి ఆలోచన మొదలవుతుంది. నిదానంగా మీకూ దగ్గరవుతారు. కొద్దిగా ఓపిక పట్టండి. మీరు ఇద్దరూ డాక్టర్‌దగ్గరకి కౌన్సిలింగ్‌కోసం వెళ్ళండి.

Courtesy : THE MAN



డా॥ జి. సమరం

*సి.ఎల్. సీతానగరం*

*నా వయస్సు 17 సంవత్సరాలు. 4-5 రోజులకి ఒక్కసారి నిద్రలో వీర్యం పడిపోతుంది.దానివల్ల నేను చాలా వీక్ అవుతున్నాను. అద్దంలో చూసుకుంటే నా ముఖంలో కాంతి లేకుండా కనపడుతోంది.*

*వీర్యం ఇలా పోకుండా ఉండా లంటే ఏం చేయాలి? ఏదయినా సలహా చెప్పండి.*

వీర్యం పోవడంవలన ఎవరూ నీరసపడరు. వీర్యం ఏమాత్రం విలువైందికాదు. ఎంత వీర్యం పోయినప్పటికీ ఎటువంటి బాధలూ కలగవు. కాని తరతరాలుగా వీర్యం గురించి అర్థంలేని భావాలు సమాజంలో ప్రబలి వున్నాయి. వీర్యం పోతే మనిషి వీక్ అవుతాడని, ముఖంలో కళ పోతుందని అపోహ చెందుతారు.

వీర్యం గురించి ఇటువంటి అపోహలు మీలోనూ ఉండబట్టే వీర్యం పోతే బలహీనం అయ్యానని అనుకుంటున్నారు. యుక్తవయస్సు వచ్చినతర్వాత నిరంతరం వీర్యం తయారవుతూనే ఉంటుంది.

అలా తయారయిన వీర్యం ఏదో ఒక విధంగా బయటకు పోవలసిందే. అది పోకుండా ఉండదు. విలువ లేని వీర్యంగురించి మీరు దిగులు చెందడం, ఆలోచించడం అనవసరం.

*బి.ఆర్.కె. కావలి*

*నాకు షుగరు ఉంది. దానివలన నేను అంతగా సెక్స్‌లో పాల్గొనలేకపోతున్నాను. నాకు తరచూ మూత్రం రావడం ఉంది. మూత్రంలో మంట అనిపిస్తోంది. సెక్స్‌లో పాల్గొన్నప్పుడు కూడా లింగం పచ్చిగా మారుతోంది. ఎందుకిలా జరుగుతోంది?*

షుగర్ కంట్రోలులో ఉండకపోతే మూత్రం మాటిమాటికీ రావడం, మంట పుట్టడం ఉంటుంది. బెల్లం ఉన్నచోట చీమలు చేరినట్లుగానే షుగరు ఉన్న వ్యక్తిలో క్రిములు తేలికగా చేరతాయి. అలా చేరడంవల్లనే మూత్రం మంటనిపిస్తోంది.

షుగరు ఉన్నవాళ్ళకి పురుషాంగం కూడా పుండుగా మారుతుంది.

సెక్స్‌లో పాల్గొన్నప్పుడు మంటనిపిస్తుంది. మీరు షుగరుని పూర్తిగా అదుపులో ఉంచుకోండి. మూత్రం కల్చర్ టెస్ట్ చేయించుకుని ఎటువంటి క్రిమి ఉన్నదీ, దానికి కరెక్ట్ మందు తెల్సుకుని మందులు వాడండి. మీ బాధలు తొలగిపోతాయి.

*ఎల్.బి. కరీంనగర్*

*నా వయస్సు 22 సంవత్సరాలు.నాకు ఫిట్స్ వ్యాధి ఉంది. మందులు వాడుతున్నాను. కాని అప్పుడప్పుడు ఫిట్స్ వస్తూనేవున్నాయి. పెళ్ళి అయింది. ఫిట్స్ వ్యాధి ఉన్నప్పుడు గర్భంవస్తే ఏమైనా ప్రమాదమా?*

ఫిట్స్ వ్యాధి ఉన్నప్పటికీ గర్భం దాల్చవచ్చు. పిల్లలని కనవచ్చు. ప్రమాదం ఏమీ ఉండదు. గర్భంకావాలనుకున్నప్పుడు మీ డాక్టర్‌కి మీ ఆరోగ్యం గురించి తెలియచేయండి. వారు చెప్పినట్లు చేయండి.

*కె.ఎల్. కావలి*

*స్త్రీలు ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకుంటే లావు అయిపోతారా?*

స్త్రీలు ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకుంటే లావు అవ్వరు. లావు అవ్వడానికి, ట్యూబెక్టమీకి సంబంధం లేదు. ఎటువంటి ఆలోచనా లేకుండా ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకోవచ్చు.

Kiss anywhere on her body that bends-neck, elbow, waist, bikini creases... These spots tend to be really sensitive



# సీరియల్



"మన అమ్మాయిల హార్మోన్స్ వేరు! మన ఎమోషన్స్ వేరు! నాకు డేట్ వస్తే తను నన్ను ఎంతో జాగ్రత్తగా ఎగ్జాక్ట్‌గా మా మమ్మీలా చూసుకుంటుంది. నేనూ అంతే!తన డేట్‌టైమ్‌లో కాలు కిందపెట్టనివ్వను.తనెక్కడ సెన్సిటివో నాకు తెల్సు!

నేనెక్కడ సెంటీ అయిపోతానో తనకు బాగా తెల్సు! మేము ప్రేమగా పనుల దగ్గర్నుంచి బహుమతుల దాకా అన్నీ షేర్‌చేసుకుంటాం! ఇన్ని సంవత్సరాల్లో తను నన్నెప్పుడూ హర్ట్ చేయలేదంటే నీకు నమ్మటానికి టైమ్ పడుతుంది కానీ అది నిజం! తను తనకన్నా నా గురించే ఎక్కువ ఆలోచిస్తుంది.

నేనూ అంతే! తనెలా సంతోషంగా ఉంటుందీ తనని ఎలా సంతోషపెట్టాలి అనే ఆలోచిస్తాను. నువ్వే చెప్పు! ఇంత బ్యూటిఫుల్ రిలేషన్‌షిప్ ఎక్కడైనా ఉంటుందా? అయ్ లవ్ హర్ సో మచ్! షి ఆల్సో లవ్స్ మి! మాకసలు మగాళ్ళ అవసరమే లేదు.

అందుకే జీవితాంతం మేమిద్దరం తోడూనీడగా కలిసి ఉందామని అనుకుంటున్నాం!

మేము కలిసి జీవిస్తాం! మేము పెళ్ళి చేసుకుందామని అనుకుంటున్నాం! ఎటూ మా ఇద్దరి తల్లితండ్రులు ఈ పెళ్ళికి ఒప్పుకోరు కాబట్టి వాళ్ళకి చెప్పాలని కూడా అనుకోవటం లేదు.మాకు మిగిలిన సమాజంతో అవసరం లేదు.

మ్యారేజ్ బాండ్ రాసుకుని ఇక్కడే పెళ్ళి చేసుకుని, అందర్నీ పిలిచి గ్రాండ్‌గా పార్టీ ఇస్తాము. నిజానికి పెళ్ళిలాంటి రిచ్యువల్స్ అవసరం కూడా లేదు. మాకు ఒకరిపట్ల ఒకరికి నమ్మకం ఉంది.

అయితే మేము పెళ్ళీ ఆ సరదా, ఆ ఫన్ అదంతా మిస్సవ్వాలనుకోవటం లేదు. మా జీవితాల్లో అది కూడా మేం రెలిష్ చేయాలి! పైగా ఇక్కడ ఫ్రెండ్స్‌లో కూడా అందరికీ తెలియాలి కదా? ఇక్కడ మాలాంటివాళ్ళు చాలామంది ఉన్నారు.

ఇద్దరమ్మాయిలు పెళ్ళిచేసుకుని కలిసి జీవిస్తున్నారన్న విషయమేమీ అసహజంకాదు. మాలాంటి లెస్బియన్స్‌కి సపోర్ట్ ఇచ్చే ఓ పెద్ద క్లబ్ ఉంది. వాళ్ళంతా సమానహక్కుల కోసం పోరాటం చేసి చాలావరకు విజయం సాధించారు. వియ్ ఆర్ వెరీ ప్రౌడాఫ్ దెమ్! మేం కూడా అందులో సభ్యత్వం తీసుకున్నాం! కాబట్టి బోల్డ్‌గా మేం కలిసి జీవించబోతున్నామని డిక్లేర్ చేస్తాం!

ఇద్దరమ్మాయిలు ఒక్క ప్రాణంగా కలిసి జీవించటం సాధ్యమేఅని మేము ప్రపంచానికి చాటిచెప్పబోతున్నాం!

ఇక్కడ ఎక్కడైనా 'మాలాంటి' స్నేహితులు ఉంటే వాళ్ళు మమ్మల్ని చూసి ఇన్‌స్పైర్ అయ్యి బయటకు వచ్చి ఓపెన్ అవుతారు. మాలాగే వాళ్ళూ ధైర్యంగా ఒక్కటవుతారు.

యశూ! నువ్వు చూస్తుండు!మేమేకాదు. రాబోయే



కాలంలో ఇంకా చాలామంది మాలాగా బయటకు వస్తారు. రాన్రాను, మా రిలేషన్‌షిప్ మాత్రమే సహజమైనదీ అనీ ఒక ఆడా మగా కల్సి ఉండే సంబంధాలే అసహజమైనవీ అనీ అందరూ ఒప్పుకుంటారు.

కాకపోతే మేం కాస్త ముందున్నాం.

అంతే! ఈ ప్రపంచంలో ముందున్న వాళ్ళెప్పుడూ ఒక వివక్షని ఎదుర్కోవాల్సిందే కదా? మేం దాన్ని ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉన్నాం!"

ఆ మెయిలంతా చదివి యశస్వి తల పట్టుకుంది. 'ఏమయ్యింది? వీళ్ళు ఎటుపోతున్నారు? చివరికి ఏమవుతారు' అని ఆలోచించసాగింది.

ఆమెలో ఎన్నెన్నో సందేహాలు! మరెన్నో ప్రశ్నలు! స్పష్టంగా చెప్పలేకపోతుంది.

మైత్రేయి చెప్పినట్టు వారిద్దరి మధ్యా చక్కటి అవగాహన కుదిరితే కుదిరి ఉండవచ్చు. కానీ ఆ రిలేషన్‌షిప్‌లో ఎక్కడో ఏదో ఇబ్బంది కన్పిస్తోంది. ఏమిటది? మగతోడు లేకుండా ఎలా ఉంటారు?

విష్ణులాంటి అబ్బాయ్ కనిపించి ప్రపోజ్ చేస్తే



# హృదయం ఎక్కడున్నదీ...?

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి



కూడా వద్దనగలరా? ఏ మిలియన్ డాలర్ క్వశ్చన్!

ఆమె చూపు మళ్ళీ షెల్ఫ్‌లో ఉన్న చందనపు ప్యాలెస్ మీదకు మళ్ళింది. యశస్వికి విష్ణుతో కలిసి మైసూరు ప్యాలెస్‌కి వెళ్ళిరావటం, మదిలో ఓ మధుర జ్ఞాపకంగా మిగిలిపోయింది.

ప్రేమంటే అడక్కుండానే, ఏ దేవతలో ఇవ్వాల్సిన ఓ గొప్ప వరం! అలా లభించిన ప్రేమనేది ఓ ఇంద్రజాలంలాంటిది. సకలేంద్రియాలనూ సమ్మోహనపరుస్తుంది. ఒక్కసారి ఆ ప్రేమ మొదలైతే జీవితం మనకు అన్నీ ఇస్తున్నట్టు, జీవితం అత్యద్భుతంగా ఉన్నట్టు తోస్తుంది.

యశస్వి ఒకరోజు సడెన్‌గా విష్ణుని అడిగింది "అసలు నేనంటే నీకెప్పుడు ఇష్టం కలిగింది?"

అతను నవ్వి చెప్పాడు "మొదటిసారి నిన్ను ఇంటర్వ్యూటైంలో మీ కాలేజీలో చూసినప్పుడే నాకు నీ మీద ప్రేమ కలిగింది" ఆమె ఆశ్చర్యంగా, అపనమ్మకంగా చూసి "ఓ మైగాడ్! అంటే లవ్ ఎట్ ఫస్ట్ సైటా?" అని అడిగింది.

"ఎస్! యు ఆర్ రైట్! మొదటిచూపులోనే నేన్నిన్ను చాలా గాఢంగా ప్రేమించాను. ఈ జన్మకు నువ్వే నా ప్రేయసివని, అక్కడే మీ కాలేజీలోనే డిసైడైపోయాను" ఆమె కళ్ళల్లోకి చూస్తూ చెప్పాడతను.

"అలా ఎలా డిసైడ్ అయ్యావ్? ఒకవేళ నేను ఆ ఇంటర్వ్యూలో సెలక్ట్ కాకపోయి ఉండుంటే?

సెలక్ట్ అయినా నేను ఇక్కడికి వచ్చి జాబ్‌లో జాయినవ్వకపోయుండి ఉంటే?

ఒకవేళ ఇక్కడ పని చేసినా నీ ప్రేమని యాక్సెప్ట్ చేయకపోయుండుంటే? అప్పుడేం చేసేవాడివి?" గాభరాగా గబగబ అడిగింది.

లోలోపలెక్కడో సంతోషమేగానీ, ఇప్పటికీ ఆమెకిదంతా ఓగొప్ప పజిల్‌లా తోస్తుంది.

ఈ ప్రేమకథలో ఇన్ని 'ఇఫ్'లూ, 'బట్'లూ ఉన్నాయ్ కదాని! "నువ్వు నాకోసమే పుట్టావ్ అని నిన్ను చూసిన మొదటిక్షణంలోనే నాకు అనిపించింది" అతను నమ్మకంగా చెప్పాడు.

"నీకొక్కడికే అన్పిస్తే సరిపోతుందా?" గోముగా అడిగింది.

"నాకు తెల్సు! నీక్కూడా అలానే అన్పించింది. నువ్వు నాలా చెప్పలేకపోవటానికి కారణం మీ ఆడపిల్లలకుండే మైండ్ సెట్!" అతను తేల్చేశాడు.

ఆ రోజు ఇంటర్వ్యూలో ఇతడ్ని చూడగానే మనస్సులో ఎందుకో కానీ,ఏదో కంగారుగా అన్పించింది.

తర్వాత్తర్వాత కూడా తనని చూస్తుంటే మనస్సులో సమ్‌థింగ్... సమ్‌థింగ్ అన్పించేది.

అదేనా ప్రేమంటే? ఇంకా ఏదో అర్థంకాలేదు.

"విష్ణూ! నిజంగా మొదటిచూపులోనే ప్రేమ పుడుతుంది అంటావా?"

"ఎస్! కచ్చితంగా! మొదటిచూపులో పుట్టేది మాత్రమే ప్రేమ!"

"మరి పెళ్ళిచేసుకున్న తర్వాత కూడా ప్రేమ పుడ్తుందని..."

"అది ప్రేమ కాదు యశూ! అలవాటు!

ఒకరికి ఒకరు అలవాటై, ఇంకొన్ని అవసరాలు తప్పనిసరై, సామాజిక కట్టుబాట్ల కోసం కలిసి మెలిసి కాపురాలు చేస్తారు"

"అంతే అంటావా? మరి నేన్నీకు సూటవుతానా లేదా అని, నీకెలా తెలిసింది? నువ్వు సినిమాల్లో పెళ్ళిచూపుల టైమ్‌లో చూపించినట్టు, నన్నేమీ ప్రశ్నలడగలేదు. నా యాటిట్యూడ్ నీకు తెలీదు. అసలిలాంటి నిర్ణయం ఎలా తీసుకున్నావ్?"

"కొన్ని ప్రశ్నలడిగి, వాటికి నాకు నచ్చిన జవాబులు నువ్వు చెప్పాలని ఎదురు చూస్తున్నాను అంటే నిన్ను నేను కండిషన్ చేస్తున్నట్టే! నువ్వు నాకు నచ్చినట్టుగా ఉండాలని నేను ఎక్స్‌పెక్ట్ చేసినట్టే!

అలా ఏం అవసరం లేదు. ఏ విషయంలో అయినా నీకు నచ్చినట్టుగా నువ్వుండొచ్చు! ఇంకా సింపుల్‌గా చెప్పాలంటే నువ్వు నీతో ఎలా ఉంటావో నాతో అలా ఉండొచ్చు! ఐ యాక్సెప్ట్ యు యాజ్ యు ఆర్!"

మనం పుట్టినప్పుడు మన తల్లితండ్రులు ఎంత సంతోషాన్ని పొందారో మనకస్సలు తెలీదు. మనకి ఆ విషయం గుర్తుకూడా ఉండదు.

8

## జరిగిన కథ

ఓ హోటల్లో టిఫిన్ చేసి అక్కడినుండి మైసూరు మహారాజా ప్యాలెస్‌ను సందర్శించుకుంటారు విష్ణు, యశస్వి. ప్యాలెస్‌లోని విశేషాలు ఆమెకు వివరిస్తాడతను.

విష్ణు ఓ యువరాజులా, తను యువరాణిలా ఫీలవుతుంది యశస్వి.

అక్కడికొచ్చిన స్టూడెంట్స్‌కు ఓ గైడ్, దర్బార్ హాల్‌లోని మయూర సింహాసనం గురించి, రాజారవివర్మ ఆ ప్యాలెస్‌కు బహూకరించిన కళాఖండాల గురించి వివరిస్తాడు.

ఆ ప్యాలెస్‌లోవున్న త్రినయనేశ్వర దేవాలయానికి వెళ్తారు. బాలకృష్ణుని విగ్రహాన్ని దర్శిస్తారు. ఏనుగుమీద వున్న పల్లకీలోకి యశస్వి, విష్ణు ఎక్కుతారు.

ఆమెకు ఐలవ్‌యు చెప్పి గులాబి ఇస్తాడు. ఆమె సిగ్గుపడుతుంది.

చందనంతో చేసిన మైసూరు ప్యాలెస్ బొమ్మను ఆమెకు గిఫ్ట్‌గా ఇస్తాడతను.

ఇక జరగబోయేది చదవండి.

కానీ మనం పుట్టినప్పుడు పొందిన ఆనందమే, జీవితంలోని అన్ని ఆనందాల కంటే గొప్పదని, వాళ్ళు చెప్తున్నప్పుడు వింటుంటే ఎంతో గొప్పగా ఉంటుంది. అసలు మనం పుట్టి వారికంత ఆనందాన్ని కలిగించి నందుకు మనకు మనమే ముద్దొస్తాం!

అప్పటికప్పుడు మళ్ళీ ఇంకోసారి కొత్తగా పుట్టి పసిబిడ్డలమై మనల్ని మనమే అపురూపం చేసేసు కుంటాం! 'అయ్యో! ఒకసారి ఇంత వయస్సూ, జ్ఞానమూ అపుడుండి వారి ఆనందాన్ని చూడగలిగితే ఎంత బావుండేది కదూ' అన్పిస్తుంది.

'నువ్వు పుట్టినప్పుడూ...'అనివాళ్ళు చెప్తుంటే, మనం నిజంగా అంత ఆనందాన్నివ్వగలిగామా అని విస్తుపోయి వారిని చూస్తూండిపోతాం!

'ఈ లోకంలోకి మన రాక వాళ్ళకంత గొప్పగా అన్పించిందా?' అన్న ఆలోచన కలిగితే చాలు గుప్పె డంత గుండెలో ఎంత ఆనందమో?ఆ క్షణాల్లో వారి ముఖాన్ని చూస్తే అర్థమైపోతుంది.

మాటల్లో చెప్పలేని గొప్ప అనుభూతికి వారు లోన య్యారనీ, మనతో ఉంటున్నంతసేపూ మైమరపు కలిగించిన ఆ క్షణాల్లోకి వారు వెళ్ళిపోతున్నారని మనకు తెలుస్తూనే ఉంటుంది.

మళ్ళీ మన జీవితంలోకి ఓ అద్భుతమైన వ్యక్తి వచ్చి, మనమీద తనలో పుట్టిన ప్రేమగురించి చెపు తుంటే కూడా అలాంటి ఫీలింగే కల్గుతుంది.

"ఏదీ మళ్ళీ చెప్పు! నీకు నెనెప్పుడు నచ్చాను?"

ఆమెకు అలా అడిగిఅడిగి చెప్పిం చుకోవటం చాలా ఇష్టం! అతను ఓపిగ్గా చెప్తాడు. అతను ఎన్నిసార్లు చెప్పినా అప్పుడే మొదటి సారి వింటున్నంత ఉద్వేగానందాల్తో వింటుంది.



ఎన్టీఆర్ ఆంధ్రులకు ఆత్మగౌరవం ఇస్తే నేను ఆత్మవిశ్వాసం ఇస్తున్నాను.
-చంద్రబాబునాయుడు, ఎ.పి. సి.ఎమ్.

ఉదయాన్నే ఫోన్ చేసి చెప్తుంది. "నేను కాఫీ కలుపుకుంటున్నాను. నువ్వు కూడా కాఫీ కలుపుకో! ఇద్దరం కలిసి కబుర్లు చెప్పు కుంటూ కాఫీ త్రాగుదాం!"

కాసేపయ్యాక అతనడుగుతాడు. "నువ్వీరోజు ఆఫీస్‌కి ఏ కలర్ డ్రెస్ వేసుకొస్తున్నావ్?"

ఆమె ఆఫీస్‌కి వెళ్ళేసరికి అతను దాదాపుగా ఆమె చెప్పిన కలర్‌కి దగ్గర్లో ఉండే కలర్ డ్రెస్‌లో ఉంటాడు. ఆమెకి అతడ్ని చూసిన ఆనందంతో పాటు, ఇంకేదో తెలీని ఆనందం!

ఇద్దరు కలిసి లంచ్ చేస్తారు. కలిసి త్రాగిన కాఫీ, కలిసి చేసిన భోజనాలు వారిద్దరినీ మరింత దగ్గర చేశాయ్!వానాకాలపు జలపాతంలా వారిమధ్యకబుర్లు, నవ్వులు అలా దొర్లిపోతూనే ఉంటాయ్!

వాళ్ళిద్దరూ సరదాగా మాట్లాడుకుంటూ, ఒకర్ని ఒకరు ఇష్టంగా చూసుకుంటూ, మధ్యమధ్యలో ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ, ముసిముసిగా నవ్వు కుంటూ, కొత్త బంగారులోకంలో విహరిస్తున్నారు.

ఒకర్ని చూడగానే ఇంకొకరికి, మధురాతి మధుర మైన ప్రియభావనలు కలుగుతాయ్!

ఒకరి గుండె శబ్దం ఇంకొకరికి వినబడుతుంది. ఒకరి వేవ్ లెంగ్త్ మరొకరికి అందుతోంది.

ఎన్ని కబుర్లు చెప్పుకున్నా ఇంకొన్ని మిగిలిపోతూనే ఉంటాయ్! ఆఫీస్ నుంచి రాగానే వయొలిన్ తీసి శృతి చేయబోతే ఆమెకి విష్ణు గుర్తొస్తాడు.

ప్రభాతమైనా, సాయంత్రమైనా... అతనలా గుర్తొ స్తూనే ఉంటాడు. ముందు అతని చూపు, మాట, ప్రవర్తన గుర్తొస్తాయ్!

ల్యాప్‌టాప్‌మీద పనిచేసే విష్ణు, అలవోకగా కారు డ్రైవ్ చేసే విష్ణు,మొబైల్‌లో మాట్లాడే విష్ణు గుర్తొస్తాడు. కుడిచేతిని ఇలా వేళ్ళు కదిలేలా గాల్లో కదిలిస్తూ, ఎడమచేత్తో మొబైల్‌ని పట్టుకుని మాట్లాడుతూ, అల వోకగా కీబోర్డ్ మీద టైప్ చేస్తూ,

తమ క్యాబికిల్స్ ముందు నుంచి అటూ ఇటూ హుందాగా నడుస్తూ, తల పైకెత్తి నవ్వుతూ రకరకాల భంగిమల్లో గుర్తొస్తాడు.

ఆ నడకలో ఓ గ్రేస్, ఆ చేతులు తిప్పటంలో ఓ స్టైల్, ఇంగ్లీష్ మాట్లాడటంలో అమెరికన్ యాక్సెంట్, పనిలో స్మార్ట్‌నెస్... టోటల్లీ డిఫరెంట్! తనకు తెల్సు... విష్ణు ప్రత్యేకం! చిన్నప్పుడు నానమ్మ ఓ పద్యంచెప్పేది. ఏమిటబ్బా అది? ఉప్పు పద్యం?

గుర్తురాక నానమ్మకి ఫోన్‌చేసి అడిగింది. ఆవిడ నవ్వుతూ ఇష్టంగా చెప్పింది.

"ఉప్పుకప్పురంబు నొక్కపోలిక యుండు చూడ చూడ రుచులు వేరు,

పురుషులందు పుణ్యపురుషులు వేరయా విశ్వ దాభిరామ వినుర వేమా!"

అవున్నిజం! అతను వేరు! అతనితో ఉన్నంతసేపు తనకి ఎంతో బాగుంటుంది. అతను తనవైపు ఆరా ధనాపూర్వకంగా చూడటం, తనని ఎంతో జాగ్రత్తగా అపురూపంగా చూసుకోవటం తనకెంతో బాగుంది.

తమ పరిచయమై చాలా తక్కువకాలమే కాని తనకు తెలియకుండానే తన ఆలోచనల్లనిండా అతనే నిండిపోయాడు.

ఎన్నో యుగాల నుంచి అతనితో పరిచయం ఉన్నట్టుగా, అతను తన మనసుకి ఎంతో దగ్గరగా వచ్చినట్టు,కాదు కాదు తన మనసంతా అతనే అయి పోయినట్టుగా అనిపించసాగింది.

రోజూ ఆఫీస్‌లో మాట్లాడుకోవటం, కలిసి పని చేయుటమే కాకుండా ఆన్‌లైన్‌లో చాటింగు, అటు నుంచి ఇటు, ఇటునుంచి అటు పూలపడవల్లా నడిచే ఈమెయిల్స్, నులివెచ్చని టెక్ట్స్ మెసేజ్‌లు ఆమెని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

ఆమె మనస్సు స్థిమితంగా ఉండటం లేదు. ఏ పనీ సరిగ్గా చేయలేకపోతోంది.

ఆమె ముఖంలో కన్పించే ఓ గొప్ప కాంతి, కళ్ళల్లో ఒక మెరుపు, మాటిమాటికీ పెదవులపై తుళ్ళిపడే చిర్నవ్వు, లాలిత్యమైన కదలికలు,నడకలో వయ్యారం,



## తొంభైశాతం వృత్తిపర జీవితం

పనే జీవితం అని విశ్వసిస్తూ, ఎన్నోసార్లు వ్యక్తిగత జీవితాన్ని పక్కనపెట్టానంటున్నది కాజల్ అగర్వాల్. "వ్యక్తిగత, వృత్తిపర జీవితాల నడుమ సమతూకం పాటించాలని చాలామంది అంటుంటారు.

కాని, నిజానికి అటువంటి సమతూకం సాధ్యం కాని పని. జీవితంలో ఏదోకటి సాధించాలనుకున్న ప్పుడు ఎవరికైనా పనిమీదే దృష్టి వుంటుంది. నాకూ అంతే. నా జీవితాన్ని సమీక్షించుకుంటే తొంభై శాతం వృత్తిగత జీవితమే కనిపిస్తుంది. ఇది నాకెంతో సంతృప్తినిస్తుంటుంది కూడా. సినిమాపరంగా నేను ప్రతి క్షణాన్నీ ఆస్వాదించాను" అని తెలిపింది.

మొత్తంగా ఆమె బాడీ లాంగ్వేజ్...ఆమె చెప్పకపోయినా ఆమెప్రేమలో పడిందని,అందరికీ చెప్పేస్తున్నాయ్!

విష్ణు, యశస్వినిల రిలేషన్‌షిప్‌లో తేడాని అందరి కన్నాముందు నీతూ గుర్తుపట్టింది.

కానీ నేరుగా ప్రశ్నించలేదు. తర్వాత్తర్వాత వారి ప్రేమ విషయం ఆఫీస్‌లో అందరికీ తెలిసిపోయింది. ప్రత్యేకంగా దాచాలని కూడా వారు అనుకోలేదు.

'అయామ్ ఇన్ లవ్!' అని ప్రపంచానికంతా విన బడేలా ఏదన్నా ఓ పెద్ద శిఖరమ్మీదకి ఎక్కి గొంతెత్తి చెప్పేద్దామని అన్పిస్తోంది. కానీ ప్రపంచానికి తన ప్రేమ సంగతి అవసరమా?

ప్రపంచం ఎటుపోతే తనకేం? తన ప్రేమ తనకి ముఖ్యం అని మనసులో అనుకుంది.

తన మనసంతా అతని చుట్టూ తిరుగుతూనే ఉంది. అది మాటలకందని అనుభూతి! కాలం ఎలా పరిగెడుతోందో తనకు తెలియట్లేదు.

ఒక్కక్షణం మొబైల్ వదిలి ఉండాలన్నా ఒక రక మైన ఆదుర్దా! ఎక్కడ ఫోన్ మోగుతోందో అని! క్షణ క్షణం నిరీక్షణ. ఒకవేళ ఏదన్నా టెక్ట్స్ మెసేజ్ వచ్చిం దేమో.. అని మొబైల్ తీసి చూస్తుంది.

మెసేజ్ వస్తే కేవలం ఒక చిన్న శబ్దం చిరుగంటలా మ్రోగుతుంది. కాబట్టి తను మిస్ కావచ్చు.

లేదంటే పొరపాటున ఫోన్ సైలెంట్ మోడ్‌లోకి వెళ్ళిపోయిందేమో అని ఒకటికి పదిసార్లు పరిశీలించి చూసుకుంటుంది.

ఈలోగా ఎవరి దగ్గరనుంచైనా కాల్ వస్తే బోల్డంత అసహనంగా అనిపిస్తుంది. చాలా ముభావంగా పొడి పొడి సమాధానాలు చెప్పేసి ఫోన్ పెట్టేస్తుంది.

మళ్ళీ ఆతృతగా ఆ అరనిమిషంలో ఏదైనా మిస్డ్ కాల్ వచ్చిందా అని తిరిగి చూసుకుంటుంది.

ఈ మధ్య ఎవరు ఫోన్ చేసినా ఒకటే కంప్లయింట్ 'నీ ఫోన్ ఏమిటి ఎప్పుడూ ఎంగేజ్డ్ వస్తుందీ?' అని అడుగుతున్నారు.

తను విననట్టే ఉండిపోతోంది. నిజం చెప్పాలంటే తను ఏ విషయమూ పట్టించుకోవట్లేదు. ఎవరితో మాట్లాడుతున్నా మధ్యమధ్యన మనసెటో వెళ్ళి పోతోంది. ఆ మనసుని బలవంతంగా పట్టితెచ్చి పడేసుకోవటం కష్టమవుతుంది.

ఆ రాత్రి అతను కాల్ చేశాడు. అతని నెంబర్‌ని చూడకుండానే గుర్తించడానికి వీలుగా ఆమె విడిగా కేవలం అతని నెంబర్‌కి ఇంకో రింగ్‌టోన్ పెట్టుకుంది. అతను కూడా అంతే! "ఏం చేస్తున్నావ్?" అడిగాడు.

"నీ ఫోన్ కోసం చూస్తు న్నాను' నవ్వుతూ

## జీరో డ్యాన్సర్ అన్నారు

**కొ**న్ని పాటల్లో కత్రినాకైఫ్ శరీరాన్ని విల్లులా మలిచి ఎంత అద్భుతంగా చేసిందో చూసినవాళ్ళు మరవలేరు. చిక్నీ ఛమేలి, షీలాకీ జవానీ, కాలాఛస్మా పాటల్లో యువతరాన్ని ఎంతగా ఉర్రూతలూగిం చిందో తెలుసు. ఇలా ఎలా సాధ్యం? అంటే కత్రిన గమ్మత్తుగా సమాధానం ఇచ్చింది.

"నేను 'వాంటెడ్'లో నటిస్తున్నప్పుడు కొరియో గ్రాఫర్‌దృష్టిలో నేను డ్యాన్స్‌లో జీరో.అదే విషయాన్ని సల్మాన్‌తో కూడా చెప్పాడట.

'మల్లీశ్వరి'లో నేను డ్యాన్స్ సరిగ్గా చేయలేదనీ అప్పటి చిత్ర కొరియోగ్రాఫర్ వ్యాఖ్యానించాడు. దీంతో డ్యాన్స్ బాగా చేయాలన్న కసి పెరిగింది.

ఎన్నో గంటలపాటు నాట్యంలో శిక్షణ తీసుకు న్నాను. జీరో డ్యాన్సర్ అన్న ఇమేజ్‌ను చెరిపేసు కున్నాను" అని వివరించింది కత్రినాకైఫ్.



చెప్పింది. అతను కూడా నవ్వేశాడు.

"నువ్వేం చేస్తున్నావ్?" మొబైల్ గేమ్ ఆడు తున్నావా?" టీజ్ చేస్తూ అడిగిందామె.

"నీకు తెలుసు కదా?" నవ్వాడతను.

అలా ఇద్దరూ మాట్లాడుకుంటూనే ఉండిపోయారు. ఇద్దరూ అప్పటిదాకా వేర్వేరు ప్రపంచాల్లో ఉండి వచ్చారు. ఒకర్ని ఒకరు కలుసుకునేదాకా జీవితాల్లో ఎన్నెన్ని సంగతులు జరిగిపోయాయనీ?

ఆ కబుర్లన్నీ చెప్పుకోవద్దా?

"ఉంటాను మరి?" ఎప్పటికో అడిగిందామె.

"ఉండనా మరి?" అతనూ అడిగాడు.

"సరే" అందామె. ఎవరూ కాల్ కట్ చేయలేదు. అవతల్నుంచి నిశ్శబ్దం, ఇవతల్నుంచి నిశ్శబ్దం.

అతను కాల్ కట్ చేస్తాడని ఈమె చూస్తోంది.

ఈమె కాల్ కట్ చేస్తుందని అతను చూస్తున్నాడు. ఆమెకి అతను వచ్చి తన రూమ్‌లో తన ప్రక్కనే ఉన్నట్టుగా తోచింది.

కాదు, కాదు తనే అతని రూమ్‌కి వెళ్ళి అతని ఎదురుగా కూర్చుంది. అదీ కాదు, ఎందుకంటే అతను కూడా అతని రూమ్‌లో లేడు.

తను కూడా తన రూమ్‌లో లేదు. ఇద్దరూ కలిసి మూడో ప్రదేశంలో అంటే మొబైల్ ప్రపంచంలో ఉన్నారు అనుకుని నవ్వుకుంది.

"ఓకేనా?" అడిగాడతను.

"ఓకే" చెప్పిందామె. కాని ఫోన్ పెట్టేయలేదు.

చివరగా అతనే ఫోన్ పెట్టేశాడు.

నవ్వుకుందామె. ఉదయాన్నే లేవగానే అతని గురించిన ఆలోచన, రాత్రి పడుకోబోతుంటే అతని గురించిన ఆలోచనే. అసలీ ఫీలింగ్స్‌ని ఏమం టారు? అతని సమక్షంలో తనని తాను మర్చి పోతుంది. అతను తన మనసుకెంతో దగ్గర మనిషి అనిపిస్తుంది. అతని ముందు నిలబడితే చాలు,

అతని చూపులు తనని చుట్టుముట్టేసిన ఫీలింగ్ కలుగుతోంది. అలా ఆ చూపుల షవర్‌లో నిలువెల్లా తడిచిపోతూవుంటుంది.

ఎక్కడ అద్దం కనిపించినా అద్దంలో చూసుకో కుండా ఉండలేకపోతుంది.

తల దువ్వుకుని తయారవుతూ అద్దమ్ముందు నిలబడ్డా, చివరికి చేతులు కడుక్కుంటూ వాష్‌బేసిన్ దగ్గర నిలబడ్డాసరే అక్కడున్న అద్దంలో తనముఖాన్ని ఇష్టంగా చూసుకుంటూ అలా నిలబడిపోతోంది.

తన ముఖంలో గోచరిస్తున్న ఒక గొప్ప కాంతి, ఒక జ్వాల, తన కళ్ళల్లో చమక్‌మని మెరుస్తోన్న మెరుపు తనకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయ్.

తన ముఖం తనకే ఎంతో ముద్దొస్తోంది.

తనకు తానే ఒక కొత్తమనిషిలా కనిపిస్తుంది. ప్రేమలో వున్న అమ్మాయిలు అద్దంలో ఎందుకు ఎక్కువసేపు చూసుకుంటారో అర్థమవ్వసాగింది.

తను ఇదివరకటిలా లేదు. ఖచ్చితంగా తనమాట, తన నడక అన్నీ మారిపోయాయ్! అవున్మరి!

ఒక్కొక్కసారి ఏదైనా పనిచేస్తున్నప్పుడు తనని ఏ మూలనుంచో అతడు చూస్తున్నాడేమో అనిపి స్తుంది. తను మరింత వయ్యారంగా నడుస్తుంది.



మా పార్టీది కాంగ్రెస్ వ్యతిరేక సిద్ధాంతం... ఆ సంస్కృతిని వ్యవస్థాపకుడు ఎన్టీఆర్ స్థిరపరిచాడు.

-అశోక్ గజపతిరాజు, టి.డి.పి. ఎమ్.పి.

అప్పుడప్పుడు ఊహాలోకాల్లో ఏమరుపాటుగా ఉండిపోతుంది.

ఏ పనిచేస్తున్నా అతనితో కలిసి చేయాలనిపిస్తుంది. అతనితో కలిసి సూర్యోదయాన్నీ, సూర్యాస్తమయాన్నీ చూడాలనివుంటుంది.

సినిమా అయినాసరే అతనితోనే కలిసి చూడాలనిపిస్తుంది.

ఆఫీసుకు వెళుతున్నాను, అతణ్ణి కలవబోతున్నాను అనుకుంటే ఏరోజుకారోజు మనసంతా సంతోషతరంగాలతో ఎగిసిపడుతుంది.

విష్ణు ఆఫీస్‌లో ఎనౌన్స్ చేశాడు. "మా తాతగారి 'సహస్ర చంద్ర దర్శనానంతర శాంతికార్యక్రమ' సందర్భంగా మా ఇంట్లో ఓ గెట్ టు గెదర్ ఏర్పాటుచేశాం!

ఆ ప్రోగ్రామ్‌కి మీరంతా వచ్చి ఆ జెంటిల్‌మ్యాన్‌ని సంతోషపెట్టాలి ప్లీజ్!" అందరినీ పేరు పేరునా పిలిచాడు. మెయిల్స్ పంపాడు.

వాట్సాప్ గ్రూప్‌లో 'ఆహ్వాన పత్రిక'ని పోస్ట్ చేశాడు.

లంచ్ టైమ్‌లో "షష్టి పూర్తి మహోత్సవం అంటే నాకు తెలుసు కానీ ఈ ఫంక్షన్ గురించి నేనెప్పుడూ వినలేదు. అసలీ సహస్ర చంద్రదర్శనం అంటే ఏమిటి విష్ణూ?" యశస్వి అడిగింది.

విష్ణు వివరంగా చెప్పాడు. "ఇది కూడా షష్టిపూర్తి లాంటిదే!

కాకపోతే ఇందులో ఇంకొన్ని ఎక్కువ కార్యక్రమాలుంటాయ్!

సహస్ర అంటే వెయ్యి అన్నమాట! సంపూర్ణం అని ఇంకో అర్థం! ఒక వ్యక్తి తన జీవితకాలంలో వేయి నూతన చంద్రోదయాలను చూడగల్గటం మన వాళ్ళు చాలా గొప్పవిషయంగా పరిగణిస్తారు. మనం చాంద్రమాసం ప్రకారం కాలాన్ని గణనచేస్తాం కదా?!

అమావాస్య తర్వాత వచ్చే పాడ్యమి నుండి, కొత్త చాంద్రమాసం మొదలౌతుంది. పాడ్యమి, మరునాడు అంటే విదియ నాటి సాయంత్రం చంద్రుడు ఆ నెలలో మొదటగా, సన్నని వక్ర రేఖలా కనిపిస్తాడు. శివుని శిరస్సున కనిపించే చంద్రకళ ఇదే. అలా కనిపించడమే చంద్రదర్శనం.

సంవత్సరానికి సుమారుగా పన్నెండుసార్లు మాత్రమే అలా చూడగలం! వెయ్యి చంద్రదర్శనములు చేయాలంటే ఆ వ్యక్తికి దాదాపుగా ఎనభైమూడు ఏళ్ళు నిండాలి!

ఈలోగా జీవితంలో ఎన్నో ఆనందాల్ని, ఆటుపోటుల్ని చూసి, తట్టుకుని ఉండుంటాడు. అందుకు సహకరించిన ఈ ప్రకృతికి, నవగ్రహాలకు, సమాజానికి తన కృతజ్ఞతల్ని తెలియచేసుకోవటానికి శాంతిహోమాలు, ఆయుర్హోమం, అన్నసంతర్పణలు, దానాలు నిర్వహిస్తారు.

ఈ భూమ్మీద ఏ వ్యక్తికూడా తన జీవితాన్ని 'టేకిట్ ఫర్ గ్రాంటెడ్'గా కానీ తన 'హక్కు'గా, కానీ తీసుకోకూడదనీ, ఆ జీవితం కేవలం తనకు లభించిన 'వరం'గా భావించాలనీ, ఎక్కడికక్కడ మన పెద్దలు హైందవ సంప్రదాయంలో ఎన్నెన్నో సంస్కారాల్నీ,క్రతువుల్నీ ఏర్పాటుచేశారు.

అందులో ఇదొకటి! తన సంతానానికి, మనవలకూ పుట్టినరోజులు, బారసాలలు, పెళ్ళిళ్ళులాంటి ఎన్నో ఫంక్షన్స్ నిర్వహించిన ఆ వృద్ధదంపతులకు మనం నిర్వహించే ఈ ఫంక్షన్ చాలా విలువైనదని నా పర్సనల్ ఫీలింగ్!"

యశస్వికి తన నానమ్మ గుర్తొచ్చింది. తనకు ఊహ తెలిసేసరికే తాతయ్య చనిపోయారు.

ఆయన్ని తలుచుకుని నానమ్మ అప్పుడప్పుడూ కళ్ళొత్తుకుంటూవుంటుంది. ఆయన బ్రతికి ఉండి ఉంటే ఆయనకిప్పుడు డెబ్బయ్ అయిదేళ్ళు ఉండే వేమో! త్వరలోనే తాము కూడా ఆయనకు ఈ ఫంక్షన్ చేసేవాళ్ళం కదా అనుకుంది యశస్వి.

అందర్నీ పిలిచినట్టే ఆమెనీ పిలిచాడు. కాకపోతే ఇంకాస్త ప్రేమగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ పిలిచాడు.

"నువ్వు తప్పకుండా రావాలి.

ముందు మమ్మీకి నిన్ను చూపించాలి" అన్నాడు విష్ణు.

"ఎందుకో?" ఆమె కొంటెగా కవ్వించింది యశస్వి.

"నీకు తెలీదా?" అడిగాడతను.

"నువ్వు చెబితే వినాలని..."

"అయితే ఇంటికి రా! మమ్మీకి చెప్పేప్పుడు విందువుగానీ..."

"ఏం చెప్తావ్?"

"మైసూరు ప్యాలెస్‌లో ఉండే యువరాణి మనింటికి వచ్చిందని..."

"యూ..." అంటూ సిగ్గుపడింది.

"ప్లీజ్! మేకిట్ పాయింట్! తప్పకుండా రా!" చెప్పాడతను.

**ఇంకా ఉంది**



Courtesy : CINEMA MANGALAM

తరగని తడి అందాల తమకం బంధనాలు వద్దంటున్న బిగి సౌందర్యం తడి అద్దుకున్న కుంకుమ కాంతికిరణం కాటుక కళ్ళ మాటున ఒదిగిపోయిన భావావేశం అదిరే అధరాల మౌనభాష్యం మోముపై కురుల విలాసం ఎదను ముద్దాడుతూ నాభిపై తుళ్ళిన తుంపరల జలతార్లు ముంజేతులపై నీటిబిందువుల ముచ్చట్లు నిలువెత్తు అందానికి ఎంతటి నిదర్శనమో!!

# స్వధర్మం

శ్రీమతి రాఘవ.టి

చీకట్లు ముసురుకుంటున్నాయి. కేదారనాథ్ కొండమీది నుంచి కిందికి సవారీలని గమ్యం చేర్చటానికి ఘాట్‌రోడ్డుమీద వేగంగా నడుస్తున్నాయి డోలీలూ, గుర్రాలూ. అలా సాగుతున్న ఓ డోలీ సడెన్‌గా ఓ పక్కకి ఒరగటంతో ఆగిపోయింది.

అలా ఆగటం అక్కడ సాధారణం కావటంతో మిగతావాళ్ళు వాళ్ళ మానాన వాళ్ళు వెళుతున్నారు. అందులో ప్రయాణిస్తున్న ప్రతాప్ మాత్రం నిశ్చేష్టుడై కదలిక లేకుండా శిలలా ఉండిపోయాడు.

ఆ తర్వాత క్షణంలో తన కళ్ళముందు జరిగిన సంఘటన అతడి మెదడుని బ్లాంక్ చేసేసింది.

అప్పటిదాకా కురుస్తున్న వాన కూడా స్తంభించినట్లు ఆగిపోయింది. చిక్కబడుతున్న చీకట్లో బాట ప్రక్కనున్న మినుకు మినుకుమంటూన్న దీపాల సన్నటి కాంతిలో ప్రతాప్ కళ్ళకి స్పష్టంగా కనిపించింది... జరిగిన దారుణం.

డోలీ మోసే నలుగురుబోయీలలో ఇద్దరు పక్కనే వున్న లోయలోకి జారిపడుతూ పెట్టిన గావుకేక అతని చెవుల్లో గింగిర్లెత్తుతోంది.

కంగారుపడుతూనే డోలీని బాలన్స్ చేస్తూ జాగ్రత్తగా నెమ్మదిగా నేలమీదికి దింపారు మిగిలిన ఇద్దరూ. లోయ దిగువలోకి తొంగిచూస్తున్నారు.

ప్రయత్నపూర్వకంగా తేరుకుంటున్న ప్రతాప్ గాభరాగా అన్నాడు... "ఏంటి ఇలా జరిగింది? అలా పడిపోయారేమిటి వాళ్ళు పాపం?"

"ప్చ్! ఇక్కడ అప్పుడప్పుడూ ఇట్లాంటి ప్రమాదాలు జరుగుతూంటాయి సాబ్. వాననీటితో గుర్రాల పేడతో తడిసి, జారుడుగా, చిత్తడిగా వుంటుంది ఈ ఎగుడు దిగుడు దారి.

అందులో ఇక్కడ కోసుగా వుంది చూడండి... కొంత నేల కరిగిపోయి గోతులు ఏర్పడ్డాయి. త్వరగా కొండ కిందికి వెళ్ళాలన్న తొందరలో అన్నలకి చీకటిలో చూపు సరిగ్గా ఆని వుండదు.

గొయ్యి చూసుకోకుండా కాలు వేసి లోయలోకి జారిపోయారు" ప్రతాప్‌ని కూర్చోని మళ్ళీ నలుగురు మోయాల్సిన డోలీని ముందు ఒకరూ, వెనకాకరు రెండు చేతులతో రెండు భుజాల మీదకు ఎత్తుకోవడానికి సిద్ధమయ్యారు వాళ్ళు.

"అదేమిటయ్యా పోలీస్‌లకి చెప్తే వెతుకుతారేమో... ఏ చెట్టుకొమ్మలకి అయినా తట్టుకుని ప్రాణాలతో ఉండొచ్చుగా?" తనలోని ఆవేదనని ప్రదర్శించాడు ప్రతాప్.

"చెప్పానుగా సాబ్... ఇక్కడ అప్పుడప్పుడూ ఇలాంటివి జరుగుతుంటాయి" గౌరాంగ్ గొంతులో కొద్దిగా విసుగు ధ్వనించింది.

సాటి వ్యక్తుల మరణాన్ని కాజువల్‌గా తీసుకుంటున్న గౌరాంగ్‌ని, ఇంకొకడ్నీ చూసి ఒళ్ళు మండిపోయింది ప్రతాప్‌కి. "అదేంటయ్యా... సాటి మనుషులయ్యా వాళ్ళు. ఏదో జంతువులు జారిపోయినంత తేలిగ్గా మాట్లాడుతున్నారు?"

"ముందు మీరు మాటలాడకుండా శాంతంగా కూర్చోండి సాబ్ డోలీలో. చీకట్లు బాగా ముసిరితే ఈ లైట్లు ఎందుకూ పనికిరావు.మనం కూడా ఎక్కడో జారిపోతాం" ఒంటికంటిన దుమ్ము దులుపుకుని, కాళ్ళు చేతులూ విరుచుకుంటూ శరీరాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ అన్నాడు గౌరాంగ్.

వాళ్ళకేసి అనుమానంగా చూస్తూ "అక్కర్లేదు నేను నడిచి వస్తాను" అన్నాడు ప్రతాప్.

పసిపిల్లవాడిని చూసినట్టు ప్రతాప్‌కేసి చూస్తూ ఇద్దరు బోయీలూ సన్నగా నవ్వారు.

"భయపడకండి సాబ్... మీ ప్రాణానికి మా ప్రాణాలు అడ్డం వేసి మిమ్మల్ని క్షేమంగా కిందికి చేరుస్తాం. అక్కడ మేం రిపోర్ట్ చెయ్యాల్సిన టైము దాటిపోతోంది... ఎక్కువ ఆలస్యం చేస్తే మా కూలీ డబ్బులు రేపటి వరకూ రావు. మళ్ళీ వాన కూడా రావచ్చు. అసలే నేల జారుడుగా ఉంది చూశారుగా" హెచ్చరిస్తున్నట్టు అన్నాడు గౌరాంగ్.

లోలోపల మొలకెత్తుతున్న భయాన్ని తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో అదిమివేస్తూ వాళ్ళు చెప్పినట్టు చేశాడు ప్రతాప్. "సాబ్... కాస్త అటూ ఇటూ కదలకుండా కూర్చోండి" అంటూ ముందు రెండు కర్రలూ తనభుజం మీదికి ఎత్తుకుని వెనకవి స్నేహితుడికి వదిలాడు గౌరాంగ్.

కిందికి వడివడిగా సాగిపోతున్న డోలీలో ప్రతాప్ మనసు ముందు రోజు జరిగిన సంఘటనని నెమరు వేసుకుంది...

ప్రతాప్ హైదరా బాద్‌లో పేరున్న బిజీ లాయరు. తల్లి ఏదో మొక్కు వుందని పోరుపెడుతుంటే... ఓ వారం కేసులకి సెలవు ఇచ్చి కేదార్‌నాథ్‌కి బయలుదేరాడు.

ఆసలు అతని ప్రోగ్రామ్‌లో డోలీ ప్రయాణం లేదు. హెలికాప్టర్ టికెట్ బుక్‌చేసుకున్నాడు. సడన్‌గా మబ్బులు కమ్మి వెదర్ మారిపోవటంతో అది కాస్తా కాన్సిల్ అయ్యింది. ఎప్పటికి బాగుపడుతుందో చెప్పలేమంటూ తేల్చేశారు నిర్వాహకులు.

మర్నాడు పొద్దున్న వరకూ సర్వీస్ లేదు. రోజంతా రూమ్‌లో గోళ్ళు గిల్లుకుంటూ గడపటం బోర్ అనిపించింది ప్రతాప్‌కి. గౌరీకుండ్ వెళితే కొండమీదికి వెళ్ళటానికి డోలీలూ,గుర్రాలూ, తట్టల వాళ్ళూ అవైలబుల్‌గా ఉంటారని ప్రతాప్ ప్రయాణిస్తున్న పాకేజీ టూర్ బస్ గౌరీకుండ్ వైపు సాగిపోయింది.

సరదాగా కొండలూ, జలపాతాలూ, కంటికింపైన దృశ్యాలు చూడొచ్చని, నాలుగు వేలకి రానూ పోనూ డోలీ మాట్లాడుకున్నాడు ప్రతాప్.

వాతావరణం మబ్బు పట్టి అహ్లాదంగా వుంది.

డోలీని మోస్తున్న నలుగురు బోయీలూ ఏవో పాత హిందీ పాట పాడుకుంటూ లయగా అడుగులు వేస్తూ హుషారుగా కేదార్‌నాథ్ కొండమీదికి సాగిపోతున్నారు.

ఒక కాలు మడిచి మరోకాలు చెక్క పట్టీమీదికి ఆన్చి వెనక సపోర్ట్‌గా పెట్టుకున్న దిండుకు వీపు ఆన్చి డోలీలో కూర్చున్న ప్రతాప్‌కి లోయల్లో ఠీవిగా తలెత్తి నాట్యం చేస్తున్నట్టు కదులుతున్న పొడుగాటి చెట్లకొమ్మలు చల్లటిగాలి తెమ్మెరలతో గుండెలకి ఊపిరిపోస్తున్నాయి.

బోయీల అడుగులకి అనుగుణంగా సన్నగా ఉయ్యాల వూగుతున్నట్టు కదులుతున్నడోలీలో ప్రయాణం తను ఓ మహారాజులా ఒహోంఒహోం ఒహోం అంటూ పల్లకిలో ఊరేగుతున్నట్టు హాయిని కలిగించింది. ఉత్సాహంతో కిందికి వంగి చూస్తే... పాతాళబిలంలోకి దారితీస్తున్నట్టు భయపెడుతున్నాయి లోయలు.



ప్రతాప్ అటూ ఇటూ వంగి చూస్తుంటే... డోలీ కొంచెం బాలన్స్ తప్పింది. తడితడిగా వున్న నేల మీద కుడివైపు వున్న గౌరాంగ్ కాలు జారింది.

ఒక్క నిముషం ఆలస్యం అయితే నిరాటంకంగా లోయలోకి జారిపోయేవాడే. కుడిచేత్తో అతడి భుజం నొక్కిపెట్టి "నేల ఇలాగే చిత్తడిగా ఉంటుందా?" అని అడిగాడు ప్రతాప్.

"గుర్రాలకీ, కాలినడకన వెళ్ళే వాళ్ళకీ ఇదే దారి... అందులో రోజూ ఏదో ఒక టైంలో వాన పడుతోంది. అప్పుడప్పుడూ ప్రమాదాలు కూడా జరుగుతూ ఉంటాయి. మాలో కొందరు ఈ బురద నేలమీద జారి లోయలోకి పడిపోయిన సంఘటనలు వున్నాయి.

సవారీలకి మాత్రం ప్రమాదం రానియ్యంఎప్పుడూ.



బతుకుతెరువు కోసం మేము డోలీ కట్టకాతప్పదు. జారితే చావకా తప్పదు సాబ్. మీరు సరిగ్గా కూచోండి" అందరిలోకీ ఎక్కువబలంగా వున్న బోయీ మార్తాండ్ అన్నాడు.

"అలాగే" అని స్టడీగా కూర్చున్నాడు ప్రతాప్.

సగం దూరం వెళ్ళేసరికి వాన మొదలయ్యింది. పక్కనేవున్న పాక హోటల్ దగ్గర డోలీ ఆపారు.

వాళ్ళ వెనకాలే వెళ్ళి ఖాళీగా వున్న చోట కూర్చున్నాడు ప్రతాప్ ఒంటరిగా.

ఖానాకి డబ్బులు అడిగారు బోయీలు. వాళ్ళకి డబ్బులిచ్చి, తనకీ ఆకలిగా ఉండటంతో రోటీలు తిని చాయ్ తాగాడు ప్రతాప్.

గౌరాంగ్ నేపాల్ దేశస్థుడు. అతని తండ్రి హైదరాబాద్‌లో ఓ కోటీశ్వరుడి ఇంట్లో సెక్యూరిటీగా పని చేసేవాడు. అక్కడే అవుట్‌హౌస్‌లో భార్యతో నివాసం ఉండేవాడు. గౌరాంగ్ కాక ఓ కూతురు వున్నది అతనికి. గౌరాంగ్‌కి చదువు వంటబట్టలేదు.

టెన్త్ పాసయి మానేశాడు. తండ్రి తిట్టేసరికి అలిగి ఇంట్లోంచి పారిపోయాడు. అక్కడక్కడ పనిచేసి బతుకు గడిపేవాడు. సడన్‌గా ఓరోజు పేపర్లో వార్త చూసి హైదరాబాద్ పరిగెత్తాడు.

గౌరాంగ్ తండ్రి పనిచేసే యజమానికి వున్న వ్యాపార లావాదేవీల్లో శత్రువులకి తక్కువ లేదు. ఓ భాగస్తుడిని మందుపార్టీకి రమ్మని ఆహ్వానించాడు ఆ యజమాని. ఆ భాగస్థుడు ఇద్దరు అనుచరులని వెంటబెట్టుకుని మరీ వచ్చాడు.

ఆర్భాటంగా పార్టీ జరుగుతోంది. పెగ్గులతోబాటు వాదనలూ పెరిగిపోతున్నాయి. చివరికి బెదిరింపుల దాకా వెళ్ళింది వ్యవహారం. భాగస్తుడు సడన్‌గా లేచి నిల్చున్నాడు. జేబులోంచి పిస్టల్ తీశాడు.

విసురుగా లేచి అడ్డుకున్నాడు హోస్టు. పెనుగులాట మొదయ్యింది. అప్పుడే ఐస్ ట్రేలు తీసుకువస్తున్న గౌరాంగ్ తండ్రి యజమానికి అడ్డం వెళ్ళాడు. "ఢాం" అంటూ పిస్టల్ పేలింది.

గౌరాంగ్ తండ్రి నేల కూలాడు. అప్పటిదాకా శత్రువుల్లా కొట్టుకుంటున్న ఇద్దరు పెద్దమనుషులూ మత్తు దిగి మిత్రులైపోయారు. పోలీసులొచ్చారు.

చచ్చింది గౌరాంగ్ తండ్రి, చంపింది భాగస్తుడి అనుచరుడు మార్తాండ్ అని డిక్లేర్ చేశారు. పిస్టల్‌ని జేబులోంచి తీస్తుంటే పొరబాటున పేలిందని పోలీసులు రికార్డ్ చేసుకున్న కథనం.

తన యజమానికున్న పలుకుబడి తనకి శిక్షపడనివ్వదన్న ధీమాతో అరెస్ట్ అయ్యాడు భాగస్తుని అనుచరుడు మార్తాండ్.

కానీ అప్పుడు అక్కడున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ నేర్పుతో మార్తాండ్‌కి ఏడేళ్ళు శిక్ష పడింది. శిక్ష పడింది ఓ సామాన్యుడికే గాని తమకుకాదుకదా అన్నభావంతో ఇద్దరు పెద్దమనుషులు మిన్నకున్నారు.

చావుకి పరిహారంగా గౌరాంగ్ తల్లి చేతిలో కొంత డబ్బు పెట్టి వదిలించుకున్నాడు యజమాని.

ఆ డబ్బుతో చెల్లెలి పెళ్ళిచేశాడు గౌరాంగ్. తల్లిని తన దగ్గరికి తెచ్చుకుని తన సంపాదనతో ఆవిడని పోషిస్తున్నాడు గౌరాంగ్.

జైలునుంచి విడుదల అయిన మార్తాండ్‌ని అతని యజమాని భవంతి గేటులోపలికి కూడా రానివ్వలేదు సెక్యూరిటీ. కొంత డబ్బుతో బాటు మళ్ళీ ఆ చుట్టుపక్కల కనిపించినా, ఆ ఇంటి ఛాయల్లో అతని నీడ పడినా ప్రాణాలు దక్కవన్న బెదిరింపు కూడా పంపించాడు యజమాని ఓ పనివాడితో.

కొండను ఢీకొట్టలేని ఆ అశక్తుడు ఎక్కడా ఉద్యోగం దొరక్క, తిండికీ అల్లాడుతూ ఇక్కడికి వలసవచ్చి కొందరి కడుపూ కాళ్ళూ పట్టుకుని డోలీకట్టే ఉద్యోగంలో రిజిస్టరయ్యాడు.

అతనితో శిక్ష అనుభవించినతోటి మరోఖైదీఒకడు కూడా ఇక్కడికేవచ్చి ఈ డోలీలు మోసేపనిలో కుదిరాడు. అప్పుడప్పుడూ కొంతమంది యాత్రికులని బెదిరించో, భయపెట్టో, వాళ్ళ దగ్గరున్న డబ్బుకొట్టేస్తూ, ఆ విషయాలు బయటికి రాకుండా జాగ్రత్తపడుతూ రోజులు గడుపుతున్నారు ఆ ఇద్దరూ.

ప్రతాప్‌ని చూసిన క్షణంలోనే ఆనాడు తనకి శిక్ష వేయించిన లాయరుగా గుర్తుపట్టాడు మార్తాండ్.

తనకీ గతిపట్టిచ్చింది అతడేనన్న కోపంతో కసితో రగిలిపోయాడు. ప్రతాప్ అంతుచూడాలని శపథం తీసుకున్నాడు. తన తోటి ఖైదీతో రహస్యంగా మంతనం సాగించాడు.

ప్రతాప్ వ్రేళ్ళకున్న ఉంగరాలూ, మెడలో గొలుసుకి వున్న లాకెట్‌లో పొదిగిన వజ్రాలు ఆ రెండవ ఖైదీని ఆకర్షించాయి.

ఈసారి మార్తాండ్‌కి డోలీ బ్యాచ్‌లో గౌరాంగ్ జతపడ్డాడు. అప్పటికే గౌరాంగ్ అమాయకుడని విన్న

## జీవితం మారిపోయింది

తాజా అందాలతో మిసమిసలాడే అనుఇమాన్యుయేల్ కెరీర్ జోరుమీదున్నదంటూ హుషారుపోతున్నది. వచ్చిన అవకాశాలను అందిపుచ్చుకుని వీలయినంతగా తన ప్రతిభను చాటే ప్రయత్నాల్లో పడింది అనుఇమాన్యుయేల్.

కెరీర్ సంగతిని కదిలిస్తే ముఖంనిండా ఆనందపు వెలుగులు నింపుకుని సమాధానమిచ్చింది. "తెలుగు చిత్రపరిశ్రమలో అడుగు పెట్టినప్పటి నుంచి నా జీవితమే మారిపోయింది. కెరీర్ ఎంతో హుషారుగా సాగుతున్నది. మంచి అవకాశాలు వస్తున్నాయి. అగ్రహీరోలతో, యువతరంతో కలసి నటించడం సంతోషంగా ఉందంటూ సంబరంగా చెప్పింది.



మార్తాండ్‌కి అతడిని ఈజీగా మానేజ్ చెయ్యొచ్చని నమ్మకం కలిగింది. గౌరాంగ్ స్నేహితుడైన అలాంటి అమాయకుడే నాల్గవ బోయీగా దొరికాడు.

కొండమీదకు జేరాక, దేవుడి దర్శనానికి ప్రతాప్‌ని గుడివైపుకి పంపించి,

మిగిలిన బోయీలు ముగ్గురినీ పక్కకి తీసుకెళ్ళి, తన ప్లాను బయటపెట్టాడు మార్తాండ్.

అది... రిటర్న్ జర్నీలో... చీకటిమాటున కోసుగా వంకరగావున్న మలుపులో జనసాంద్రత చాలా తక్కువగా ఉండేచోట ప్రతాప్ దగ్గర వున్న నగలూ డబ్బూ బలవంతంగా దోచుకుని, అతడ్ని లోయలోకి తోసేయాలన్న దుర్మార్గపు ఆలోచన.

కారణం ఏడేళ్ళక్రితం హైదరాబాద్‌లో తనకి జైలుశిక్షవేయించిన గవర్న్‌మెంట్ లాయర్ ఆ ప్రతాపేనని, అందుకని ఈ అవకాశాన్ని వదిలిపెట్టకుండా అతడ్ని హతమార్చాలని ఆ కేసు వివరాలు పూర్తిగా చెప్పి...

కాదంటే తన చేతుల్లో ప్రాణాలు పోతాయనివెన్నుకి కత్తి ఆన్చి మార్తాండ్ చెప్పిన ఆలోచనకి భయంతో తల ఊపకతప్పలేదు గౌరంగ్‌కి.

నాలుగో అమాయకుడు కూడా భయంతో తల ఊపాడు. అప్పుడే గౌరాంగ్‌కి తెలిసింది తన తండ్రిని చంపిన హంతకుడు మార్తాండ్ అని.

కానీ విచిత్రం.. సరిగ్గా ప్రతాప్‌ని లోయలోకి ఏ మలుపులో తోసెయ్యాలని ప్లాన్ వేశారో అదేచోట ప్రతాప్‌కి బదులు నేరం చెయ్యాలనుకున్న దోషులిద్దరూ లోయలో పడి చనిపోయారు. క్రిందికి చేరాక ప్రతాప్‌కి నమస్తే చెప్పాడు గౌరాంగ్.

"వాళ్ళు అలా చనిపోవటం నాకు బాధగా ఉంది" ప్రతాప్ మాటలకి లీలగా నవ్వారు ఇద్దరూ.

"సాబ్ మీరు నన్ను, మార్తాండ్‌ని గుర్తుపట్టలేదు. అలా లోయలోకి జారిపోయిన ఇద్దర్లో ఒకడు మార్తాండ్. ఏడేళ్ళ క్రితం హైదరాబాద్‌లో ఓ కేసులో తనకి జైలు శిక్ష వేయించిన లాయరు మీరేనని అతను గుర్తుపట్టాడు. ఆ కోపం, కసితో... మిమ్మల్ని చంపాలని ప్లాన్ వేశాడు.

మీరు గుడిలోకి వెళ్ళినప్పుడు మాకు ఆ విషయం చెప్పి... నోరు మెదిపితే చంపేస్తానని బెదిరించాడు. కాని అతనికి తెలియదు అతని చేతిలో చనిపోయిన వ్యక్తే నా తండ్రని.

పైనుంచీ దేవుడు చూస్తున్నాడు సాబ్. ఆ దేవుడే మిమ్మల్ని కాపాడి ఆ వెధవని చంపి న్యాయంచేశాడు" నిజాయితీతో కేసు వివరాలు చెబుతూన్న గౌరాంగ్‌ని చూస్తూ, అతను చెబుతున్నది వింటూంటే జరిగింది అర్థం అయ్యింది ప్రతాప్‌కి.

కృతజ్ఞత నిండిన కళ్ళతో చూస్తూ, తన ఒంటిమీది గొలుసూ, ఉంగరం తీసి గౌరాంగ్ చేతిలో పెట్టి... "థాంక్స్. మీరిద్దరూ తీసుకోండి' అనేసి వడివడిగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు ప్రతాప్.

ఆశ్చర్యపోయారు ఇద్దరూ. ఆనందంతో తబ్బిబ్బయిపోయారు. అసలు జరిగింది ఏమిటంటే...

ప్లాన్ ప్రకారం ఆ మలుపుదగ్గరికి వచ్చేసరికి ప్రతాప్‌ని బెదిరించి, నగలు దోచుకోవడానికి వంగి, నడుములో దోపిన కత్తిని తియ్యబోయాడు మార్తాండ్. ఆ తర్వాత లోయలోకి అతన్ని తోసేసి ప్రమాదవశాత్తూ లోయలో పడి చనిపోయాడని దొంగ ఏడుపు ఏడవాలన్నది మార్తాండ్ ప్లాన్.

కాని, తన కర్తవ్యాన్ని నిర్దేశించుకున్న గౌరాంగ్ తన స్నేహితుడి సాయంతో మార్తాండ్‌ని, వాడి తోటి కుట్రదారుడ్నీ... శక్తినంతా కాళ్ళల్లోకి తెచ్చుకుని బలంగా తన్నారు. ఆ అనుకోని దాడికి తట్టుకోలేక బాలన్స్ తప్పి... పెద్దగా కేకపెడుతూ లోయలోకి జారిపోయారు ఇద్దరూ.

ప్రమాదవశాత్తూ జరిగినట్టు చెప్పొచ్చు అన్న మార్తాండ్ ప్లాన్‌ని అతడికే వర్తింపచేశాడు గౌరాంగ్. ఇప్పుడు గౌరాంగ్‌కి ఎంతో ఆనందంగా వుంది.

ఆకాశంలోకి చూస్తూ 'భగవంతుడా... ప్రతి వృత్తికీ కొన్ని ధర్మాలు ఉంటాయి.

డోలీ మోసే బోయీలం యాత్రీకులని క్షేమంగా గమ్యంచేర్చటం నిజాయితీగా మామీద ఉన్న నమ్మకాన్ని పెంపొందేలా ప్రవర్తించటం మా ధర్మం.

అన్నంపెడుతున్న వృత్తికి ద్రోహంచేయాలన్న ఆలోచన ఎవడికైనా వస్తే... దురాలోచనతో పాటు వాడినీ అంతం చెయ్యాలి అన్నది నా నమ్మకం. ఆ ధర్మాన్ని పాటించని మార్తాండ్‌ని అంతం చెయ్యటం హత్యకాదు.. శిక్ష మాత్రమే.

అటువంటి నీచులు కారణంగా బోయీలు దొంగలు, హంతకులు అన్న పుకారు వ్యాపించిందంటే... భక్తులూ, ప్రయాణీకులు రావటానికి భయపడతారు. కొన్ని దశాబ్దాలనుంచీ దీనిమీదే ఆధారపడి నిజాయితీగా బతుకుతున్న కుటుంబాలు రోడ్డున పడతాయి. ఒక్కడి కుతంత్రం వల్ల మా బోయీలందరికీ చెడ్డ పేరు రావటం ఖాయం.

ఇంతమందికి కూడుపోకూడదని నేను ఇంతకి సాహసించాను. అలాగే లాయర్ సార్ నిజాయితీగా తన వృత్తిధర్మం తను నిర్వర్తించాడు.

ఆయన్ని కాపాడటం కోసం ఈ కలుపుమొక్కని తీసెయ్యటం సబబే అని నమ్ముతున్నాను. అందుకే ఈ సాహసానికి ఒడిగట్టాను.

కాపాడతావో, కాలరాస్తావో నీ ఇష్టం' అనుకుంటూ స్నేహితుడి చెయ్యి అందుకుని, ప్రతాప్ తనకిచ్చిన నగల్ని, అతని చేతిలో వుంచి

"దోస్త్! వృత్తిపట్ల నిజాయితీని చూపించడానికి నాతోబాటు నువ్వు కూడా సాహసం చూపించినందుకు ఈ నగలు నువ్వు తీసుకో.

నాకు ఒక మంచి పనిచేశానన్న గొప్ప తృప్తిని మించిన బహుమతి ఏదీ లేదు.

పద! ఎట్టి పరిస్థితుల్లోనూ రహస్యాన్ని మాత్రం బయటకు పొక్కనియ్యకు. ప్రమాదవశాత్తూ ఆ దుర్మార్గులిద్దరూ లోయలోకి జారిపోయారని రిపోర్టిచ్చి, కూలిడబ్బులు తీసుకుందాం" అంటూ, ఆత్మతృప్తితో బోరవిరుచుకుని, బలంగా ముందుకి అడుగులు వేశాడు గౌరాంగ్.



మార్పును అంగీకరించటమే కాంగ్రెస్ పార్టీ సంస్కృతి.

-రాహుల్‌గాంధీ, కాంగ్రెస్ అధ్యక్షుడు

# హెయిర్ ఆయిల్స్

వల్లగా నిగనిగలాడే, ఒత్తయిన జుట్టుకోసం ప్రతి ఒక్కరూ ప్రయత్నిస్తుంటారు.అందుకోసం రక రకాల నూనెల్ని వాడుతుంటారు. అందమైన, ఆరోగ్య పూరిత శిరోజాలు కావాలంటే ఖచ్చితంగా అందుకు తగిన పోషకాలు అందించాలి.

అయితే ప్రతీసారీ సరైన నూనె ఎంచుకుంటు న్నారా? లేదా? అనేది సందేహమే. ఇక్కడో విషయాన్ని గ్రహించాలి. అందరికీ ఒకే రకమైన నూనె సూటవదు. ఎవరి శిరోజాలతత్వాన్ని అనుసరించివారికి సరిపడే నూనెలు ఎంచుకోవాలి.

శిరోజాల రకం, వాటికి సంబంధించిన సమస్యలు ప్రధానపాత్ర వహిస్తాయి.ఒకరికి బాగా నప్పిన నూనె రెండోవారికి నప్పాలని లేదు.

స్నేహితురాలో, మరొకరో చాలా నమ్మకంగా చెప్పారని అదేరకాన్ని తాము ఎంచుకోకూడదు.

ఫేవరెట్ సెలబ్రిటీలు ప్రచారంచేస్తున్నారనీ వాడ కూడదు. అవన్నీ తమ శిరోజాల అవసరాలకు ఖచ్చిత మైన పరిష్కారంగా భావించకూడదు. ఏ సమస్యలకు, ఎటువంటి నూనె సూటవుతుందో తెలుసుకోవాలి.



### పొడి, చిక్కుల జుట్టు
## ఆర్గాన్ ఆయిల్

ఆర్గాన్ ఆయిల్‌లో ఫ్యాటీయాసిడ్స్, విటమిన్ ఇ ఉంటాయి. ఇవి రెండూ జుట్టును మృదువుగా, మెరుపులీనేలా వుంచుతాయి. రెంచుచుక్కల ఆర్గాన్ ఆయిల్ తీసుకుని, జుట్టు అంతా రబ్ చేయాలి.

మాడు మసాజ్ చేసుకోవాలి. కుదుళ్ళనుంచి జుట్టు బలంగా, మృదువుగా తయారవుతుంది. ప్రతి తలస్నానానికి ముందు ఇలా చెయ్యాలి.

### డ్యామేజ శిరోజాలు
## మకడమియా ఆయిల్

హాని జరిగిన జుట్టుకు విస్తృత చికిత్స అవసరం అవుతుంది. తిరిగి జుట్టుకు జీవనాన్ని చేకూర్చాల్సి వుంటుంది. మకడామియా నూనె అత్యంత పోషకాలతో కూడినది. పునఃనిర్మాణ, హైడ్రేటింగ్ గుణాలుంటాయి. నట్ పదార్థాలు ఎక్కువ. నిస్సారంగా, పేలవంగా వున్న జుట్టుకు పునరుజ్జీవాన్ని ఇవ్వడంలో, మాడును తేమగా వుంచడంలో బాగా ఉపకరిస్తుంది. నూనె వేడిచేసి, గోరువెచ్చగా వుండగానే కుదుర్లనుంచి, చివరలదాకా అప్లయ్ చేయాలి. రాత్రంతా అలా వదిలేసి, ఉదయాన్నే తలస్నానం చేయుడంవల్ల మంచి ఫలితాలుంటాయి.

### జుట్టు రాలడం
## ఆలివ్ ఆయిల్

జుట్టు పొడవుగా, నాణ్యంగా, బలంగా వుండాలంటే ముందుగా కావాల్సింది జుట్టు రాలక పోవడం. ఇందుకు ఆలివ్ ఆయిల్ సరైన పరిష్కారం. ఆలివ్ ఆయిల్‌లో బి, డి, ఇ విటమిన్లుంటాయి. ఇవి జుట్టు రాలడాన్ని అడ్డుకుంటాయి. చుండ్రువున్నా జుట్టురాలడానికి ప్రధాన కారణం కాగలదు. శిరోజాల పరిరక్షణలో ఆలివ్ ఆయిల్‌ను జొప్పించడంవల్ల ఈ సమస్యను పరిష్క రించుకోవచ్చు. మాడుకు ఈ నూనెతో బాగా మసాజ్ చేయాలి. ఇలా మసాజ్ చేయుడంవల్ల రక్తసరఫరా మెరుగవుతుంది. ఫలితంగా జుట్టురాలడం తగ్గి, పెరగడం మొదలవుతుంది.





Courtesy : HAIR



## కెమికల్ ప్రక్రియ జరిగిన శిరోజాలు
# మరులా ఆయిల్

కెమికల్ చికిత్సలు తీసుకున్న శిరోజాలకు అత్యధిక పోషకాలు అందించాల్సిన అవసరం ఉంటుంది. మరులా ఆయిల్‌లో యాంటీఆక్సిడెంట్ గుణాలుంటాయి. జుట్టుకుదుళ్ళలోకి లోతుగా చొచ్చుకునిపోయి, తేమస్థాయిలను, కోల్పోయిన మెరుపును పరిరక్షిస్తాయి. నూనెను కుదుళ్ళనుంచి చివరలదాకా బాగా రాయాలి. దీనివల్ల శిరోజాల నిర్వహణ చక్కగా వుంటుంది.



## ఫైన్ హెయిర్
# జొజోబా ఆయిల్

ఇటువంటి రకం శిరోజాలకు తేలికపాటి నూనె కావాల్సి వుంటుంది. ఇవి శిరోజాల టెక్చర్‌ను కాపాడతాయి. జొజోబా ఆయిల్ పర్‌ఫెక్ట్ ఛాయిస్. ఈ నూనె తేలికగా వుండడమే కాకుండా జిడ్డు ఉండదు. మాడులో ఉండే సహజ నూనెల వంటివే. నూనె అప్లయ్‌చేసి, పావుగంటాగి తల స్నానం చేసేయాలి. క్రమేణా జుట్టు ఎదుగుదల కనపడుతుంది. కావాల్సిన, కోరిన వాల్యూమ్ లభిస్తుంది.





## చిక్కని జుట్టు
# క్యాస్టర్ ఆయిల్

చిక్కని, ఒత్తయిన జుట్టును మెయిన్‌టెయిన్ చెయ్యడానికి తగిన నూనె క్యాస్టర్ ఆయిల్. ఇదే రిఫైండ్ ఆముదం. విటమిన్ ఇ, ఖనిజాలు, ఒమెగా-6, 9 ఫ్యాటీ యాసిడ్స్ అత్యధికంగా లభిస్తాయి. జుట్టు కుదుళ్ళు దృఢంగా అవుతాయి. ఈ నూనెను తగుమాత్రంగా వాడాలి. జిడ్డు ఎక్కువ కాబట్టి వదిలించుకోవడం కష్టం. తలస్నానానికి ముందు వారానికి ఒకటి, రెండుసార్లు చాలు. జిడ్డు పూర్తిగా వదిలేవిధంగా షాంపూ చేసుకోవాలి.



## చుండ్రు, దురద
# ఆల్మండ్ ఆయిల్

బాదంపప్పులు తినడం ఎంతో ఆరోగ్యదాయకం. ఇవి తింటుంటే చర్మానికి, శిరోజాలకు మేలుచేస్తాయి. దాంతోపాటు శిరోజాల పరిరక్షణ కార్యక్రమంలో ఆల్మండ్ ఆయిల్‌ను భాగం చేసుకుంటే మరింత మేలుజరుగుతుంది.విటమిన్ ఇ, ఫ్యాటీ యాసిడ్స్, ప్రొటీన్లు, మెగ్నీషియం అత్యధికంగా లభిస్తాయి. శిరోజాలకు లోపలినుంచి మేలు జరుగుతుంది. మాడు దురద, చుండ్రు సమస్యలుగలవారికి ఇది మంచి పరిష్కారం. బాదంనూనెతో సింపుల్‌గా మసాజ్ చేసుకుని, రాత్రంతా వదిలేస్తే, మాడు ఇన్‌ఫ్లమేషన్ తగ్గుతుంది. చుండ్రు తొలగిపోతుంది.



## ఉంగరాల జుత్తు
# కొబ్బరినూనె

ఉంగరాల జుత్తు చిక్కగా, అధిక వ్యాల్యూమ్ కలిగివుంటుంది. సహజనూనెలు ప్రతిసారీ కొసలు చివరిదాకా అందవు. అదనపు మాయిశ్చరైజర్ కావాల్సి వుంటుంది. ఫ్యాటీ యాసిడ్స్‌కు కొబ్బరినూనె ఉత్తమ సహజ ఆధారం. దీనిలోని యాంటీ బ్యాక్టీరియల్, యాంటీ మైక్రోబియల్ గుణాలు శిరోజాలకు మంచి పోషకాలు అందిస్తాయి. వారంలో కొబ్బరినూనెను రెండు, మూడుసార్లు అప్లయ్ చేస్తుండాలి. రాత్రి పడుకునే ముందు రాసుకుంటే మరునాటి ఉదయం వాష్ చేసుకోవచ్చు.

తక్షణ పరిష్కారం కనపడలేదని నూనెపెట్టడాన్ని ఆపేయకూడదు. మొదట్లో ఇదంతా ఫలితంలేని ఓ పనిగా కనపడవచ్చు. కాని దీర్ఘకాలంలో క్రమం తప్పకుండా వాడుతుంటే అందమైన, ఆరోగ్యకరమైన, మెరుపులీనే ఫలితాలు కనపడతాయి.

ఎమ్.పరిమళ

సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త



"లావినియా! అదేమిటి... ఆ పక్షులు పారిపోతాయ్! పైగా చూస్తూంటే రెక్కలు కత్తిరించినట్టుగా లేదు..." అంది సౌగంధిని.

లావినియా "పోనీయ్ సౌగంధినీ! ఈ సృష్టిలో ఏ జీవి స్వేచ్ఛనూ అరికట్టే హక్కు మనకు లేదు.

పైగా ఇతరులకు హానిచేయని మూగజీవుల్ని మానవులు తమ వినోదంకోసం పంజరాలలో, బోనుల్లో బంధించటం ఎంతటి పాపం, ఎంతటి హేయం!"

"కానీ అతడు మీకు కానుకగా ఇచ్చాడే... కానుకలను, బహుమతులను కాపాడుకోవటం దాతను గౌరవించటంతో సమానం లావినియా" అంది సౌగంధిని.

"అవచ్చుకానీ... ఐతే ఇటువంటి బహుమతులు కావు" ఈసారి లావినియా మరేమీ ఆలోచించకుండా ఆ ఇరువురితో నిమిత్తంలేకుండా పంజరం తలుపుల్ని తెరిచింది. ఒక్కసారిగా కట్టలు తెంచుకున్న ప్రవాహంలా ఆ రెండు పక్షులు పంజరం నుంచి బయటపడ్డాయ్!

సి.శివరామమూర్తి

అయితే ఆశ్చర్యంగా జాక్ డాస్ జంట ఆ మందిరం అంతా గిరికీలు కొట్టి, తిరిగి తిరిగి చివరకు లావినియా చెరో భుజాలపైన వాలాయ్!

లావినియా ప్రేమగా చేతిలో అరటి పండు ముక్కల్ని అందించింది.

ఆ రెండు పక్షులు అంతకంటే ప్రేమగా ఆ ముక్కల్ని స్వీకరించి ఈసారి లావినియా ఒళ్ళో చేరాయ్.

లావినియాకు ఉన్నట్టుండి జాక్ డాస్‌లపై ప్రేమ ఉద్భవించింది.ప్రేమగా వాటిని నిమరటం ప్రారంభించింది.

సౌగంధిని, సుకన్యలు ఆ దృశ్యాన్ని అద్భుతంగా తిలకిస్తున్నారు.

ఆ ముగ్గురికి ఆ క్షణములో తెలియని విషయం.

**మ**హారాణి కుమారదేవి సామ్రాట్‌ను అర్థించటం మూడవసారి.

"సముద్రుడు ఏమయ్యాడో మహాప్రభూ! భద్రకాళీ ఆలయంలో మాయమయిపోయిన యువరాజా, ఒంటరిగా అంగరక్షకులు కూడా లేకుండా ఎక్కడకు వెళ్ళివుంటాడు?"

సామ్రాట్ మాట్లాడలేదు. మహారాణి వైపు తీక్షణంగా చూసి ఈసారి తల తిప్పి గవాక్షం నుంచి ఆకాశంవైపు చూడటం మొదలుపెట్టాడు.

"ప్రభూ! సముద్రుడి ఆచూకీ మీకు తప్పక తెలుసుండాలి.అందుకనే మీరు మౌనం వహిస్తున్నారు..." కుమారదేవి గొంతులో ఆవేదన.

ఈసారి సామ్రాట్ గొంతు విప్పాడు

"అవును మహారాణీ! సారంగుడి ఆశ్రమానికి చేరాడు సముద్రుడు"

"ఎవరు చెప్పారు మహాప్రభూ!"

"వేగుల వర్తమానం. సముద్రుడు ఒంటరిగా వెళ్ళినా రహస్యంగా అతని జాడను అనుసరించమని మా ఉత్తర్వు. ఇంతకుముందే వేగుల నుండి కపోత వర్తమానం చేరింది... నీ పుత్రుడు క్షేమమే, నీకు చింత అక్కరలేదు"

"మరి ప్రభువులు ఇంతవరకూ మౌనం వహించటంలో అంతరార్థం"

"... ... ..."

"చెప్పండి ప్రభూ!"

"నాలో తీరని అసంతృప్తి మహారాణీ! మీతో ఇంతవరకు నా మనసులోని కొన్ని విషయాలను చెప్పనేలేదు. ఈ రాజ్యానికి వారసుడెవ్వరో, నేను చేసిన నిర్ణయం ఏమిటో మీకు చెప్పవలసిన తరుణం ఆసన్నమయింది"

"**ప్ర**భువులు ఈ మధ్యకాలంలో మధనపడ్తున్నారని గ్రహించాను. ముఖ్యంగా కాపాలికుడు తారసపడిన నాటినుంచి"

"అవును దేవీ! కాపాలికుడు అంటే నాకు ఎంతో విశ్వాసం ఏర్పడింది. పైగా నా సమస్యను పరిష్కరిస్తానని కూడా మాట ఇచ్చాడు"

"... ... ..."

"ఈ రాజ్యానికి కాబోయే వారసుడు సముద్రుడు కావాలని నా ఆకాంక్ష దేవీ...!" అన్నారు.

## జరిగిన కథ

**ఆ**లయం నుంచి నిష్క్రమించిన యువరాజు రాజధానికి ఎందుకు చేరలేదో కచ, కశ్యపులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. రాజనర్తకి సౌగంధిని లావినియాదగ్గరకు వెళ్ళి ఆమె అందచందాలగురించి పొగుడుతుంది.

సౌగంధి అంటే లావినియాకు స్నేహభావం ఏర్పడుతుంది.

"ఇంద్రప్రస్థ రాజు నాగాయకుడు నా తల్లిదండ్రుల్ని సంహరించాడు. వాడి పీడ అణిచేందుకే తాను సముద్రగుప్తుడ్ని ఆశ్రయించినట్లు సౌగంధికి చెబుతుంది లావినియా.

జాక్-డాస్ పక్షుల జంటగురించి వింటుంది లావినియా.

అడవిలో గురుదేవుడైన సారంగుడు తటస్థపడతాడు సముద్రగుప్తుడికి. సూర్యభగవానుడికి అర్ఘ్యం ఇచ్చే అలవాటును వదులుకున్న సముద్రగుప్తుడిని మందలిస్తాడు సారంగుడు.

అంతేకాదు, నీవు అసమర్థుడివి, రాజ్యాన్ని ఏం పాలించగలవంటూ హేళన చేసేసరికి సముద్రగుప్తుడిలో ఆవేశం రగులుకుంటుంది.

తనకి సన్యాసం ఇప్పించమని గురువుగారిని కోరతాడు సముద్రగుప్తుడు. ఓ ఆగంతకుడు జాక్ డాస్ పక్షుల జంటను లావినియాకు అప్పజెప్పి వెళ్తాడు. ఇక చదవండి.

"ఔను నీసందేహం వివరించనక్కరలేదు. ఈ దేశపు ప్రజల సందేహం. ఆఖరకు నా అంతరంగంలోని సందేహము, అందరి సందేహ సంశయాలు ఇవే - క్షాత్రములేని సున్నితుడు సముద్రుడు. ఈ మహారాజ వంశపరంపరలో ఇతడు మనకెలా జన్మించాడో నాకర్థంకాని విషయం"

"రాజవంశంలో జన్మించిన సిద్ధార్థుడు, సున్నితమనస్కుడే కదా మహాప్రభూ! చిత్తప్రవృత్తులు దైవదత్తాలు. అసురుడైన హిరణ్యకశిపుడికి భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు, మహర్షి అయిన కశ్యపుడికి రాక్షసులు జన్మించలేదా!"

"... ... ..."

"అయినా చింత దేనికి ప్రభూ! కచగుప్తుడు కూడా రాజ్యమేలటానికి అన్ని విధాలా అర్హుడే...."

"అయితే వైశాలీ నగర ఉదంతం విన్నావా మహారాణీ!"

"**వి**న్నాను ప్రభూ! మహామంత్రి, యువరాజులు కలసి దోషి అయిన నగరపాలకుడికి విధించిన శిక్ష గురించి మనిద్దరమే కాక, సమస్త పాటలీపుత్ర ప్రజలు చర్చించుకున్నారని, ప్రభువులకు ప్రత్యేకంగా చెప్పనక్కరలేదనుకుంటున్నాను"

"ఎంత దారుణమైన శిక్ష విధించాడు



"అవును దేవీ! నీ కుమారుడు సురక్షితమే! ప్రశస్థి నగర శివార్లలో క్షేమంగా వున్నాడు సముద్రుడు"

"నారాయణవనంలోనా..." కుమారదేవి గొంతులో విస్మయం.

ఆ మాటలకు పలువరసలు తళుక్కుమనేంతగా నవ్వింది కుమారదేవి.

"మీలోని మధనానికి గల ఈ కారణాన్ని నేను ఎన్నడో గ్రహించాను. కానీ సముద్రుడు..."

కచుడు. విన్న నాకే ఒళ్ళంతా జలదరించిపోయింది... ఇక ఆ దృశ్యాన్ని బ్రతికివున్న మనిషిని సలసలమని కాగుతున్న నూనెలో మరగపెట్టడం-చూసిన ఆ ప్రజానీక మానసికస్థితి



# త్వరగా నేర్చేశా

కన్నడ తార నభానటేష్ తెలుగు సినీ అవకాశాన్ని పొంది ఆనందపడి పోతున్నది.

ఇంకా పేరు ఖరారుకాని చిత్రంలో సుధీర్‌బాబు సరసన నటిస్తున్నది.

"చిత్ర నిర్మాతలు చక్కని హావ భావాలు ప్రదర్శిస్తూ, సరయిన బాడీ లాంగ్వేజ్ గల తారకోసం చూస్తూ, ఈ లక్షణాలను నాలో గుర్తించారు. ఆడిషన్ చేశారు. ప్రాజెక్టు ఇచ్చారు" అని చెపుతున్న నభానటేష్‌కు ఇది రెండో తెలుగు సినిమా.

"తెలుగుకు, కన్నడకు సారూప్యం ఉంటుందికాబట్టి నాకు బాగానే అర్థ మవుతున్నది. సెట్స్‌లో అందరూ తెలుగు మాట్లాడుతుంటారు. దాంతో ఊహించినదానికంటే త్వరగా నేర్చే స్తున్నా" అని తెలిపింది.

ఎలా ఉంటుందో... ఇతడు రాజా లేక రాక్షసుడా అని తప్పకుండా మనసులో ప్రజలందరూ అనుకొనివుంటారని నా సందేహం"

కుమారదేవి కళ్ళల్లో ఈసారి కాఠిన్యం "అవును... ప్రజల సొమ్మును దుర్వినియోగపరచిననేరం, ఘోరాతిఘోరం. ఇకముందు ఎన్నడూ మరెవ్వరూ మరొక్కసారి ఆ నేరాన్ని చేసేందుకు సాహసించరు"

సామ్రాట్‌లో ఆశ్చర్యం "మహారాణీ! మీరు కచుడ్ని సమర్థిస్తున్నారా!"

కుమారదేవి నిర్భయంగా అన్నది "అవును ప్రభూ! రాజ్య క్షేమాన్ని కోరి యువరాజు కచుడు ఆ దండనను నల్గురికి పాఠం కావాలని, అందరి ముందూ విధించాడు. ఇందులో తప్పే ముంది? నాకు కచుడిగురించి విస్మయం కలగటం లేదు. ఇలా ఆలోచిస్తున్న మీ గురించే విస్మయం చెందుతున్నాను"

ఒక్కసారిగా చంద్రగుప్తుడు తనను తాను నిగ్రహించుకున్నాడు. 'ఈ విష యంలో తామిద్దరకూ భావవైరుధ్యం నడుస్తోంది' అంతేకాదు, మహారాణిలో ఇంతకాలమూ మార్దవమే ఎక్కువ పాలు అనుకున్నాడు, కానీ ఈ సమయంలో, ఈమెగురించిన కొత్త సత్యం మెరుపు లాగా మెరిసింది.

కుమారదేవిలో వజ్రసమానమయిన కఠిన హృదయం ఉన్నది.

సుక్షత్రియురాలు, తల్లి నుండి కచుడు ప్రధానముగా ఈ గుణాన్ని పుణికిపుచ్చుకున్నట్టున్నాడు!"

మనసులోనే నిట్టూర్చాడు చంద్ర గుప్తుడు. 'తానిప్పుడు ఒంటరివాడు. తనను అర్థంచేసుకొనేవారెవ్వరూలేరు. మహారాణి, మహామంత్రి, యువరాజు కచుడు ఆఖరకు ఈ దేశ సమస్త ప్రజా నీకం ఆలోచన ఒక త్రాటిపైనే నడు స్తోంది. ఎవరితో చెప్పుకుంటాడు?'

హఠాత్తుగా కాపాలికుడు గుర్తుకు వచ్చాడు సామ్రాట్‌కు 'నీ సంకల్పాన్ని నేను నెరవేరుస్తాను చంద్రగుప్తా...!' అభయమిస్తోన్న కాపాలికుడి మాటలు గుర్తుకొచ్చాయి. ఎందుకనో చంద్రగుప్తు డికి హృదయం తేలికయింది.

కుమారదేవి, సామ్రాట్‌ను ఓర కంటతో గమనిస్తూ ఆయన మనో భావాల్ని ఆకళింపు చేసుకోవాలని ప్రయత్నం చేస్తోంది. చంద్రగుప్తుడికి ఎందుకనో తన మనోభావాల్ని పూర్తిగా ఏకరువు పెట్టడానికి అది సమయం కాదని అన్పించింది. కారణం మహా రాణి కచుడ్ని సమర్థించటమే.

మౌనం వహించిన సామ్రాట్‌ను చూసి కుమారదేవిలో ప్రశ్నలు! ఆలో చించగా ఆలోచించగా ఆమెకు తన తప్పిదమేమిటో అవగతమైంది.

'సామ్రాట్ సముద్రుడిని రాజు చేయా లనుకున్న తరుణంలో తను కచుడ్ని సమర్థించింది. ఇక రాజు తన ఆలోచన లను తనముందు బయటపెట్టడు?'

కుమారదేవి ఊహించిన తీరు సవ్య మయినదే. నిజానికి అలా ఆలోచించ లేకపోతే ఆమె ఆ దేశానికి మహారాణి అయివుండేదికాదేమో!

"సముద్రుడే రాజు అయితే బాగుం టుందని నాకూ అంతర్లీనంగా ఒక కోరిక ఉంది ప్రభూ! కానీ సముద్రుడికే రాజ్యము, రాజ్యపాలన అంటే ఏవ గింపు. ఈ ఏవగింపును ఎలా పోగొట్ట గలుగుతాం ప్రభూ!"

చంద్రగుప్తుడు తల విదిల్చాడు. ఒకసారి మహారాణి కళ్ళలోకి సూటిగా చూసి, ఆ తరువాత అక్కడనుండి నిష్క్రమించాడు. సామ్రాట్ మనసులో ఏ భావాలు ఉన్నాయో, ఎంత ఆలోచిం చినా ఆ తర్వాత కుమారదేవికి అంతు పట్టకుండా అయిపోయింది.

కొంతసేపయ్యాక వార్త వచ్చింది. మహామంత్రి కశ్యపబ్రహ్మ, యువరాజు కచగుప్తుడు నగరానికితిరిగివచ్చారని.

మహారాణి కుమారదేవి, కచుడికి కబురుపెట్టింది.

తల్లి పిలుపువిందుకొని, ఆఘ మేఘాలమీద వచ్చాడు కచగుప్తుడు. తల్లికి పాదాభివందనం చేశాడు.

తల్లీ తనయులిరువురూ ఒకరినొకరు ఎదురుగా ఆశీనులయ్యారు.

"మాతృశ్రీ ఆజ్ఞ ఏమిటో?" కచుడు తల్లినడిగాడు.

"ఆజ్ఞ కాదు కచా! నీ నుంచి వైశాలీ నగర విశేషాలు విందామనిపిల్పించాను. అక్కడ మా మేనత్త క్షేమమేనా!"

మహారాణి కుమారదేవికి వృద్ధు రాలయిన మేనత్త వైశాలీ నగరంలో ఉన్నది. పాటలీపుత్రంనుంచి మహారాణి ఆ వృద్ధురాలి ఆలనాపాలనా చూస్తూ వుండటం ఒక పరిపాటి.

"క్షేమమే మాతృశ్రీ! అయితే ఆమెతో ఎక్కువ సమయం ఈసారి గడపలేక పోయాను. మీ గురించి తరచి తరచి అడిగింది. ఆమెకు ఏదో ప్రాణభయం పట్టుకొంది. ఒక్కసారి మిమ్మల్ని చివరి సారిగా చూడాలని కోరుకుంటోంది"

మహారాణి కిమ్మనకుండా ఊరు కొనిపోయింది. తల్లి అంతరంగంలో, మరేదో విషయం ఉండాలని కచగుప్తు డికి అనిపించింది. మేనత్త క్షేమం ఒక సాకు అని తోచింది కచుడికి.

"ఇంతకీ వైశాలీ నగర కొత్త పాల కుడు ఎవ్వరు?"

కచుడు వివరించాడు "నందుడు.



నాకు నచ్చిన పాత్ర ఆఫర్ వచ్చేవరకు నేను ఇంటిదగ్గర ఖాళీగా కూర్చునేందుకు సిద్ధం.

-సోనమ్‌కపూర్, నటి

మన రాజవంశానికి దూరపు బంధువే. నిజాయితీ, క్రమశిక్షణలకు మారు పేరని విన్నాను"

"యోధుడుకాడా..."

"కాడు... నగరపాలకుడు సుశిక్షితుడయిన యోధుడుకాకుండా ఉండటమే శ్రేయస్కరం. కేవలం పరిపాలన దక్షత ఉంటే చాలు అని మహామంత్రి అభిప్రాయం, నా అభిప్రాయం.

అలా కాకపోతే నగరపాలకుడు స్వతంత్ర్యం ప్రకటించుకొని, రేపు మన మీద దండయాత్ర చేసినా ఆశ్చర్యపోనక్కరలేదు"

కుమారదేవిలో ఆలోచనలు 'ఇవన్నీ కశ్యపబ్రహ్మ పథకాలు. కశ్యపుడివద్ద రాజ్య తంత్రాన్ని బాగానే అభ్యసిస్తున్నాడు కచుడు'

ఉన్నట్టుండి కచుడు అడిగాడు- "సోదరుడు సముద్రుని ఆచూకీ తెలియలేదుట"

మహారాణి కుమారదేవి మౌనంగా ఉండిపోయింది, 'కొన్ని క్షణాలముందే సామ్రాట్ సముద్రుడి ఆచూకీ తెలిపారు. కానీ ఆ విషయం కచుడికి చెప్పవచ్చునో లేదో!'

మహారాణిలోని సంశయం, ఇక్కడ కచుడికి స్పష్టంగా అర్థమవుతోంది. 'బహుశా సముద్రుడి ఆచూకీ తల్లికి తెలిసివుండాలి...' అని మనసులో అనుకున్నాడు.

కుమారదేవి నిట్టూరుస్తూ "ఏమిటో కచా! ప్రభువులలో ఏదో మథనం. గత కొన్ని రోజులుగా ప్రభువులలో ఏదో మార్పు" అన్నది.

హఠాత్తుగా అన్నాడు కచుడు "ఔను మాతృశ్రీ! తన నిర్ణయాన్ని వాయిదా వేసినప్పటినుంచి మారిపోయారుకదూ!"

కుమారదేవి ఆ మాటలకు చకితురాలైంది. ఐనా తనలోని భావసంచలనాన్ని పైకి తెలియకుండా "అలా అని అన్పిస్తోందికదూ కచా!" అన్నది.

"అనిపించటమేమిటి మాతృశ్రీ...! నిజానికి వాస్తవం అదేనని మీకు కూడా తెలుసు అవునా!"

కుమారదేవి తలవంచుకొంది.

కచగుప్తుడు "ప్రభువులకు సముద్రుడు అంటే అపారమైన ప్రేమ. ఈ రాజ్యాన్ని అతడికే కట్టబెట్టాలని ప్రభువుల అంతరంగం"

"కచా..!" అంటూ కుమారదేవి తీక్షణంగా చూసింది.

కచగుప్తుడు నిర్లక్ష్యంగా, నిర్భయంగా చూశాడు.

"కానీ మరో సత్యం ఒకటి ఉంది మాతృశ్రీ!" అన్నాడు కచగుప్తుడు.

కుమారదేవి సూటిగా చూసింది తనయుడివైపు.

"రాజ్యం వీరభోజ్యం మాతృశ్రీ!"

"అంటే" ఎందుకనోగాని కుమారదేవి అంతరంగములో ఏదో తెలియని కల్లోలం.

"ఇంత చిన్న నీతిశాస్త్ర సూత్రానికి పాండిత్య వివరణ కూడా కావాలా మాతృశ్రీ!"

"అలా కాదు కచా...! ఎందుకనో నీ మాటలకు నా అంతరంగంలో కల్లోలము చెలరేగింది"

"బహుశా ఆ కల్లోలం భవిష్యత్‌వాణి అని నా సందేహం మాతృశ్రీ"

"కచా!" మరింత ఆందోళనపూరితమయింది కుమారదేవి కంఠం.

"నీ మాటలు వింతను గొలుపుతున్నాయి"

"నా మాటలు వింతకావు మాతృశ్రీ! ప్రభువుల చేష్టలుమాత్రమే వింతలు" అన్నాడు కచుడు.

"అంటే?"

"అర్హుడను పక్కకు పెట్టి అనర్హుడికి పట్టం కట్టాలనే ప్రభువుల విచిత్రవైఖరి ఎవరికీ అంతుపట్టడంలేదు"

అర్థమయింది మహారాణికి, కచగుప్తుడి ఆలోచనాసరళి. అందులోని లోతుపాతులు కుమారదేవికి స్పష్టంగా అర్థమవుతున్నాయి.

"కచా! నాయనా! నీవు నాకు మాట ఇవ్వాలి" అడిగింది తల్లి.

"అడగండి మాతృశ్రీ!"

"ముందు మాట ఇవ్వాలి"

"ఇవ్వలేను మాతృశ్రీ! కారణం,మీరు అడగబోయేదేమిటో నాకు తెలుసు"

కుమారదేవి విలవిలలాడిపోయింది. "తండ్రీ-కొడుకుల మధ్య రక్తపాతం చూసే దుర్గతి నాకు కలుగకూడదని కచా! నీ తల్లికి ఈ మాటను ఇవ్వాలి కచా!" అని అడిగింది.

"ఇది అడగవల్సింది నన్ను కాదు మాతృశ్రీ! ఆ ప్రభువుల్నే అడగండి. రక్తపాతాన్ని ఆపటం నా చేతిలో లేదు. పూర్తిగా ప్రభువుల చేతిలోనే ఉంది" కచుడు విసురుగా వెళ్ళిపోయాడు.

మహారాణి కుమారదేవి కచుడు వెళ్ళినవైపు చేష్టలుడిగి చూస్తుండిపోయింది. ఆమె మనసు పరిపరివిధాల పోతోంది. 'ఈ రాజ్యానికేదయినా కీడు వాటిల్లదు కదా! సముద్రుడు ఇంత వయసు వచ్చినా తనకు పసివాడే!

నిష్కల్మష హృదయం కలవాడు, కపటం, కుత్సితం ఎరుగని పూవులాంటి మనసుకల సముద్రుడికి ఏదయినా ఆపద వాటిల్లదుకదా!"

తల్లిహృదయం తల్లడిల్లిపోయింది. 'తండ్రీ-కొడుకుల మధ్య రక్తపాతం జరగదు కదా! వెంటనే ప్రభువులను వారించాలి. అయినా ఈ రాజ్యం నాకు వద్దని పారిపోతున్న సముద్రుడికి అసలు పట్టం కట్టడం దేనికి?

ఈ రాజ్యం కచుడి చేతిలోనే సురక్షితంగా ఉంటుందనే సత్యం ప్రభువులకు తెలియదా?"

ఉన్నఫళాన మహారాణి, సామ్రాట్‌కు కబురు పంపింది, ఒక్కసారి వచ్చి తనను చూడవలసిందిగా.

లావినియాకు జాక్ డాన్‌లు అంటే వల్లమాలిన ప్రేమ ఏర్పడింది. వాటికి స్వేచ్ఛను ప్రసాదించినా అవిమాత్రం తనను ఒక్కక్షణం కూడా వదిలివుండటంలేదు. అపుడపుడూ ఆమె ఆలోచనలు యువరాజు సముద్రగుప్తుడి చుట్టూ పరిభ్రమిస్తున్నాయ్!

'ఏమైపోయాడు యువరాజు! కొన్ని



## మూడింటికి టాటా

పెళ్ళినాటి నుంచి షూటింగ్‌లతో బిజీబిజీగా గడిపేసిన సమంత ముచ్చటగా మూడు సినిమాల షూటింగ్ ముగించేసి ఊపిరి తీసుకున్నది. 'రంగస్థలం', తమిళ చిత్రం 'సీమరాజా', 'మహానటి' సినిమాల్లో తన పాత్రల్ని ముగించింది.

ఒక్క నెలలో మూడు చిత్రాలకు టాటా చెప్పేయడమన్నది అరుదుగా దక్కే అదృష్టం. ద్విభాషా చిత్రం 'యుటర్న్', తమిళ సినిమా 'సూపర్ డీలక్స్', డబ్బింగ్ చిత్రం 'అభిమన్యుడు'ల షూటింగ్ సాగుతుంది. అంటే ఆరు సినిమాలు సమంతకు సిద్ధంగా ఉన్నాయి. ఈ మధ్యే నాగచైతన్యతో కొత్త చిత్రాన్ని ప్రకటించారు. అచ్చంగా ఏడు చిత్రాలన్నమాట. వారెవ్వా!



నాలుగేళ్ళుగా అనుసరిస్తున్న వ్యూహాత్మక విధానాలవల్ల ప్రపంచ దేశాలపై భారత్ ప్రభావం పెరిగింది.

-నరేంద్రమోడీ, ప్రధాని

ఘడియలలో తిరిగి వస్తాడనుకొన్న సముద్రగుప్తుడు ఇప్పటికి కనపడి ఐదు రోజులయింది. ఆమె మనసులో ఏవో శంకాభయాలు.

అలాగే సౌగంధిని కూడా ఆలోచిస్తోంది 'యువరాజు ఏమయ్యాడు?' ఎక్కడ చూసినా అంతఃపురంలోని గుసగుసలు సముద్రగుప్తుడుగురించి.

సముద్రగుప్తుడి ఆచూకీ తెలియని నైనం, లావినియా చెవులకు సోకకుండా ఎంతో కష్టపడాల్సివస్తోంది సౌగంధినికి. కానీ ఎంత ప్రయత్నించినా చేరవలసిన వార్త చివరకు లావినియాకు చేరనే చేరింది. ఒక పరిచారిక లావినియా చెవిలో ఊదింది.

'యువరాజు సముద్రగుప్తుడు హఠాత్తుగా అదృశ్యమయి ఎక్కడికి వెళ్ళారో ఎవరికీ తెలియదుట'

లావినియాలో ముందు ఆశ్చర్యం. ఆ తర్వాత కలవరం.

'యువరాజు ఏమయ్యాడు? యువరాజు కనపడకపోవడానికి కారణం తాను కాదుకదా?'

లావినియాకు అలా ఆలోచిస్తుంటే, తన అనుమానం ధృడపడటం మొదలైంది. ఈలోగా సౌగంధిని వచ్చింది. ఆమెను నిలదీసింది.

సౌగంధినికి మరి గత్యంతరం లేకపోయింది. "ఇందులో భయపడవలసిన అవసరం ఏమీ లేదు లావినియా! నిజానికి యువరాజు ఏదైనా ఆపదలో ఉన్నట్టు తెలిస్తే సామ్రాట్ అలా నిమ్మకు నీరెత్తినట్టు ఊరుకొనగలరా, లావినియా! బహుశా సామ్రాట్‌కు యువరాజు ఎక్కడ ఉన్నది తెలిసివుండాలి అని నా ప్రగాఢ నమ్మకం"

లావినియాకు ఊరట కల్గింది.

"నా వల్ల యువరాజు ఏదయినా ఆపదలో చిక్కుకోలేదు కదా అని నా భయం సౌగంధినీ!"

"ఆపదలు ఉండకపోవచ్చుకానీ, ఆలోచనలతో సతమతమవుతుండాలి అని అన్పిస్తోంది"

"మరింత వివరణ కోరుతున్నాను"

"మీరు సముద్రగుప్త యువరాజుకు ఇచ్చిన సమస్య అతి జటిలమయింది. రాకుమారులు తను స్వయంగా నాగాయకుడిపై దండెత్తటం అనేది అసంభవం. కారణం యువరాజు ఒక సామాన్య సైనికుడికి వున్న పాటవం, యుద్ధవిద్య కూడా లేనివారు.



స్వయంశక్తి లేని యువరాజు మీ కోరిక తీర్చాలంటే ఎవరినయినా ఆశ్రయించక తప్పదు" సౌగంధిని లావినియాను ఓరగంటతో గమనిస్తూ అంది- ఏందుకనోగాని సౌగంధిని మాటలు లావినియాకు అశనిపాతంలా తగిలాయ్! ఏదో అనిర్వచనీయమయిన బాధకు గురి అయింది.

"నాగాయకుడ్ని ఓడించగల సమర్థత ఈ దేశంలో ఇద్దరికే ఉన్నది"

లావినియా కళ్ళు రెపరెపలాడాయి.

"ఒకరు సామ్రాట్... రెండవవారు సామ్రాట్ పెద్ద కుమారులు కచగుప్తుడు. ఈ ఇద్దరినీ మినహాయించి మరెవరైనా ఆ అపార సైనికశక్తి పాటవాలున్న ఇంద్రప్రస్థాధీశుడు నాగాయకుడిని ఓడించగలరన్నది శుష్కవాచాలత మాత్రమే అవుతుంది" అంది సౌగంధిని.

మరోసారి విలవిలలాడిపోయింది లావినియా...! సౌగంధిని సముద్రగుప్తుడ్ని 'అసమర్థుడని' పదేపదే ఎత్తిపొడుస్తున్నట్లుగా ఉన్న అనుభూతికి గురయింది. లావినియా తనలోతాను ప్రశ్నించుకుంది. 'ఎందుకనోగాని తన మనసు సముద్రగుప్తుడిని ద్వేషిస్తోంటే విలవిలలాడిపోతోంది!

అతడి సాన్నిహిత్యంలో కనీసం కొన్ని ఘడియలు కూడా గడపలేదు. కానీ తనలో ఏదో ఏదో...'

'ఏమిటిది? యువరాజు అంటేఅంత గ్లీనంగా ఇష్టం ఏర్పడిందా తనకి...?' కొన్ని ఇష్టాయిష్టాలు మన ప్రమేయ నిమిత్తం లేకుండానే ఏర్పడుతాయి. ఇవి మనిషి జీవితాన్ని శాసిస్తాయి.

జీవితంలో మలుపులను తిప్పుతాయి. కొత్త పుంతల్ని తొక్కుతాయి. కొన్ని అతి చిన్న విషయాలు చరిత్రనే తారుమారు చేస్తాయి.

పృథ్వీరాజు సంయుక్తను ఇష్టపడ్డాడు. ఆమెను తస్కరించి గాంధర్వ వివాహం చేసుకున్నాడు. కానీ ఈ చిన్న సంఘటన, భారతదేశ చరిత్ర గతిని మార్చివేసింది.

అలాగే మహాభిషుడు, బ్రహ్మలోకంలోకి వచ్చి గంగాదేవిని చూసి, కామప్రేరితుడయ్యాడు.

బ్రహ్మ శాపంతో ఆ మహాభిషుడే శంతకుడిగా భూమిమీద అవతరించి, గంగాదేవిని వివాహంచేసుకొని భీష్ముడి జన్మకు కారణభూతుడై, మహాభారత కథకు ఆదిపురుషుడయ్యాడు.

ఒక చిన్న మోహవీచిక, ఒక చిన్న కామప్రేరణ, ఎంతటి మహత్తర మహాభారత కథను సృష్టించింది?

లావినియా సౌందర్యం సముద్రుడ్ని ఆకర్షించినట్టు, సముద్రుడి అత్యద్భుత సౌందర్యం కూడా లావినియాను సూదంటురాయిలా ఆకర్షించింది అని లావినియా మనసుకు తర్కించుకుంటే దొరికిన సమాధానం.. నిజానికి సత్యం కూడాను.

"సముద్రగుప్తుడిని తను ప్రేమిస్తోందా?' లావినియాలో మరో ప్రశ్న ఉదయించింది. 'అవునేమో... అవునేమో' అంటున్న మనస్సు కొంతసేపయ్యాక 'అవును... అవును' అని ఘోషించటం మొదలుపెట్టింది.

ఇపుడు లావినియాకు తనమీద తనకే వశంతప్పినట్లుగా అయింది.

"లావినియా?" సౌగంధిని అప్పటికి మూడుసార్లు పిలిచి ఉంది.

**ఇంకా ఉంది**

## రాజకీయాల్లోకి వెళ్తా

ఈ రోజుల్లో ఫేమ్ రేష్మారాథోర్ రాజకీయాల్లోకి వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నానంటున్నది.

ఇంత చిన్నవయస్సులోనే రాజకీయాల్లోకి వెళ్ళడమే కాదు, ఎన్నికల్లో పోటీచేస్తాననీ చెపుతున్నది. "మాది మహబూబాబాద్ లోని యెల్లెందు. చిన్నప్పటినుంచి నా చుట్టూ గల స్థానిక, జాతీయ సమస్యలను పరిశీలిస్తూ పెరిగాను.

సినీపరిశ్రమలో చేరినా, నేనెప్పుడు వెళ్ళినా మా ఊరి ప్రజల సమస్యలు తెలుసుకునేదాన్ని. ఏ పార్టీ నుంచి ఎన్నికల్లో పోటీ చేస్తానో త్వరలోనే ప్రకటిస్తా" అంటున్న రేష్మారాథోర్ న్యాయ శాస్త్రంలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ చేసింది. తెలుగు, తమిళం, మలయాళ భాషల్లో దాదాపు ఇరవై సినిమాలదాకా చేసింది.

**భగవంతుని ప్రతిరూపాల్లో కనీసం ఒకరికైనా సహాయపడేందుకు అనుగ్రహం లభిస్తే మీరు ధన్యులు. మిమ్మల్ని మీరు అతిగా అంచనా వేసుకోకండి. ఎవరికీ లేని అవకాశాన్ని పొందినందుకు మీరు నిజంగా అదృష్టవంతులు. దాన్ని ఆరాధనా భావంతో నిర్వర్తించండి...**

# ఫర్ U



Courtesy : VANITHA

## సమ్మర్ కూల్

**మా**మూలుగానే ఎంతో మేలుచేసే కొబ్బరినీళ్ళు తాగడంవల్ల వేసవిలో మరింత ప్రయోజనకరంగా వుంటుంది. కొబ్బరినీళ్ళు ఎలక్ట్రోలైట్స్‌గా పనిచేసి, శరీరంలోని నీటిని సమతౌల్యపరుస్తాయి.

అనేక ఇన్‌ఫెక్షన్లపై పనిచేయగల గుణంవుంటుంది. ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్స్, ఫైబర్, క్యాల్షియం, మెగ్నీషియం, ఐరన్, విటమిన్ సి, బి6, ఇ, కె, రిబోఫ్లేవిన్, ఫోలేట్ కొబ్బరినీటిలో లభిస్తాయి.

శరీరంలో కొలెస్ట్రాల్ పేరుకోకుండా నిరోధించడంతో పాటు, చెడు కొలెస్ట్రాల్‌ను తగ్గించగలవు.

మూత్రనాళ ఇన్‌ఫెక్షన్లను తగ్గించడంలో, రక్తపోటును నియంత్రణలో వుంచడంలో సహకరించే పానీయం. వేసవిలో ఇతరత్రా శీతల పానీయాలు కాకుండా రోజుకో కొబ్బరిబొండాం తాగుతుంటే అనేక ప్రయోజనాలు ఇట్టే కనిపిస్తాయి. ◆

## సైకిల్‌తో ఎన్నో లాభాలు

సైకిల్ తొక్కడం నామోషిఅని కొత్తతరం భావించవచ్చునేమో కాని, ఇదెంతో మంచి వ్యాయామం. రక్తపోటును తగ్గించడంనుంచి, మరెన్నో శారీరక రుగ్మతలను తగ్గిస్తుంది.

Be obedient and eternally faithful to the cause of truth, humanity and your country and you will move the world

ప్రతిరోజూ సైకిల్ తొక్కుతుంటే అనేక ప్రయోజనాలుంటాయి. డిప్రెషన్, ఆదుర్దాలను తగ్గించగలదు. నడకలోకంటే సైక్లింగ్‌లో ఎక్కువ కండరాలు పని చేస్తాయి కాబట్టి కాళ్ళకు మంచి వ్యాయామాన్ని ఇస్తుంది. వెనుక కండరాలు దృఢపడతాయి.

స్పీడ్ పెంచినకొద్దీ, ఎక్కువ కష్టపడి తొక్కాలి కాబట్టి క్యాలరీలు ఎక్కువగా ఖర్చవుతాయి. కనుక బరువును బాగా తగ్గించగలదు. మొత్తంమీద శరీరానికి చక్కని ఫిట్‌నెస్ ఇస్తుంది. ◆

## కొవ్వు కరిగించండి

**ఇం**టిపనుల్ని మర్చిపోయి నాజూగ్గా మారేందుకు జిమ్ సెంటర్లకు వెళ్ళే రోజులివి. కాని, ఇంటి పనులు చేయడంవల్ల శరీరంలోని కొవ్వు కరిగిపోతుంది. అప్పుడప్పుడు ఇల్లు చిమ్మడం, దుమ్ము దులపడం వంటివి చేతులకు మంచి వ్యాయామాలు.

ప్రతి చిన్నదానికీ మిక్సీపైన ఆధారపడకుండా చిన్నిరోటిలో చిన్నచిన్నవి దంచుకుంటూ వుంటే మరీ మంచిది. దుస్తులు వాషింగ్‌మెషిన్‌లో వెయ్యడం,ఆరినవి మడతపెట్టడంవంటివి చేస్తుండాలి.

**మ**ధ్యమధ్యలో నిమ్మరసం కలిపిన నీరు,పల్చని మజ్జిగ, జ్యూస్ వంటివి తాగుతుంటే శరీరానికి విటమిన్ 'సి' లభించి రోగనిరోధకశక్తి పెరుగుతుంది.

వంట చేస్తున్నప్పుడు ఒకే దగ్గర నిలబడకుండా అటూఇటూ తిరుగుతుండాలి. ఇలా చిన్నచిన్న పనులూ, మార్పులతో శరీరంలోని కొవ్వు కరుగుతుంది, హుషారుగానూ వుంటారు. ◆

## జీర్ణకారి

**పం**చదార వాడకుండా తీపి పిండివంటలను బెల్లంతో చేసుకోవడం అన్నివిధాలా ఉత్తమం. పంచదార వల్ల కలిగే హాని వుండదు. బెల్లంలో ఐరన్, పొటాషియం, మెగ్నీషియం వంటివి వుంటాయి. ఓ బెల్లంముక్కను నోట్లో వేసుకుని చప్పరించడంవల్ల చాలా సమస్యలనుంచి ఉపశమనం లభిస్తుంది.

ఎసిడిటి, అజీర్తి, కడుపుబ్బరం, కడుపులో మంట వంటి సమస్యలుగలవారు భోజనం తర్వాత చిన్న బెల్లంముక్క తింటే ప్రయోజనకరంగా వుంటుంది. కప్పు నీటిలో కొంచెం బెల్లం, అల్లంవేసి కాచి, వడకట్టి తాగుతుంటే జలుబు తగ్గుతుంది.

ఓ కప్పు వేడిపాలలో కొద్దిగా బెల్లం వేసుకుని తాగుతుంటే నెలసరి నొప్పులనుంచి ఉపశమనంగా వుంటుంది.బెల్లం, తులసిఆకులు కలిపి నోట్లో ఉంచుకుని, నెమ్మదిగా చప్పరిస్తుంటే దగ్గు, గొంతులో మంట తగ్గుతాయి.



# మెంటల్ ఎనర్జీ

శరీరానికి ఏ విధంగా ఎన్ని రకాలుగా పోషణ చేస్తామో, మనస్సుకూ అదేరకంగా పోషణ అవసరం.

అలవాట్లను మార్చుకోవడం, జీవితంలో కొత్త పనులకు శ్రీకారం చుట్టడంవంటి పనులద్వారా కీలకమైన న్యూరాన్లకు పోషణ ఇచ్చిన వారవుతారు. ఈ రోజుల్లో దాదాపు ప్రతి ఒక్కరి జీవితమూ తీరిక లేనంతగా మారిపోయింది. సమాచారాన్ని ఇంతకుముందుకంటే శీఘ్రంగా అందుకోవాల్సి వస్తున్నది.



ఈ దశలో మానసికశక్తిని ఉత్తమంగా పెంచుకుని, వినియోగించుకోవాల్సిన అవసరం ఉంటుంది. మానసికశక్తిస్థాయిలు పెరిగినప్పుడు కలిగే ప్రయోజనాలు అత్యుత్తమంగా వుంటాయి.

విల్‌పవర్, ఆత్మవిశ్వాసం, ఫోకస్, సృజనాత్మకత, ఓర్పు, సహనం వంటివన్నీ మెంటల్ ఎనర్జీ పెరగడం వల్ల కలిగే ప్రయోజనాలే. ఈ శక్తిని పెంచుకోవడానికి శాస్త్రీయంగా రుజువైనమార్గాలు కొన్ని వున్నాయి.

## లక్ష్యంపట్ల స్పష్టత

లక్ష్యంపట్ల స్పష్టత ఉండడంవల్ల జీవితంలో చక్కనిమార్గానికి అనుకూలత కలుగుతుంది. ఇటువంటి కార్యకలాపాలకోసం సమయాన్ని కేటాయించడానికి కుదురు చిక్కుతుంది.

స్వల్పకాలిక, దీర్ఘకాలిక లక్ష్యాలు రెండింటి విషయంలోనూ స్పష్టత ఉన్నప్పుడు, ఆ దిశగా ఏకాగ్రతతో పనిచేయడానికి అవకాశం లభిస్తుంది.

వీటిపట్ల ఫోకస్ చేసినప్పుడు, మరింత ఓర్పు,సహనం, ప్రాధాన్య క్రమాలు అలవడతాయి.

ఏది ముఖ్యం, ఏదికాదు అన్న అవగాహన ఉండి మనస్సు ఎంతో దృఢంగా సాగుతుంది.

## ఒక్కపనే

మన మెదడు ఫోకస్ చేయడానికి ఇష్టపడుతుంది కాని, పక్కదారి మళ్ళాలని కోరుకోదు.

ఎక్కువ పనులను ఒకేసారి చేయాలి అని అనుకుంటే అలాగే తరచూ చేస్తుంటే మెదడు

ఇంధనం త్వరితంగా ఖర్చయిపోతుందని చాలా మందికి తెలియదు. శాస్త్రీయంగా ఈ ఇంధనాన్నిఆక్సిజనేటెడ్ గ్లూకోజ్‌గా పేర్కొంటారు.

ఒక పనిపై ఫోకస్‌చేసినప్పటికంటే ఎక్కువ పనులుచేస్తే త్వరితంగా మానసిక అలసట కలుగుతుంది. ఒక్కసారి ఒకపనిపైనే దృష్టిని కేంద్రీకరించడంవల్ల సదరు పనిని ఇరవై ఐదు శాతం తక్కువ సమయంలో ముగించగలరని పరిశోధనల్లో సైతం గుర్తించారు.




## పనితీరు

రోజులో ఇరవైనాలుగుగంటల సమయంలో మెదడు పనితీరు ఒక్కోసారి ఒక్కోరకంగా వుంటుంది. శక్తి సన్నగిల్లినప్పుడు నిర్ణయాలు తీసుకునే సామర్థ్యం తగ్గిపోతుంది.

సృజనాత్మకశక్తి గుర్తించతగినంతగా తగ్గిపోతుంది. ఉదయంవేళ చాలామందిలో సృజనాత్మకత ఎక్కువగా వుంటుంది.

ఇది కొందరిలో సాయంత్రాలలో ఎక్కువగా ఉండవచ్చు.ఇక్కడ గమనించాల్సిన ముఖ్యమైన విషయం ఏమిటంటే- ఏ సమయంలో ఏ పనిపట్ల ఎక్కువ ఏకాగ్రతచూపగలమనేది.

ఎక్కువ ఫోకస్ చేయాల్సిన, కష్టమైన పనులకు చురుగ్గా ఉన్న సమయాన్ని కేటాయించుకోవాలి. మెదడు ఉత్సాహంగా, చురుగ్గా ఉండే సమయంలో క్లిష్టమయిన, ముఖ్యమయిన పనులు ముగించేసుకోవాలి.




## వ్యాయామాలు

వ్యాయామాలు చేసినప్పుడు శరీరానికి ఎలా ప్రయోజనాలు కలుగతాయో మనస్సుకూఅలాగే కలుగుతాయి. క్రమంతప్పని వ్యాయామాలు జ్ఞాపకశక్తిని, క్లిష్టమైన ఆలోచనా నైపుణ్యాలను మెరుగుపరచగలవని శాస్త్రీయంగా కూడా రుజువయింది. వ్యాయామాలు చేసినప్పుడు గ్లూకోజ్, ఆక్సిజన్ మెదడుకు విడుదలవుతాయి.

ఇవి మెదడు పనితీరును పెంచే శక్తికారకాలు. దైనందిన కార్యక్రమాల్లో వ్యాయామాలను తప్పనిసరిగా జొప్పించాలి. అది బ్రిస్క్‌వాక్, యోగా, స్విమ్మింగ్, డ్యాన్సింగ్- ఏదైనా కావచ్చు. అన్నీ మెదడు శక్తిని పెంచేవే.

## ఉద్దీప్తం

మెదడును ఎప్పుడూ ఉద్దీప్తం చేసుకోవాలి, అలా అని అధికభారం వేయకుండా చక్కని సమతౌల్యాన్ని పాటిస్తుండాలి. ఎక్కువ ఛాలెంజింగ్ పనులు మానసికశక్తిని, సంతృప్తిని ఇచ్చేమాట నిజం. అయితే, మరీ ఎక్కువగా సాగిస్తే, అలసటగా వుంటుంది.

చాలినంత ఛాలెంజ్ జీవితంలో లేకపోయినా చప్పగా, బోర్‌గా వుంటుంది.

కాబట్టి, దైనందిన జీవితంలో కొన్ని సవాళ్ళ అను భూతులకోసం ప్రయత్నించాలి. అది వ్యాయామాలు కావచ్చు, కొత్త నైపుణ్యాలను నేర్చుకోవడం లేదా ఎప్పుడూ చదవనివాటిని చదవడం కావచ్చు. యాంత్రికతను మార్చుతూ వుండాలి. దీనివల్ల మెదడు ఉద్దీప్తం అవుతుంది. తాజా ఆలోచనలు కూడా కలుగుతాయి.

## మంచినీరు

శక్తిస్థాయిలను మంచినీరు ఎంతగానో ప్రభావితం చేస్తుంది. శరీరంలో నీటిశాతం ఎక్కువగా ఉండడం మాత్రమే కాదు, మెదడులోనూ నీరు ముఖ్యభాగమే.

శరీరంలో నీటిశాతం తగ్గిపోయినప్పుడు, శక్తిని కోల్పోయిన భావం కలుగుతుంది.

బాగా హైడ్రేట్ అయినప్పుడు మెదడుకూడా హైడ్రేట్ అవుతుంది. కనుక, మెదడును హైడ్రేట్ చేసుకోవడానికి, రోజంతా జీవక్రియ ఉత్తమంగా ఉండేందుకు ఉదయాన్నే రెండు గ్లాసుల నీటితో రోజును ఆరంభించే అలవాటు చేసుకోవాలి.

## నిద్ర

నిద్రకు ఆటంకం కలగకుండా సకల జాగ్రత్తలూ తీసుకోవాలి. డిజిటల్ స్క్రీన్లనుంచి వెలువడే నీలి, తెల్లనికాంతులు పడుకోవడానికి, రెండు గంటల ముందు పడినా మెదడు మెలాటోనిన్ విడుదల చేయడాన్ని ఆపేస్తుంది.

నిద్రకు మనస్సూ, శరీరం సిద్ధంకావడానికి అవసరమైన హార్మోన్ ఇది. నిద్రకు ఉపక్రమించాలనుకోవడానికి బాగా ముందుగానే డిజిటల్ పరికరాల వాడకాన్ని మానేయాలి.

## అనుకూల చర్యలు

- విభిన్నంగా చేయగల ఓ పనిని గుర్తించి, దాన్ని ఆ రోజున మార్పుచేస్తూ సాగించాలి.
- చేపట్టినపనుల తాలూకూ జాబితాను వారంవారం సమీక్షించుకుంటూ డైరీ రాసుకోవాలి. కావాల్సిన లక్ష్యంకోసం చాలినంత సమయాన్ని కేటాయిస్తున్నారో లేదో ప్రతిసారీ పునఃసమీక్షించుకోవాలి.
- మెదడు ఎప్పుడు పాదరసంలా పనిచేయగలదో గమనించుకుంటూ, ఆ సమయంలో తప్పనిసరిగా అతిముఖ్యమైన ప్రాజెక్టులు చేపట్టాలి.
- రోజుకు కనీసం ఎనిమిది గ్లాసులు నీరు తాగుతుండాలి.వాటిలో రెండింటిని ఉదయం లేవగానే తాగేయాలి. వ్యాయామాల రొటీన్‌ను పరిశీలించుకుంటూ, దైనందిన జీవితంలో ఏవి బాగా సూటవుతాయో విశ్లేషించుకోవాలి.

కె.మధుయామిని

# నేనెవరో తెలుసా!

ఇటీవలికాలంలో ఒక అరుదయిన గ్రహ కూటమి ఏర్పడుతున్నదని జాగ్రత్తగా వుండాలని విదేశీ సంస్థలు ప్రకటించాయి. ఐతే ఎటువంటి ప్రమాదం లేకుండా ఊహించిన ఉప ద్రవం సంభవించకుండా గ్రహకూటమి వెళ్ళిపోయిన సందర్భాలు వున్నాయి.

అటువంటి ఒక సంఘటన 20వ శతాబ్దపు ప్రారంభంలో నేటి తమిళనాడు ప్రాంతంలో జరిగింది. అప్పటికే కొంతకాలంగా ఒక తోకచుక్క ఆకాశంలో కనిపిస్తున్నది. రాత్రిపూట కనిపించే ఆ తోకచుక్కను జనమంతా చూస్తున్నారు.

ఏదో అరిష్టం తమకు జరుగుతుందని భయపడుతున్నారు. అటువంటి సమయంలో తమిళనాడులోని, ఒక పట్టణంలోని ఒక ఇంటి మీద పిడుగుపడిన శబ్దం వచ్చింది. ఒక పెద్దకాంతి పుంజం ఆ ఇంటిమీద పడింది. మెరుపు కాంతి, పిడుగు శబ్దం సహజంగా వినిపించేవే, కనిపించేవే.

అయితే వర్షం వస్తున్న సూచనలు లేకుండా, తోక చుక్క వున్న సమయంలో అటువంటిది జరగటంతో ఆ పట్టణ ప్రజలందరూ భయభ్రాంతులయ్యారు.

మొత్తం ఊరు మీదంతా పడకుండా కేవలం ఒక ఇంటిమీదికి ఆ కాంతి, ధ్వనిశక్తి పడటం వారికి ఆశ్చర్యం వేసింది. ఆ ఇంటిమీద పిడుగుపడిందనుకోవటానికి అటువంటి లక్షణాలు ఏవీ లేవు.

అయినా ఆసక్తి ఆపుకోలేక పలువురు ఆ ఇంటి లోకి తొంగిచూశారు. మిగిలిన కుటుంబసభ్యులంతా అందరిలా కంగారుపడుతున్నారు. కాని ఒక గదిలో మూడు పదుల వయసున్న ఆ ఇంటాయనమాత్రం ఆ కాంతి, ధ్వనికి, చుట్టూ జరుగుతున్న హడావుడికి అతీతంగా ధ్యానంలో కూర్చుని వున్నారు.

ఏం జరుగుతున్నది ఆయనకు తెలియదు. కాని ఆయనలో ఏదో ఒక వింత వెలుగు గోచరిస్తున్నది. ఆయన ఏదో తన్మయత్వంతో వున్నాడు.

అది చూసిన కొందరికి ఆయన ఒక మహాత్ముడన్న భావంకలిగింది. ఆరోజుతో ఆయన జీవితంలో పెద్ద మార్పు వచ్చింది. తన జీవితంలో వచ్చినమార్పును మరెందరికో పంచాడు. ఆయనకో ఆధ్యాత్మిక మార్గం కనిపించింది. ఆ మార్గంలోకి మరెందరినో నడిపించాడు. ఆయన ఒక గురుస్థానం పొందాడు.

భారతదేశంలో యోగులు, సిద్ధులు ఎందరో గతంలో వున్నారు. తత్వచింతన కలిగిన నేల అయినందున ప్రతిచోటా ధ్యానంచేసేవారు. తపస్సులు ఆచరించేవారు కనిపిస్తారు. వారి వెంట ప్రజలు వెళతారు. ఎక్కడోఒకచోట అటువంటిగురువులు మోసం చేసి ప్రజలచేత తిరస్కారానికి గురవుతుంటారు. కాని నిజమైన సిద్ధులు ప్రచారం కోరుకోరు.

తమ దగ్గరికి వచ్చినవారికి జీవిత సమస్యల పరిష్కారమార్గం చూపించే యత్నం చేస్తారు. ఎక్కువ సమయం ధ్యానంలో గడుపుతారు. ధ్యానశక్తి, జ్ఞాన శక్తి వారికి ఆయుధాలు అవుతాయి. అటువంటి ధ్యానయోగంలోకి ప్రజలను నడిపించే శక్తి ఆయనకు ఆ తోకచుక్కద్వారా వచ్చిందట.

ఆనాడు పిడుగులా ప్రజలకు వినిపించినది వాస్తవంలో అంతరిక్ష ప్రజ్ఞ అనేది ఆయనలోకి చేరటం. ఆ సంఘటన జరిగిన సమయంలో భూగోళం తోకచుక్కను దాటివెళుతున్నదని, తోకచుక్క తోకనుండి వచ్చిన కాంతి తనలో ప్రవేశించిందని ఆ తర్వాతి కాలంలో ఆయన వివరించాడు.

అలాగని ఆయనకు హఠాత్తుగా జ్ఞానోదయం అవటం జరగలేదు. సాంప్రదాయ కుటుంబంలో పుట్టి తెలుగు, సంస్కృతంతోపాటు ఇంగ్లీషు విద్యను చదువుకున్నారు. ఆధ్యాత్మిక, యోగవిద్యలను అధ్యయనం చేశారు. వాటిలో పరిపూర్ణత పొంది యోగ మార్గంలో ప్రయాణం చేస్తూండేవారు.

అలాగని ఆయన సన్యాసజీవితం గడపలేదు. గృహస్థాశ్రమం పవిత్రమైనదిగా స్వీకరించారు. గృహస్థాశ్రమం లేనిదే యోగమార్గం పరిపూర్ణం కాదు. వాస్తవ యోగసాధనకు ఆదర్శ గృహిణి సాహచర్యం అవసరంకూడా. అందుకే పలువురు యోగులు, సిద్ధులు సంసార జీవితంకూడా గడపటం కనిపిస్తుంది.

రామకృష్ణ పరమహంస జీవితం అందుకు ఉదాహరణ. పలువురు ఋషులు సంసార జీవితం గడపటం మన పురాణవిశేషం.

సనాతన యోగమార్గమే సరైనది. ఆదర్శమయ జీవులు ఉత్తమ దంపతుల సంతతిగా దిగివస్తారు. ఉత్తమ సంతానం సమాజానికి అందించటం గృహస్థ ధర్మం. కామం జీవితంలో ఒక భాగం.

ఆధ్యాత్మిక చింతన, జీవుడు తన గురించి తాను తెలుసుకునే యత్నం నిరంతరం చేయాలి.

లౌకిక జీవనవిధానం ఆచరిస్తూనే తాత్వికచింతనకు, ధ్యానానికి సమయం కేటాయించాలి. ఆ జీవన మార్గంద్వారా సహనం పెరుగుతుంది.

> 23.3.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
> 1. ముల్క్‌రాజ్ ఆనంద్, 2. ది అన్ టచ్‌బుల్
> ₹ 500/- బహుమతి పొందిన విజేత :
> కె.ఆర్.ప్రసాద్‌రావు, #16-3-1, ఫ్లాట్ నెం.101, చుక్కా ప్యారడైజ్, శ్రీరాంనగర్,
> రాజమహేంద్రవరం-533 104, తూ.గో.జిల్లా

> ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 7 ఏప్రిల్ 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

కోపతాపాలకు అతీతమైన సుఖజీవనం సంప్రాప్తిస్తుంది అని ఆచరించి చూపించారు. ఆయన ప్రత్యేకంగా ప్రచారంచేసుకున్నది లేదు. తాను అర్థంచేసుకుని, ఆచరిస్తున్న జీవనవిధానం గుర్తించి కొందరు ఆయన శిష్యులయ్యారు.

మనదేశంలోని మిగిలిన సిద్ధులకన్నా ఆయనలో కనిపించే భిన్నమైన అంశం ఆయన ఆంగ్లానికి ఇచ్చిన ప్రాధాన్యత. శిష్యులకు ఇచ్చే మంత్రోపదేశాలు సిద్ధులు సాధారణంగా సంస్కృతంలోనో లేక వారి వారి ప్రాంతభాషల్లో వుంటుంది. కాని ఈయన ఇంగ్లీషు మంత్రం అందించేవారు.

దానికోసం ఒక రోజున అందరూ ఒకచోటకి చేరి, దానిని పర్వదినంగా భావించి ఉపదేశం చేశారు. నాటి నుండి ఆయన శక్తిని తన ప్రథమ శిష్యులలోకి, వారి నుండి మరికొందరికి ఇలా ఒక మాధ్యమంగా ఆధ్యాత్మిక సంపదను, ధ్యానమార్గాన్ని వ్యాప్తిచేసేందుకు ఒక మార్గాన్ని తయారుచేశారు.

ఆయనను అందరూ గురువుకు సమానార్థమైన ఇంగ్లీషుపదంలోనే పిలిచేవారు. బ్రహ్మవిద్యను ఖండాంతరవ్యాప్తిగావించినవారికి ప్రపంచంలోని అందరికీ అర్థమయ్యే భాష ఐన ఇంగ్లీషులో వ్యవహరించడం దివ్యజ్ఞాన సమాజం ప్రారంభించిన పద్ధతి.

నేడు ఉన్న తెలుగు, తమిళ ప్రాంత భేదాలు లేనికాలంలో విజయనగర సామ్రాజ్యం దక్షిణాన తంజావూరువరకు విస్తరించిన సమయంలో ఎన్నో తెలుగు కుటుంబాలు కృష్ణానదీతీరంనుండి కావేరీ తీరంవైపుకు వలసవెళ్ళాయి.

అక్కడ స్థిరపడి తమిళం కొంత వంటపట్టించుకున్నా తెలుగువాసనలను వదులుకోలేదు. అలా స్థిరపడిన తెలుగు కుటుంబంలో పుట్టాడు ఆయన.

పూర్వీకులు అందించిన కుండలినీశక్తిని ఉద్దీపించారు ఆయన. గంటలకొలది ధ్యానంలో కూర్చునేవారు. తనలోని అవతరించిన ఆ శక్తిని మిగిలినవారందరికీ కప్పి, మొత్తం సమూహంలో రగులుకొల్పి ప్రకృతిలోని కుండలిని శక్తితో సమన్వయం చేయటానికి ప్రయత్నం చేశారు.

అలా తన పిలుపు అందించిన తర్వాత పుష్కర కాలం జీవించి చివరికి 1922లో తన 54వ ఏట తనువు చాలించాడు. నేటికీ ఆయన ప్రారంభించిన యోగమార్గ పరంపర విజయవంతంగా నడుస్తున్నది. ఇంతకీ...

*1. ఆ సిద్ధజీవి పేరేమిటి?*

*2. ఆయన కార్యస్థాన పట్టణమేది?*

# జామపండు

**జా**మపండు చిలకలకు ఎంతో ఇష్టం, మనిషికి ఎంతో ఆరోగ్యం. జామకాయలు చలి మొదలవుతున్నప్పుడు రావటం మొదలవుతాయి.

కాయను నాలుగు ముక్కలు చేసుకుని కాస్తంత ఉప్పు రాసుకుని, కారం జల్లుకు తింటే ఆ అద్భుతమైన రుచికి ఇంకేమి సాటిరావు.

జామకాయకు రుచే కాదు, మనిషి ఆరోగ్యానికి దోహదంచేసే ఎన్నెన్నో అద్భుతమయిన పోషకాల నిలయం కూడా.

జామకాయలో విటమిన్ ఎ మరియు సి, పీచు, ఫోలిక్ ఆమ్లం, పొటాషియమ్,కాపర్ మరియు మాంగనీస్‌లాంటి ఖనిజ లవణాలు బాగా లభిస్తాయి.

కమలా పండులో వుండే 'సి' విటమిన్‌కంటే జామపండులో మనకు లభించే 'సి' విటమిన్ నాలుగు రెట్లు ఎక్కువ.

దీనిద్వారా లభించే క్యాలరీలు తక్కువ.

## ఆరోగ్య లాభాలు

- రక్తంలోని చక్కెర స్థాయిలను అదుపులో వుంచుతుంది.
- చెడ్డ కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది.
- డయేరియాను తగ్గిస్తుంది.
- రోగనిరోధకశక్తిని పెంచుతుంది.
- క్యాన్సర్ వచ్చే అవకాశాలను తగ్గిస్తుంది.
- పంటి చిగుళ్ళను గట్టిపరుస్తుంది, దంత క్షయం కాకుండా కాపాడుతుంది.
- వాంతులను తగ్గించటంలో ఉపయోగపడుతుంది. కంటిచూపును మెరుగుపరుస్తుంది.

## క్యాన్సర్ చికిత్స

- జామపండులో లైకోపెన్ అనే యాంటీ ఆక్సిడెంట్ వుంది. ఇది ప్రోస్టేట్ మరియు రొమ్ము క్యాన్సర్ చికిత్సలో ఎంతో సహాయం చేస్తుంది.
- జామపండు గుజ్జు క్యాన్సర్ పుండ్లు ఏర్పడకుండా నిరోధించడంలో ఎంతో సహాయకారి.
- జామపండులో వుండే విటమిన్ 'ఎ' మరియు 'సి' ఫ్లేవనాయిడ్‌లు, బీటాకెరొటిన్ మరియు లుటెన్ మన శరీరంలో వుండే ఫ్రీరాడికల్స్‌తో పోరాటం చేస్తాయి. ఫ్రీరాడికల్స్ శరీరంలో క్యాన్సర్ పెరగటాన్ని ప్రోత్సహిస్తాయి.
జామపండులోని పైపోషకాలవల్ల ఫ్రీరాడికల్స్ అదుపులో వుంటాయి.
- జామలో పీచు పదార్థాలు అధికంగా వుండటంవల్ల జీర్ణకోశంలోని, మ్యూకస్ పొర నాశనం కాకుండా అడ్డుకుంటాయి. తద్వారా మనకు హానిచేసే విష పదార్థాలు, క్యాన్సర్‌కు కారణమయ్యే కణాలను అడ్డుకుంటాయి.

**అధిక రక్తపోటు :** జామపండులో పుష్కలంగా వుండే పీచు, హైపోగ్లైసెనిక్ స్వభావాన్ని కలిగి వుండి కొలెస్ట్రాల్‌ను, అధిక రక్తపోటును అదుపులో వుంచటంలో ఎంతో సహకరిస్తాయి. అందుకే జామ ఉపయోగకారి.

**మలబద్ధకం:** ఈ పండులోని పీచుపదార్థాలు పైల్స్‌ను, ఎమరాయిడ్స్‌ను తగ్గించటంలో ఉపయోగిస్తాయి. జామపండులోని గింజలు మన జీర్ణకోశాన్ని శుభ్రపరిచి, విరోచనం సాఫీగా అయ్యేట్లు చేస్తాయి. పేగులను శుద్ధిచేయడం ద్వారా పేగుల పనితీరు మెరుగుపరుస్తాయి.

**మధుమేహం :** తక్కువ గ్లైసెమిక్ ఇండెక్స్ వున్నా, పీచు పుష్కలంగా వున్న ఆహారపదార్థాలు, మన శరీరంలోని చక్కెరనిల్వలను అదుపులో వుంచుతాయి. జామకాయ అటువంటివాటిలో ఒకటి.

జామకాయ మధుమేహాన్ని అదుపులో వుంచటంలో సహాయం చేస్తుంది.

**దంతక్షయం :** జామకాయలోను, ఆకులలోను రక్తస్రావాన్ని నివారించే శక్తి వుంది. అందుచేత వాటిని పంటినొప్పికి, చిగుళ్ళ వాపుకు, నోటిలోని పుండ్లను తగ్గించటానికి వాడతారు.

**జుట్టు రాలటం :** జామలోని విటమిన్ 'బి' మరియు 'సి'లు జుట్టు కుదుళ్ళను గట్టిపరుస్తాయి. జామ ఆకులను, నానపెట్టిన నీటిని తలంటుకోవటానికి వాడితే జుట్టు రాలటం తగ్గుతుంది.

**చర్మసంరక్షణ :** సూర్యరశ్మి నేరుగా చర్మంపై పడటంవల్ల వచ్చే చర్మసంబంధమైన ఇబ్బందులను దూరంచేసుకోవటానికి లేదా అటువంటి సమస్యలు రాకుండా వుండటానికి జామపండు, జామ ఆకుల గుజ్జును చర్మంపై నలుగులా పెట్టుకోవాలి.

Courtesy : HEALTH & NUTRITION



# విధి

## వి. శ్రీకాంత్



ఈ సారి వేసవి సెలవుల్లో నేపాల్ వెళ్తున్నామని తెల్పిన థాపా చాలా సంబరపడిపోయాడు. థాపా మా ఏపార్ట్‌మెంట్స్ వాచ్‌మాన్.

"సార్...మా దేశంవెళ్తే అక్కడున్న మా మేనల్లుడు గైడ్‌గా ఉండి అన్నీ చూపిస్తాడు సార్.వాడక్కడ టాక్సీ డ్రైవర్‌గా ఉన్నాడు. వాడికి నేను ఫోన్ చేసి చెప్తాను సార్... మరి మీరు ఎప్పుడు వెళ్ళేదీ చెప్పండి సార్" అన్నాడు. నేను ఎప్పుడు బయలుదేరేదీ రెండు రోజులు ముందుగా చెప్పాను.

ఏప్రిల్ 23, 2015 సంవత్సరం. ముందుగా కాశీ చేరుకుని, అక్కడ విశ్వేశ్వరునీ... అన్నపూర్ణాదేవినీ దర్శించుకున్నాం. తర్వాత నేపాల్‌కు టూరిస్ట్‌లను చేరవేసే బస్సులున్నాయని తెల్సి అడ్వాన్స్‌గా టిక్కెట్లు బుక్ చేసుకున్నాం.

మరునాడు నేపాల్‌కు ప్రయాణమయ్యాం. ఆరు గంటల ప్రయాణం తర్వాత మా బస్ ఇండియా నేపాల్ సరిహద్దుల్లో ఆగింది. అక్కడ దిగాం.

అక్కడ దిగి టూరిస్ట్ ఫార్మాలిటీస్, ఐడెంటిటీలు వగైరాలు పూర్తిచేసుకున్న తర్వాత మళ్ళీ బస్సెక్కి నేపాల్‌లోని కాసోలీ చేరాం. అక్కడ్నుంచి బయల్దేరి రాజధాని కాట్మండూ చేరుకున్నాం. బస్ కాంప్లెక్స్ నుండి బయటకు వస్తుండగానే మమ్మల్ని పదిమందికి పైగా గైడ్లూ... టాక్సీడ్రైవర్లూ చుట్టుముట్టారు.

"షార్... మీరు వైజాగ్ నుండీ వచ్చిన సీతారామ్ రావ్‌జీయేనా సార్?" అడిగాడో వ్యక్తి!

ఆశ్చర్యంతో అతనివైపు చూశాను. "షార్... నేను మీ పాస్ పనిచేస్తున్న థాపామేనల్లుడ్ని షార్... మామాజీ రెండుసార్లు ఫోన్ చేసి చెప్పాడు షార్..." అన్నాడు. "ఫర్వాలేదు... నీకు తెలుగూ వచ్చు..."అన్నాను భోజ్‌పూరీ హిందీ యాసలో తెలుగును మాట్లాడడం గమనించి!

"మామాజీ.... ఇక్కడ్కీ వచ్చినప్పూ... ఇక్కడ్కీ తెలుగూ టూరిస్టులు వచ్చినప్పు వాళ్ళనుండీ నేర్చూ కున్నాన్ షార్" హమ్మయ్య... అనుకున్నాను. భాషా ఇబ్బందీ... గైడ్ సమస్యా తీరినందుకు.

"నీ పేరు?" "శివేంద్రా షార్"

"ఓ.కె. శివేంద్రా. ముందుగా మేం రిఫ్రెష్ కావాలి. ఏదైనా మంచి హోటలుకు తీస్కుపో..." అన్నాను.

"జీ షార్..." అంటూ మా లగేజీని అందుకుని డిక్కీలో పెట్టాడు. కేవలం పది నిముషాల్లోనే ఒక చక్కని హోటల్ ముందాపాడు. "ఇదీ చాలామంది తెలుగూ టూరిస్టులు లైక్ చేస్తారు షార్... అచ్చా హోటల్..." అన్నాడు. మేం హోటల్‌లో లాడ్జ్ అయ్యాక శివేంద్ర చెప్పింది నిజమే అనిపించింది.

"షార్... మీరూ మీ ప్రోగ్రామ్ చెప్తే నేనూ మీ పాస్ వుండీ అన్నీ చూపించీస్తాన్ షార్..." అన్నాడు. అప్పటికి సమయం రాత్రి ఏడు దాటింది.

"అలాగే... ఈ రాత్రి కాస్త రెస్ట్ తీస్కుంటాం. రేపు ఉదయం ఆరు గంటలకు రా...

"ముందుగా పశుపతినాథ్ టెంపుల్ చూస్తాం. తర్వాత మీ రాజధానిలో చూడవలసిన విశేషాలన్నీ చూపించు. రేపంతా ఈ సిటీలోనే గడిపి ఎల్లుండి జనక్‌పూర్‌వెళ్ళి సీతామందిర్ చూద్దాం" అన్నాను. "జీ షార్... నమస్తే షార్..." అంటూ అతను అక్కడి నుంచి నిష్క్రమించాడు.

మర్నాడు ఉదయం ఏడు గంటలకు పశుపతి నాథ్ ఆలయానికి చేరుకున్నాం. శివేంద్ర దగ్గరుండి పశుపతినాథుని దర్శనం చేయించాడు.తర్వాత ఆలయం ప్రాంగణంలోని ఉపాలయాలు చూపించాడు. స్థలపురాణాలు వివరించి చెప్పాడు.

భక్తీ విశ్వాసాలతో అన్నిటినీ దర్శించుకుని బయటకు వచ్చాం. తర్వాత ఒక హోటలుకు వెళ్ళి అందరం టిఫిన్ తీసుకున్నాం. "షార్... మనం వెళ్ళే దారిలోనే ధరహర టవర్స్ ఉందీ... అది మా దేశానికి ఐకాన్ వంటిదీ షార్... చూద్దాం షార్..." అన్నాడు!

"అలాగే..." అన్నాను. సమయం చూశాను. పావు తక్కువ పదకొండు. పదినిముషాల్లో ధరహార టవర్స్ దగ్గర కారాపాడు. అందరం దిగాం.

టవర్ తొమ్మిది అంతస్తుల్లో ఎత్తుగా... ఠీవిగా చారిత్రక సాక్ష్యంగా నిల్చివుంది. దీన్ని 1832 సంవత్సరంలో నిర్మించారు షార్. భీమ్‌సేన్ టవర్స్ అని కూడ అంటారు. అంటూ దాని గురించిన వివరాలన్నీ చెప్పగా ఆసక్తిగా విన్నాం.

ఇరవై నిముషాల తర్వాత అక్కడ్నించి బయల్దేరి ఒక ఫేమస్ రుద్రాక్షల షాపుకు వెళ్ళి ఒక ఏకముఖి, ఒక ద్విముఖి రుద్రాక్షలనుకొన్నాం.

"ఏకముఖి చాలా రేర్‌గా దొరుకుతుందీ షార్... మీకూ ఇక్కడా దొరికిందీ. శివుని ఫేవర్ మీకూ ఉందీ షారూ..." నవ్వుతూ అన్నాడు.

కార్లో కూర్చున్నాక కారును నెమ్మదిగా పోనిమ్మన్నాను. తన ప్రాచీన సంస్కృతినీ... వైభవాన్నీ, అలాగే కొత్తగా అలముకుంటూ వస్తున్న నవీన నాగరికతనూ సమపాళ్ళలో చూపిస్తున్న కాట్మండూ నగర సోయగాన్ని కార్లోంచి చూస్తూ ఉండిపోయాం.

ఓ చోట రెడ్ సిగ్నెల్ పడింది! కారాగింది. ఒక్షణం గడిచాక ఏవో వింత వింత శబ్దాలు ఉరుముల్లామెల్లగా మొదలయ్యాయి! మరికొన్ని క్షణాల్లోపునే అవి మరింతగా పెనుశబ్దాలుగా మారి గుండె లవిసేలా వినబడసాగాయి!

అది భూ...కం పం!!ఇలాంటి విపత్కర పరిస్థితిలో ఏంచేయాలో తోచక తీవ్రభయాందోళనలకు గురయిపోయాం. మావాళ్ళకు ధైర్యం చెప్తూనే అప్రయత్నంగా డోర్ తెరిచి కిందకు దిగాను.

నాకన్నాముందే దిగిన శివేంద్రకారును నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నాడు. నన్నూ సాయం చేయమన్నాడు. ఆ ప్రయత్నంలో ఉండగానే మా ఎదురుగా ఉన్న రోడ్డు భయంకరంగా విస్ఫోటిస్తూ రెండుగాచీలిపోతోంది!"శివేంద్రా!"ప్రాణభయంతో కేకపెట్టాను.

మా కారు కుడివైపు చక్రాలు చీలిన నెర్రెలో ఇరుక్కున్నాయి! దాదాపు రెండడుగుల వెడల్పున నేలను చీలుస్తూ భూకంపనం ముందుకు పోయింది! అదేక్షణం మరో ప్రకంపన తరంగం నేను నిలబడ్డ నేలక్రిందకు మళ్ళీ రావడంతో దబ్బునేనేను నేలమీద పడి కుడివైపునకు జారిపోయాను.

జారిపోతూనే మా కారుకేమయిందో అని చూశాను. మావాళ్ళు కారు లోపలినుండి ప్రాణభయంతో ఏడుస్తూ కేకలు పెడుతున్నారు. నన్ను కారు దగ్గరకు రమ్మంటూ అరుస్తున్నారు.

కారు దిగేందుకు ప్రయత్నిస్తున్నారు.'భయపడవద్దు. ఎవరికీ ఏ ఆపదా రాదు మనల్ని ఆ పశుపతి నాథుడే ఆదుకుంటాడు. మీరు కారు దిగొద్దు... చాలా ప్రమాదం...' అరుస్తూనే వున్నాను.

'హే శివా...? ఏమిటీ ప్రళయం?నీ దర్శనంకోసం వచ్చిన మాకు ఈ విలయాన్ని... ప్రళయాన్నీ చూపిస్తున్నావా? శాంతించు పశుపతినాథా... శాంతించు' కన్నీళ్ళతో వేడుకోసాగాను.

అంతలో మరో ప్రకంపనం వచ్చింది. ఈసారి దొర్లుతూ కాక నిలువునా జారిపోతున్నాను! ఆ

క్షణం... తక్షణ కర్తవ్యం మెరుపులా మెరిసింది!

నా కుడివైపున రోడ్డు చివరన దాదాపు రెండడుగుల మేర విచ్చుకుని వున్న ఆ నెర్రెలోనికి పడిపోకుండా నా రెండు కాళ్ళను చీలిన రోడ్డు మరో అంచుకు తగిలేలా చాచి వుంచాను.

అదృష్టం... నేను ఆ నెర్రెలో పడిపోకుండా ఆగిపోయాను. నా కాళ్ళు చీలిన రోడ్డు అంచుకు తన్ని పెట్టాయి! కొన్ని ఉద్విగ్నక్షణాలు గడిచాయి! ఇప్పుడు ఇందాకటి స్థాయి ప్రకంపనలు లేవు.

కానీ భూకంపప్రమాదం గట్టెక్కలేదు! కాస్తదూరం నుంచి శబ్దాలు వినవస్తూనే ఉన్నాయి!

మా కారువైపు చూశాను. అది అక్కడ ఏర్పడ్డ నెర్రెలో ఇరుక్కుని స్థిరంగా ఉంది! అంటే అది క్షేమమేనా? అక్కడికి మళ్ళీ ట్రెమర్స్ రావా?

నా లోని ప్రశ్నకు జవాబులు ఎవరు చెప్తారు? మావాళ్ళు అరుస్తూనే వున్నారు. వాళ్ళకు ధైర్యం చెప్పేదానికి లేచి వెళ్ళే ప్రయత్నం చేశాను. లేస్తే పడిపోతానేమో అనిపించింది. శివేంద్ర కోసం చూశాను. కనిపించలేదు! కానీ కారు పరిసరాల్లోనే ఓ పెద్ద ఫ్లెక్సీ నేలమీద కనబడింది. కూలిన ఆ ఫ్లెక్సీ కింద చిక్కుకుపోయాడా? గట్టిగా పిలిచాను. సమాధానం లేదు. ఏమయింది... అతనికీ?

అంతలో నెర్రెలోంచి దీనంగా... ప్రాణభయంతో ఎవరో అరుస్తున్నట్టుగా వినిపించింది.

"ఎవరూ? కౌన్ హై తూ?" గట్టిగా అరిచాను.

"హెల్ప్.... హెల్ప్.... బచావ్..." అరుస్తోంది నెర్రె లోంచి ఓ గొంతుక! ఆ గొంతు ఓ పాప గొంతులా వినిపించింది!

"డోంట్‌వర్రీ... డోంట్ వర్రీ... ఐ విల్ హెల్ప్ యూ...", గట్టిగా అరిచాను. లోపల చిక్కుకున్న పాపను ఎలా బయటకు తీయాలి? మెదడుకు ఆలోచన అందని సమయం... సందర్భం అది!

పాప ఆక్రందనలకు చలించిపోతున్నాను. చుట్టూ చూశాను. తాడూ... వైరుల్లాంటివేమీ కనబడలేదు. నెర్రెలోనికి పరీక్షగా చూశాను. పాప తల కనబడుతోంది. పాప ఎత్తు నాలుగు అడుగులు లేదా పైన ఉంటుందా? నెర్రె పాప ఎత్తుకు మించి ఉందా?

పాపా... నా కాళ్ళను క్రిందకు జారవిడుస్తున్నా... వాటిని గట్టిగా పట్టుకో తలను కిందకి వంచి గట్టిగా అరిచి చెప్పాను తెలిసిన హిందీ... ఇంగ్లీష్ భాషల్లో. థాంక్యూ.. అన్నట్టుగా వినబడింది!

నెర్రె కారణంగా చీలిన రోడ్డు అంచుపై నా రెండు చేతులు ఆనించి కాళ్ళను నెమ్మదిగా నెర్రెలోనికి దించాను. దింపిన క్షణం అనిపించింది, నేను చేసిన పని సరైనదేనా అని?

ఏమయినా కానీ నాలో మొండి ధైర్యం ఆవహించింది. పాప నా కాళ్ళను చుట్టేసుకుంది. కాళ్ళను పైకి లాగేందుకు ప్రయత్నించగా అది ఫలించలేదు! నా చేతులు పట్టు తప్పిపోతున్నాయి.

పూర్తిగా పట్టు తప్పితే నాకు... ముఖ్యంగా పాపకు ఏం జరుగుతుందో అర్థమయిపోయింది! ఇలాకాదు... మెరుపులా నా కుడిచేతిని చీలిన రోడ్డు మరో అంచువైపున గిరాటేసి నిలదొక్కుకున్నాను. పట్టు కుదిరింది! పాప నా కాళ్ళను బంధించే వుంది.

జై పశుపతినాథా... కాళ్ళలోనికి బలం పూనించి స్వింగ్ చేస్తూ... చేస్తూనే ఒక్క ఉదుటున నా కాళ్ళను రోడ్డుమీదకు బలంగా నెట్టాను. నా కాళ్ళతోపాటు పాప బయటకు వచ్చిపడింది!

ఒక కాలితో పాపను అవతలికి నెట్టి బలంగా ఊపిరి తీసుకుని మళ్ళీ ఒక పెద్ద స్వింగ్‌లో నేనూ రోడ్డుమీద పడి పల్లానికి దొర్లిపోయాను. దొర్లుడు ఆగిన పిదప లేచి మావాళ్ళ దగ్గరకు వెళ్ళబోయాను. అప్పటికే అతి కష్టంమీద కారు డోర్‌ను పై నుండి తెరుచుకుని బయటపడ్డ నా శ్రీమతి నా దగ్గరకు భోరున ఏడుస్తూ వచ్చింది.

వస్తూనే నా మీదపడి... నన్ను హత్తుకుని మరింత బిగ్గరగా మేం బతగ్గలమా...అలా ఇంకేదేదో అంటున్నా పట్టించుకోకుండా పాపవైపు చూశాను.

పాప రెండు చేతులను జోడించి నమస్కరిస్తూ మా వైపు చూస్తోంది. అంతలో అంబులెన్స్, పోలీస్ వాహనాలు వచ్చాయి. పాపను చూసి వాళ్ళేదో అడిగారు. పాప చెప్పినది విని పోలీసులు నన్ను వింతగా చూస్తూ థాంక్స్ చెప్పారు.

అయ్యో... మా కారు డ్రైవర్ ఆ ఫ్లెక్సీ క్రింద ఉన్నాడేమో చూడండి... ప్లీజ్... వేడుకున్నాను. పోలీసులు వెళ్ళి ఫ్లెక్సీని తొలగించి చూశారు.

శివేంద్రఅచేతనంగాపడివున్నాడు. అతన్ని అంబులెన్స్‌లో వచ్చిన డాక్టర్లు పరీక్షించారు. ఫ్లెక్సీకున్న ఇనుపగొట్టాలు తలను బలంగా తాకడం వలనస్పృహకోల్పోయాడు. ప్రాణానికి ప్రమాదం లేదు అని వారు చెప్పారు. థాంక్ గాడ్ అనుకున్నాను.

డాక్టరు నా మోచేతులకు కట్టుకట్టాడు. నొప్పి నివారణ మాత్రలు ఇచ్చారు. పాపను, శివేంద్రను ఆస్పత్రికి తీసుకుపోయారు. మేము కారు దగ్గరకు వెళ్తుండగా ఎడమవైపు నుండి భారీ శిథిలాలు జారుతూ వచ్చి నెర్రెలోనికి పడిపోయాయి. కొన్ని నెర్రెకు అడ్డంపడిపోయాయి!

ఆ దృశ్యం చూశాక గుండెదడ తగ్గడానికి పది నిమిషాలు పట్టాయి! ఆ ఘోర దృశ్యం చూసిన శ్రీమతినీ, పిల్లలనూ ఓదారుస్తూనే ఉన్నాను. అంతలో రిలీఫ్ వాహనం వచ్చి మమ్మల్ని సురక్షిత ప్రాంతానికి తీసుకుపోయింది.దైవఘటన చిత్రమైనది! ఆ పాప ఎవరయినదీ తెలియరాలేదు!

ఆ పాపను రక్షించడానికే నన్ను ఈ దేశానికి వచ్చేలా చేశావా దేవుడా? మౌనంగా వేడుకున్నాను, ఈ విలయాన్ని ఇక్కడితో ఆపమని...!





Courtesy : KARTHIK SRINIVASAN CALENDAR 2018 -VINTAGE TWINS1

# శరీరాన్ని

ఆసలే సహజ అందాల సౌందర్య రాశి. ఇక మేకప్ మెరుగులు దిద్దితే ఆమె సౌకుమార్యం వర్ణింప కానిది- వెరసి శృతీహాసన్! నటనలో మార్కులకు కొదవలేదు.

జీవితంలో ప్రతిదీ కళేనంటూ కళ కళలాడే మోముతో చెప్పింది.

ఎన్నో విషయాలకు కళలరూపం అద్ది కమ్మని కబుర్లు చెప్పడంలో తనకుతానే సాటి అనాలేమో!

## కుటుంబం :

"నా బాల్యం నాకు నార్మల్ అని అంటాను. నేను, నా చెల్లి పూర్తిగా ఆర్టిస్టిక్. విభిన్నంగా ఆలోచించేవారం. మా నాన్న వ్యక్తిత్వాన్ని ఎంతో ఆరాధించేదాన్ని. ఆయనలో గొప్ప ఆలోచనలుంటాయి. అంకితభావం, సృజనాత్మకత ఎక్కువ. తిరుగులేని విల్‌పవర్ ఆయనలో ఉంది.

మా అమ్మలోని స్వతంత్ర భావాలంటే నాకెంతో ఆరాధన.

తను కూడా కృతనిశ్చయంతో వుండే, సృజనాత్మక వ్యక్తిత్వంగలది. ఇవన్నీ కళాత్మక విషయాలే"

## సంగీతం :

"నా వ్యక్తిగత జీవితం స్ఫూర్తిగా నాలో సంగీతం జనించింది. ఇది నాలోని అంతర్భాగం. ఎందరో సంగీత కళాకారులు నా జీవితాన్ని ప్రభావితం చేశారు. ప్రతి కళాకారుడినుంచీ ప్రత్యేక పాఠాన్ని నేర్చుకున్నాను"

## సినిమాలు :

"చిత్రనిర్మాణం అన్నది నా నరాల నుంచి ప్రవహించింది. నా తల్లిదండ్రులు ఇద్దరూ నా నటనా ప్రక్రియను బాగా ప్రభావితంచేశారు. నాన్న సహజ ఆలోచనాపరుడు. అమ్మ సమయస్ఫూర్తిగా వ్యవహరిస్తుంది. ఈ గుణాలన్నీ నా నటనలో వుంటాయి"

## స్టైల్ :

"నా స్టైల్ ఎల్లవేళలా కొంచెం బ్లాక్,

# దేవాలయంగా భావిస్తా



Courtesy : HELLO!

ఎడ్జి. షేప్స్,కలర్స్‌తో ఎప్పుడూ ప్రయోగాలుచేస్తుంటా. అయితే అవి కాన్ఫిడెంట్‌గా, కంఫర్ట్‌గా వుండాలి.

ప్రస్తుత స్టైల్ నిస్సంశయంగా ఎలెక్టిక్. కటెమాస్ స్టైల్‌ను వ్యక్తిగతంగా ఇష్టపడతాను. తనెప్పుడూ కూల్‌గా వుంటుంది"

## అందం :

"బాహ్య సౌందర్యంతో కనపడడం నాకు ఇష్టం. మేకప్ నచ్చుతుంది. ఫేస్‌ప్యాక్స్, హెయిర్ ట్రీట్‌మెంట్స్ ఇష్టం.రాత్రివేళ బ్యూటీ రొటీన్లు బాగా ఫాలో అవుతుంటా. అందమన్నది అంతర్గతంగా రావాలని తెలుసు. ప్రస్తుతం మన అందాల కాన్సెప్ట్ గురించి నిర్వచించడంలో సోషల్ మీడియా ప్రధాన పాత్ర పోషిస్తున్నది.

చాలామంది మహిళలు తమనుతాము అందంగా తీర్చిదిద్దుకుంటున్నారు. ఎటువంటి మేకప్ లేకుండా మా అమ్మ ఎంతో అందంగా వుంటుంది. అమ్మలాంటి వాళ్ళు నాకెందరో స్ఫూర్తి"

## జీవితం ఓ కళ :

"మా నాన్న నాకో గొప్ప సలహా ఇచ్చారు. ఆ రోజంతా చేసిన పనుల ఆలోచనతో ఆనాటి రాత్రి సరిగ్గా నిద్రపట్టకపోతే ఆ పనులు మళ్ళీ చెయ్యవద్దన్నారు. నేను భగవద్గీత, ఖురాన్, బైబిల్ చదివాను. ఫిలాసఫీ చదవడం నాకు ఇష్టం"



## ఎప్పుడూ పబ్లిక్కే :

"పుట్టినప్పటినుంచి ఇప్పటిదాకా పర్సనల్ స్పేస్ అంటూ లేకుండా పోయింది. చిన్నప్పుడు బయటకు వస్తే పెద్దయ్యాక ఏమవుతావ్. పాటలు బాగా పాడతావా? డ్యాన్స్‌చేస్తావా? నటివి అవుతావా? అని అడిగేవారు. నాకు ఏం చెప్పాలో తోచేది కాదు. ఇప్పుడూ అంతే. ఏవో ఒక ప్రశ్నలు, ఊహాగానాలు. ఇవన్నీ చాలా విసుగు తెప్పిస్తుంటాయి"

## విరామం ఎందుకంటే :

'"శ్రీమంతుడు', 'ప్రేమమ్' సినిమాలు చేశాక మళ్ళీ అటువంటి సినిమాలే చేయాలనిపించింది. వాటిలో నా పాత్రలకు మంచి స్పందన వచ్చింది. స్ట్రాంగ్ ఉమెన్ రోల్స్‌కోసం ఎదురుచూస్తున్నాను.

ఓ ఆర్టిస్టుగా నన్ను సంతృప్తిపరిచే పాత్రలను మాత్రమే అంగీకరించాలన్నది నా ఉద్దేశ్యం.

విరామంగురించి బాధలేదు. గ్యాప్ తీసుకోవడం వల్ల వెనుకబడిపోతామనుకోవడం సరయింది కాదు. రేస్‌గురించిన ఆరాటం అస్సలు లేదు.సినిమా అన్నది నా ప్రపంచం అయిపోయింది. అక్కడే ఎప్పుడూ తిరుగుతుంటే ఎలా"

## బరువులో హెచ్చుతగ్గులు :

"జీవితాంతం ఒకే మాదిరి బరువుతో వుండడం ఎవరికీ సాధ్యపడదు. ఒక్కోసారి లావు అవుతాం. ఒక్కోసారి సన్నబడతాం.

ఇదంతా సహజంగా జరిగే విషయం. సినిమా తారలూ మనుషులే కదా. అలాగే మా పర్సనాలిటీల్లోనూ హెచ్చుతగ్గులు వుంటుంటాయి. పైగా మేము చేసే పాత్రలనుబట్టి అది అవసరంకూడా. వ్యక్తిగతంగా చూస్తే నా శరీరాన్ని నేను ఓ గుడిగా భావిస్తాను. నా దేవాలయం ఎలా వున్నా నాకు ఇష్టమే. ఎప్పుడూ నా గురించి నేను గర్వంగానే ఫీలవుతుంటా"

## ఆత్మవిశ్వాసం :

"ఎవరికైనా ఆత్మవిశ్వాసం అనేది అత్యంత ముఖ్యం. అది లేకపోవడం అనేది బాధపడాల్సిన విషయం. నేను గతంలో ఓసారి నోస్ సర్జరీ చేయించుకున్నాను.అప్పట్లో అందంకోసం చేయించుకున్నానని చాలామంది అనుకున్నారు. కాని, అది పూర్తిగా వైద్య



శస్త్ర చికిత్స. నా జుట్టు రంగు గురించి, ఫిజిక్ గురించి విమర్శించినవారుకూడా చాలామంది వున్నారు. అవన్నీ ఖాతరుచేస్తూ కూర్చుంటే నా ఆత్మవిశ్వాసం దెబ్బతింటుంది కదా. ఎలా వున్నా ఏదో ఒక లోపం వెతికే ప్రయత్నంచేసేవారు ఉంటుంటారు. అవన్నీ పట్టించుకుంటూ కూర్చోకూడదు"

## విమర్శలు :

"నేను ఎవర్నీ విమర్శించకుండా నా పనేదో నేను చేసుకుపోతుంటాను. ఎవరిపట్లా నాకు అసూయ వుండదు. నాకన్నా వేరే హీరోయిన్ మంచి పొజిషన్‌లో వున్నదంటే అది వారికష్టఫలం అనుకుంటాను. అంతే కాని ఈర్ష్యపడను" అంటూ ముగించింది.

అయినపూరి సుజాత



"ఎలాగూ తీరదని తెలిసినా, కోరుకునే కోరిక కాస్త ఘనంగా ఉండేటట్లు చూసుకోవాలోయ్. అసలు అధికారం ఇవ్వ మని అడుగుతున్నపుడు అరెస్ట్ అధికారం ఇవ్వమని ఎందుకు? ఆ డేవిడ్‌లాంటివాడిని అరెస్ట్‌చేసి విచారణచేయటం ప్రజాధనం వృధా చేయటమే అవుతుంది"

"అయితే ఏం చేయాలంటారు?"

చంపెయ్యాలన్నట్లు...కుడిచేతి చూపుడు వేలు మెడకు అడ్డంగా ఊపాడుఅవినాష్.

"ఊరుకోండిసార్! వాళ్ళు అధికారంఇచ్చినా అట్లా ఎదుటివాడిని చంపగలిగేవాళ్ళు ఎందరు ఉంటారు?" ఏదో అనబోయి ఆగిపోయాడు అవినాష్ "దాన్నలా ఉంచితే, నీకీమధ్య పై అధికారులంటే భయభక్తులు తగ్గిపోతున్నాయి కుమారూ..."

"అదేంటిసార్ అలా అన్నారు. నేనేం చేశాను?"

"నాకు ఏదో అర్జంటు మెసేజ్ ఉందన్నావ్. అది ఇంతవరకు చెప్పలేదు..."

నాలుక్కరుచుకున్నాడు కుమార్."సార్!మిమ్మల్ని అర్జంటుగా రమ్మని రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర కబురు పెట్టారు. అది చెప్పాలనే వచ్చాను. ఇప్పటిదాకా మీరు నాకు అవకాశం ఇవ్వలేదు"

అవినాష్ కనుబొమలు ముడిపడ్డాయి.

"రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర అంటే... నేషనల్ సెక్యూరిటీ అడ్వయిజర్ కదూ"

"అవున్సార్"

# వేట

పుట్టగంటి గోపీకృష్ణ

జనరల్ ధర్మేంద్ర మీద ప్రధానమంత్రితో సహా అందరికీ మంచి గురి. అందుకే రిటైరయిన ఆయన్ని అంత పెద్ద పదవిలో పెట్టుకున్నారు.

'ఆయనకు నాతో ఏం పనబ్బా...' అనుకుంటూ కుర్చీలో నుండి లేచాడు అవినాష్.

ఢిల్లీలోని నార్త్ బ్లాక్ భవనాల సముదాయంలో ఉంది రిటైర్డ్‌జనరల్ ధర్మేంద్రఆఫీసు.అవినాష్ సరాసరి ధర్మేంద్ర ఆఫీసువైపు నడిచాడు. అతను రెండు సంవత్సరాల క్రితం ఒకసారి ఆ ఆఫీసులో అడుగుపెట్టాడు.ఈ రెండుసంవత్సరాలలో వచ్చిన మార్పులుగమనిస్తూ ముందుకు నడుస్తున్నాడు.

అతన్ని లోపలకు పంపటానికి రెండు చోట్ల అతని ఐడీ వెరిఫై చేశారు. భవనంలోని ప్రతి అంగుళాన్నీ కవర్ చేస్తూ సి.సి.టి.వి. కెమేరాలు బిగించి ఉండటం గమనించాడతను.

2

## జరిగిన కథ

ఢిల్లీలోని ఓ అపార్ట్‌మెంట్ పెంట్‌హౌస్‌లో వుండే వినోద్‌నాయక్ వద్దకు కార్ల ప్రకటన చూసిన మిగిలిన ఐదుగురు వారివారి రాష్ట్రాల నుండి ప్రయాణంచేసి అతన్ని కలుస్తారు.

కొచ్చిన్‌నుండి నారాయణకుట్టి, నాగాలాండ్ నుంచి లిమ్బెన్, మధుర నుండి పూరన్‌సింగ్, హైదరాబాద్ నుండి వెంకటేష్.

కలకత్తానుండి సుమిత్‌బోస్ వరుసగా ఒకరి తర్వాత ఒకరు అక్కడికి చేరుకుంటారు.

తమకు అందిన ఆదేశాల ప్రకారం ఆ ఆరుగురు కొన్నివస్తువులను తీసుకువస్తారు. ఇవన్నీ ఎందుకు అని సుమిత్‌బోస్ అడిగితే న్యూక్లియర్ బాంబ్ తయారుచేయడానికి అని చెబుతాడు వినోద్‌నాయక్. అదిఎలా కనెక్షన్ ఇవ్వాలో ఎలా పేలుతుందో కూడా చెబుతాడు. ఆ తర్వాత వర్షం ప్రారంభంఅవుతుండగాఎవరి వాహనాల్లో వాళ్ళు వెళ్ళిపోతారు.

రీసెర్చ్ అండ్ అనాలసిస్ వింగ్‌లో సీనియర్ ఎనలిస్ట్ అవినాష్. అతను బ్లాక్ క్యాట్ కమాండోల యూనిట్‌నుండి ట్రాన్స్‌ఫర్ అయివస్తాడు. అతని అసిస్టెంట్ కుమార్.

డేవిడ్ పంపే మెయిల్స్‌లోని కోడ్ లాంగ్వేజ్ అర్థంకాదెవరికీ.డేవిడ్‌కి పాకిస్తాన్‌కివున్న సంబంధం ఏమిటో మెయిల్స్‌లోని కోడ్‌ను డికోడ్‌చేసి మన డిఫెన్స్ రహస్యాలను డేవిడ్‌చేరవేస్తున్నాడన్న విషయాన్ని పసిగడతాడు అవినాష్.

తర్వాత జరిగింది చదవండి.



ఇంతకు ముందు అతను అక్కడికి ఒక బ్లాక్‌క్యాట్ కమాండోగా వెళ్ళాడు. తిరిగి బయటకు వచ్చేటప్పటికి తనకు ఇష్టమయిన ఉద్యోగం పోగొట్టుకుని ఒక సివిల్ ఉద్యోగిగా రీసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్‌కి ట్రాన్స్‌ఫర్ చేయబడ్డాడు.

అందుకే ఆ భవనాన్ని చూస్తుంటే అతనికి చేదు జ్ఞాపకాలు గుర్తుకువస్తున్నాయి. ఎట్టకేలకు అతను ఒక ఆఫీసు రూము ముందు ఆగాడు. రూము మీద 'రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర, అడ్వైజర్, నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీ' అని రాసి ఉంది.

తలుపు తీసుకుని లోపలకు వెళ్ళిన అతను ఒక విశాలమయిన రిసెప్షన్ ఏరియాలోకి ప్రవేశించాడు. అక్కడ నలుగురు ఉద్యోగులు పనిచేస్తూ కనిపించారు. అందులో ఒకతను అవినాష్‌ని గుర్తుపట్టినట్లున్నాడు. "జనరల్ మీకోసం చాలాసేపటి నుండి ఎదురుచూస్తూ ఉన్నారు..." అంటూ జనరల్ ప్రైవేట్ రూము తలుపు తీసి లోపలకు పంపించాడు.

లోపల జనరల్ లేడు. కానీ అతను కాల్చే ఘాటయిన పొగాకు వాసన గదంతా వ్యాపించి ఉంది. జనరల్ అటాచ్డ్ టాయిలెట్లో ఉన్నట్లు నీటి శబ్దం వినిపిస్తోంది. చాలా పెద్ద రూము, గది మధ్యలో ఒక గ్లాస్‌టాప్‌టేబుల్, దాని ఎదురుగా సౌకర్యవంతమయిన కుర్చీలు, ఒక పక్కన మెత్తటి సోఫాలతో హుందాగా ఉంది. ముఖ్యంగా గది గోడలకు బిగించిన ఫొటోల పైకి దృష్టిపడింది. వాటిలో ప్రధాన మంత్రితో దిగిన ఫొటోలు ఎక్కువగా ఉన్నాయి.

'తను ప్రధానికి ఎంత సన్నిహితుడో చెప్పుకోవటానికి కాబోలు... ఇన్ని ఫొటోలు ఇలా ప్రదర్శించుకోవటం?' వాటిని పరిశీలనగా చూస్తూ అనుకున్నాడతను. "కాదు. ఆయన నాకిచ్చిన బాధ్యత ప్రతి నిమిషం గుర్తుచేసుకోవటానికి ఆ ఫొటోలను కంటికెదురుగా ఎప్పుడూ పెట్టుకుంటాను" అతని మనసులోమాటలు గ్రహించినట్లు అన్నాడు, అప్పుడే టాయిలెట్లో నుండి బయటకు వస్తున్న ధర్మేంద్ర.

టాయిలెట్లో నుండి బయటకు వస్తుండగా కూడా అతని చేతుల్లో పైపు పొగలు కక్కుతూనే ఉంది.

స్టిఫ్‌గా నిలబడి సెల్యూట్ చేశాడు అవినాష్.

"నీలో సైనికుడు ఇంకా జీవించే ఉన్నాడన్నమాట" తను తన సీట్లో కూర్చుని, అవినాష్‌ని ఎదురుగా కూర్చోమని సైగచేస్తూ అన్నాడు ధర్మేంద్ర.

"మీరు లాక్కుంది నా యూనిఫాంనే. నా నేచర్ భద్రంగా ఉంది..." ఎదురుగా ఉన్న కుర్చీలోకూర్చుని, తన గుండెను చూపిస్తూ అన్నాడు అవినాష్.

"నీ ఫైల్ చూశాను. అప్పుడు ఏం జరిగిందో వివరంగా లేదు. కానీ, నీ ప్రవర్తన కారణంగా నిన్ను ఫీల్డ్ డ్యూటీ నుండి తప్పించి, యాక్షన్ అవసరంలేని చోటుకు ట్రాన్స్‌ఫర్ చేయమని అప్పటి అధికారులు రికమెండ్ చేశారు. అందుకే ప్రస్తుతం నువ్వీ ఉద్యోగంలో ఉన్నావు" గుప్పున పొగ వదులుతూ అన్నాడు ధర్మేంద్ర.

"జరిగిన దానిమీద నాకు ఏ ఫిర్యాదూ లేదు"

చిన్నగా నిట్టూర్చాడు ధర్మేంద్ర. ఇంటర్‌కామ్‌లో రెండు కాఫీలు లోపలకు పంపమని చెప్పాడు.

తరువాత అవినాష్ వైపు తిరిగి, "నీ గురించి ఎంతోమందిని విచారించాను. అందరూ నీ గురించి గొప్పగా చెప్పారు. కానీ, ఆరోజు ఏం జరిగిందో స్పష్టంగా ఎవరూ చెప్పలేకపోతున్నారు.అది తెలుసుకోవాలనే నిన్ను పిలిపించాను"

"జరిగిపోయిన విషయాలు చర్చించుకోవటంవల్ల ఉపయోగం ఉందని నేను అనుకోవటంలేదు"

"తప్పనిసరిగా ఉపయోగం ఉంటుంది. నిన్ను పిలిపించింది ఒక ప్రత్యేకమయిన పని అప్పచెప్పటానికి. దానికి నువ్వు సూట్ అవుతావో, లేదో నువ్వు చెప్పే వివరాలమీద ఆధారపడి ఉంటుంది. గో ఎహెడ్"

"సరే అయితే వినండి..." అంటూ రెండేళ్ళ క్రితం ఏం జరిగిందో చెప్పసాగాడు అవినాష్.

మనకి ఈశాన్య రాష్ట్రాలనబడే ఏడు రాష్ట్రాలున్నాయి. బాగా చదువుకున్నవారు కూడా వాటిపేర్లు చెప్పమంటే తడుముకోకుండా చెప్పలేరు. అందులో ఒకటి మణిపూర్.

మణిపూర్ రాష్ట్రంలో చందేల్ ఒక జిల్లా. ఆ

# సీరియల్

జిల్లాలో మోరే అని ఒక ఊరు ఉంది. మినీ ఇండియాగా పిలవబడే ఆ ఊరిలో పంజాబీలు, బీహారీలు, తమిళులు, తెలుగు వాళ్ళూ... దాదాపు ఇండియాలో ఉన్న అన్ని ప్రాంతాల వాళ్ళూ ఉంటారు.

మోరే ఊరిమధ్య నుండి ఒక బజారు వెళ్తూ ఉంటుంది. దానికి ఒకవైపు మోరే మార్కెట్ ఉంటే మరోవైపు మయన్మార్ దేశంలోని ఎంఫలాంగ్‌మార్కెట్ ఉంటుంది. రెండుదేశాల మధ్య వెళ్ళిరావటానికి వీసాలు, పాస్‌పోర్టులు, డాక్యుమెంట్లూ ఎవరూఅడగరు. యధేచ్ఛగా రెండువైపులా ప్రయాణం సాగుతూ ఉంటుంది. పది ఇండియన్ రూపాయలకు రెండు వందల మయన్మార్ క్యాట్లు దొరుకుతాయి.

రోజుకు ఆ బజారులో కోటి రూపాయల వ్యాపారం జరుగుతుంది. చైనా, కొరియా, సింగపూర్, థాయిలాండ్ దేశాల నుండి స్మగుల్ అయిన సరుకు మయన్మార్ బజారుల్లో యధేచ్ఛగా దొరుకుతుంది. అందుకే ఇంఫాల్ నుండి వచ్చే ఇండియన్ టూరిస్టులు కూడా మోరే పట్టణానికి అవతల ఉన్న మయన్మార్ మార్కెట్‌కు నడుచుకుంటూ వెళ్ళి ఇండియన్ కరెన్సీ ఇచ్చి కావల్సిన వస్తువులు కొంటూ ఉంటారు.

మోరే ఊరికి కొద్ది దూరంలో... రెండు దేశాల మధ్య లోక్‌చావో నది ప్రవహిస్తూ ఉంటుంది. దాని మీద ఒక బ్రిడ్జి ఉంది. అది మన దేశ సరిహద్దు వైపు తెలుపు రంగుతోనూ, మయన్మార్ సరిహద్దు వైపు పసుపు రంగుతోనూ ఉంటుంది.



> **బ్యాంక్ ఛైర్మన్లు, డైరెక్టర్లు వంటి కీలకస్థాయిలో వున్నవారిని తరచూ మార్చటంవల్లనే కుంభకోణాలు జరుగుతున్నాయి.**
>
> -అరుంధతి భట్టాచార్య,
> ఎస్.బి.ఐ. మాజీ ఛైర్ పర్సన్

నిజానికి అది నదిఅని పేరే కానీ దాంట్లో నీళ్ళు ఎప్పుడూ మోకాళ్ళలోతు దాటవు. కాబట్టి నది దాటాలంటే బ్రిడ్జిమీదగానే దాటనవసరం లేదు. చిన్నపిల్లలు కూడా నదిలోనడుచుకుంటూ అవతలకు వెళ్ళవచ్చు. అలా టూరిస్టులను ఎట్రాక్ట్ చేసే మోరే మరో విషయానికి కూడా పేరు పొందింది.

అనేక గ్రూపులకు చెందిన ఉగ్రవాదులు అక్కడ దాక్కుని ఉంటారు. ఇండియన్ ఫోర్స్ దాడిచేస్తే మయన్మార్ పారిపోతారు. మయన్మార్ అధికారులు దాడి చేస్తే ఇటువస్తారు. అప్పట్లో మా యూనిట్ ఇంఫాల్‌లో ఉండేది. దానికి అధికారిని నేనే. ఒకరోజు హఠాత్తుగా మా యూనిట్‌కు మోరేవెళ్ళమని కబురువచ్చింది.

గుజరాత్‌లో బాంబుపేలుళ్ళకు పాల్పడిన ఉగ్రవాదుల బృందం, వారి లీడర్ ఖలీఫాతోపాటు మోరే దగ్గర మయన్మార్ సరిహద్దులు దాటబోతున్నారని ఇంటెలిజెన్స్ రిపోర్ట్ వచ్చింది. వారిని ఎట్టి పరిస్థితుల్లో ఆపమని నాకు ఆర్డర్ వచ్చింది.

మా కమాండోల దృష్టిలో 'ఎట్టి పరిస్థితుల్లో' అంటే ఏంటో మీకు తెలుసు. టార్గెట్‌గా ఉన్నవ్యక్తుల ప్రాణాలు తీసయినా వారిని సరిహద్దులు దాటకుండా ఆపాలని నిర్ణయించుకున్నాను.

కమాండో యూనిట్ తన పని రెండు రకాలుగా చేస్తుంది. ఒకొక్కసారి ఉగ్రవాదులు ఏ భవనంలోనో ఇరుక్కుపోతారు. లేదూ కొంతమంది మనుషులను బందీలుగా పట్టుకుని డిమాండ్లు డిక్లేర్ చేస్తారు. అలాంటపుడు దాడి ఎక్కడ చెయ్యాలో స్పష్టంగా తెలుస్తుంది. అప్పుడు కమాండోలు తమకు ఉన్న అన్ని రకాల సాధన సంపత్తినీ తీసుకుని బహిరంగంగా దాడి చేస్తారు. ఇంకొన్నిసార్లు దుండగులు ఎక్కడ ఉన్నారో తెలియదు. ఎటు నుండి వస్తారో తెలియదు. అలాంటపుడు కమాండోలు కూడా రహస్యంగా మఫ్టీలో ఉంటూ కార్యం చక్కబెడతారు.

ఇప్పుడు మోరే దగ్గర దేశ సరిహద్దు దాటబోతున్న ఉగ్రవాదులు ఎటునుండి వస్తున్నారో తెలియదు. వారికి ఎవరు సహాయం చేస్తున్నారో తెలియదు. అలాంటపుడు మా ఉనికిని ప్రదర్శించుకునేకంటే, రహస్యంగా ఉండి పని చక్కబెట్టుకోవటమే మేలు.

అందుకే ఈ పరిస్థితుల్లో రెండో పద్ధతి వాడాలని డిసైడయ్యాను. యూనిట్ మొత్తం మఫ్టీలో ఒక మామూలు వ్యాన్‌లో మోరేకి బయలుదేరింది. నేషనల్ హైవే 39 ఇంఫాల్ నుండి మోరే వెళ్తుంది.

అవటానికది 110 కిలోమీటర్ల దూరమయినా గుంతలతో నిండిఉన్న రోడ్డు కావటంతో మోరే చేరటానికి నాలుగు గంటలపైనే పట్టింది.

లోక్‌చావో నది ఒడ్డున, ఇండియా బోర్డర్ వైపు ఎవరికి వారుగా విడిపోయి తీరిగ్గా సెటిలయ్యాము. టూరిస్టుల్లా బిహేవ్ చేస్తూ పరిసరాలు గమనిస్తున్నట్లు అటుఇటూ తిరుగుతూ అనుమానాస్పదంగా ఎవరైనా కనపడతారేమో అని చూస్తున్నాను.

ఖలీఫా ఎలా ఉంటాడో ఒక ఫోటో మా అందరి దగ్గరా ఉంది. కానీ, అతను ఖచ్చితంగా మారువేషంలో ఉంటాడని తెలుసు కాబట్టి, ఫోటోలో ఉన్న వ్యక్తిని కాసేపు మరచిపోయి అనుమానాస్పద ప్రవర్తన ఉన్న ప్రతి ఒక్కరినీ గమనించి చూస్తున్నాను.

ఒక పక్కన నది మీద ఇండో మయన్మార్ ఫ్రెండ్‌షిప్ బ్రిడ్జి కనిపిస్తోంది. అక్కడ ఉన్న బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్ చాలా తక్కువగా ఉంది. వారి దగ్గర ఉన్న ఆయుధాలుకూడా అంతంత మాత్రంగానే ఉన్నాయి. బ్రిడ్జికింద లోక్‌చావో నదిలో కొంతమంది ఆడవాళ్ళు బట్టలు ఉతుకుతున్నారు. చిన్నపిల్లలు ఈతలు కొడుతున్నారు. కాసేపట్లో లోకల్ ఎమ్మెల్యే అక్కడ మీటింగ్ పెట్టుకున్నాడు. స్టేజ్ కట్టి ఉంది. ఆ మీటింగ్ కోసం అప్పుడప్పుడే జనాలు పోగవుతున్నారు.

నేను అక్కడే ఉన్న ఒక స్టాల్ దగ్గర కూర్చుని టీ తాగుతున్నాను. మా టీమ్ మెంబర్లు దూరందూరంగా ఉన్నా అందరూ ఒకరికొకరు కంటిసైగలకు అందే దూరంలో ఉన్నాం. మామూలుగా ఉండే జనంకంటే



## దుస్తులు నచ్చాయి

'పద్మావత్'లో రాణి పద్మిని పాత్రలో దీపికా పడుకొనె జీవించిందని విడిగా చెప్పుకోనవసరం లేదు. నటనలోనే కాకుండా వస్త్రధారణలోనూ దీపిక తన ప్రత్యేకత చాటుకున్నది. ఇవి ప్రేక్షకులకే కాదు దీపికకూ చాలా నచ్చాయట.

క్లైమాక్స్‌లోని ఆమె వస్త్రధారణ మరింత ఆకర్షణీయంగా వుంది. తన నటనకు గుర్తుగా ఈ దుస్తులు తనకు ఇవ్వాలని దర్శకుడు సంజాయ్ లీలా భన్సాలీని కోరింది.

"పద్మావత్' ప్రయాణాన్ని కడదాకా మరువలేను. చివరి సన్నివేశంలాంటివి నేను ఇప్పటిదాకా పోషించనేలేదు. ఆ సన్నివేశాలకోసం నేను ధరించిన దుస్తులను నాకు ఇవ్వాల్సిందిగా భన్సాలీ సార్‌ను అడిగాను" అని తెలిపింది దీపిక.

ఆరోజు పొలిటికల్ మీటింగ్ కారణంగా ఎక్కువమంది జనం అక్కడ పోగయి ఉన్నారు.

అలా మనుషులు గుంపులుగా ఉండటం మమ్మల్ని కవర్ చేయటానికి బాగా ఉపయోగపడుతోంది. అదేసమయంలో బోర్డర్‌దాటబోతున్న టెర్రరిస్టులను గుర్తించటంలో ఆ జనమే ప్రతికూలంగా మారుతున్నారు. ప్రతి మనిషిని నిశితంగా పరిశీలిస్తూ ముందుకు కదులుతున్నాను.

ఏదయినా మనిషిమీద అనుమానం వస్తే వారి దగ్గరకు వెళ్ళి నా దగ్గర ఉన్న కెమేరా ఇచ్చి నన్ను బ్రిడ్జి బ్యాక్ డ్రాప్‌లో ఒక ఫోటో తీయమని అడుగుతున్నాను. ఫోటో ఎలా తీయాలో వివరించే నెపంతో వారికి దగ్గరగా జరిగి వారి దుస్తుల కింద ఆయుధాలేమయినా ఉన్నాయేమో పరిశీలిస్తున్నాను.

ఇంతలో ఒకకారు వచ్చి దూరంగా ఆగింది. అందులో నుండి నలుగురు మనుషులు దిగారు. ఒక వ్యక్తిముందు నడుస్తుంటే మిగిలినవారు అతని వెనుక నడుస్తూ బ్రిడ్జివైపువెళ్తున్నారు. వారిని చూడగానే వారు లోకల్స్‌కానీ, టూరిస్టులు కానీ కాదని అనిపించింది. పైగా ముందునడుస్తున్న వ్యక్తి గడ్డం కిందఉన్న మొహం ఖలీఫామొహంలా అనిపించింది.

సూటిగా బ్రిడ్జివైపు వెళ్తున్న వారికి అడ్డుగా నడిచి "ఒక ఫోటో తీస్తారా?" అని అడిగాను ముందున్న వ్యక్తిని. అతను నన్ను పక్కకి జరిపి ముందుకు నడవక ముందే, "ప్లీజ్..." అని యాడ్ చేశాను.

అతను ఒకసారి నన్ను కింద నుండి పైకి పరికించిచూసి, "సరే..." అంటూ నా దగ్గర ఉన్న కెమేరా తన చేతిలోకి తీసుకున్నాడు. ఆ వంకతో అతని దగ్గరకు చేరాను నేను.

అతన్ని అనేక కోణాల్లో నా షర్టు గుండీలో ఉన్న రహస్య కెమేరా ఫోటోలు తీస్తుంది. ఆ ఫోటోలు ఎప్పటికప్పుడు హెడ్‌క్వార్టర్స్ చేరుతున్నాయి.

అతనికి దగ్గరగా జరిగి, "జస్ట్ ఎయిమ్ చేసి ఇలా క్లిక్ చేయండి..." అంటూ అతనికిచ్చిన నా కెమేరాలో ఫోటో ఎలా తీయాలో చెప్తుంటే, అతను వేసుకున్న జాకెట్ కింద ఏ.కె. 47 ఉన్నట్లు చూచాయగా అనిపించింది. ఇంతలో నా చెవులకున్న హెడ్ ఫోన్స్‌లో, "పాజిటివ్ ఐడెంటిఫికేషన్. అతనే మన టార్గెట్..." అని వినిపించింది. ఆ మాటలు వినటంతోనే నా బాడీ కాస్త స్టిఫ్‌గా మారింది.

ఆ మాత్రం మార్పు కూడా పసిగట్టాడు ఖలీఫా. నామీద అనుమానం వచ్చినట్లుంది... నన్ను ఒక్క తోపు తోసి బ్రిడ్జి వైపు పరుగెత్తాడు.

## బ్రేక్ ఇస్తుంది

తాను నటిస్తున్న 'బృందావనమది అందరిదీ' సినిమా తనకు ఖచ్చితంగా మంచి బ్రేక్ కాగలదన్న విశ్వాసాన్ని రిచాపనయ్ వ్యక్తంచేస్తున్నది.

"నాది పక్కింటి అమ్మాయి వంటి పాత్ర. ప్రతిభ చూపగల అవకాశంగల పాత్ర. ఇంత మంచి అవకాశం ఇచ్చినందుకు దర్శకుడికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.నేను పనిలో విరామంతీసుకోలేదు.

ప్రతిఏడాదీ ఓ తెలుగుసినిమా చేస్తున్నాను. కాకపోతే ఇప్పటిదాకా సరైన బ్రేక్ రాలేదు.

తెలుగు సినిమా చేయని సమయంలో కన్నడ లేదా మలయాళసినిమాలతో బిజీగా వుంటున్నాను" అని తెలిపింది రిచాపనయ్.



నేను కూడా వెంటనే రియాక్ట్ అయి పిస్టల్ బయటకు తీశాను. అయితే చుట్టూ మనుషులు ఎక్కువగా ఉండటంవల్ల కాల్పులు జరపటంకుదరటం లేదు.

దుండగులు బ్రిడ్జి వైపు వెళ్తారన్న పరిణామం ముందే ఊహించి నా అనుచరులను కొంతమందిని బ్రిడ్జి మొదట్లో ఉంచాను. వారు కూడా తమ తమ ఆయుధాలు బయటకు తీసి తమ వైపు వస్తున్న ఖలీఫాకి గురిపెట్టారు. అది గమనించిన ఖలీఫా,అతని అనుచరులు బ్రిడ్జివైపు వెళ్తున్నవారల్లా ఆగి తమదారి మార్చుకుని జనంలో కలిసిపోయారు. నేను మాత్రం వదలకుండా వారిని వెంటాడుతూనే ఉన్నాను.

అయితే అప్పుడు అనుకోనిది జరిగింది. పబ్లిక్ మీటింగ్ కోసం లోకల్‌ఎమ్మెల్యే వస్తున్న కారు అప్పుడే అక్కడకువచ్చి ఆగింది. కారు తలుపు తీసుకుని ఆ ఎమ్మెల్యే బయటకుదిగటం, అదేసమయంలో ఖలీఫా ఆ కారు దగ్గరకు చేరుకోవటం జరిగింది.

అప్పుడు ఎవరూ ఊహించని విధంగా రియాక్ట్ అయ్యాడు ఖలీఫా. లోకల్ ఎమ్మెల్యేని పట్టుకుని తన చేతిలోని రివాల్వర్ అతని కణతకు గురిపెట్టాడు.

ఎమ్మెల్యే బాడీగార్డులతో సహా అందరూ నిశ్చేష్టులయ్యారు. అతన్ని వెంబడిస్తున్న నేను కూడా ఆగిపోయాను. "మర్యాదగా నన్ను సరిహద్దు దాటనివ్వు. లేకపోతే ఈ ఎమ్మెల్యేతల పేలిపోతుంది" అన్నాడు.

"నువ్వు ఆ పని చెయ్యలేవు. ఎమ్మెల్యేని చంపిన మరుక్షణం మీలో ఒక్కరు కూడా ప్రాణాలతో బయటపడరు..." మొండిగా అన్నాను నేను.

"నన్ను మధ్యలో పెట్టుకుని ఈ గేమ్స్ ఏమిటి? మీరు అడ్డు తప్పుకుని వాళ్ళు అడిగినట్లు చెయ్యండి. నన్ను కాపాడండి" అంటూ లబలబలాడుతున్నాడు ఎమ్మెల్యే.



ఆంధ్రప్రదేశ్‌కి నిధులు కావాలో, బి.జె.పితో వివాదం కావాలో అక్కడి ప్రభుత్వం తేల్చుకోవాలి.

-అరుణ్‌జైట్లీ, కేంద్రమంత్రి

నేను పిస్టల్ దించలేదు. వెనక్కి తగ్గలేదు. బ్రిడ్జి వైపు వెళ్ళే దారిని కవర్ చేస్తూ కమాండోలు కమ్ముకున్నారు. సమయం మించిపోతుందనుకున్నాడేమో, ఖలీఫా పక్కనే ఉన్న ఒక ఇంటివైపు ఎమ్మెల్యేని నడిపించాడు. అనుచరులతో సహా ఇంట్లోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

అతను ఆ తరువాత ఏం చేయబోతున్నాడో నాకు తెలుసు. ఎమ్మెల్యే చేత ముఖ్యమంత్రికి ఫోన్ చేయిస్తాడు.ముఖ్యమంత్రి నా అధికారులతో మాట్లాడతాడు. నేను ఎంతోసేపు ఆలోచించకముందే మా హెడ్ క్వార్టర్స్‌నుండి వెనక్కితిరగమని కబురువచ్చింది.

"సార్! వాడు ఎదురుగా ఉన్నాడు. ఇప్పుడు వాడిని పోనిస్తే మళ్ళీ ఇక జీవితంలో దొరకడు. వందల మంది చావుకు కారణం వాడు. వాడిని అంత తేలిగ్గా వదిలితే..."

"అవన్నీ నాకు తెలుసు. కానీ ఒక ఎమ్మెల్యే ప్రాణాన్ని పణంగా పెట్టి ఖలీఫాని పట్టుకోలేం. ఫాలో ది ఆర్డర్స్. కమ్ బ్యాక్..." కటువుగా చెప్పాడు అవతల వైపు నా అధికారి.

"యస్సార్.." అనక తప్పలేదు.

ఇంతలో చీకటి పడింది. పై అధికారుల ఆజ్ఞను ఫాలోకావటం తప్ప నాకు మరోదారిలేదు. కానీ ఆ పనిచేయటానికి నా మనసు ఒప్పుకోవటంలేదు. వారి ఆర్డర్‌కు వ్యతిరేకంగా పనిచేయటం అంటే... నాతో పాటు నా యూనిట్లో వాళ్ళందరినీ క్రమశిక్షణ ఉల్లంఘించేలా చేయటమే.

అందుకే... అధికారులకు వెనక్కి వచ్చేస్తున్నానని చెప్పినా, నేను అక్కడే ఉండిపోయాను. నా అనుచరులను మాత్రం వెనక్కి పంపాను. మేము వచ్చిన

# కథ కథ కథ కథల పోటీ

## ఒక్కొక్క కథకు ₹ 9,999 ల బహుమతి

## సాధారణ ప్రచురణ కథకు ₹ 2,000

కథ అంటే కలలా కరిగిపోకూడదు. అది మనకు కనబడుతూవుండాలి. అందులో మనమూ వుండాలి. మన చుట్టు పక్కలవారూ, మనవాళ్ళూవుండాలి. చాలాకాలం గుర్తుకొస్తూవుండాలి. అందరికీచెప్పేలా వుండాలి. మన సమస్యలకు సమాధానాలు ఆ కథలో దొరికితే అది మరీ ఉత్తమమైన కథ. అటువంటి కథలను ఈ 'కథ కథ కథ కథల పోటీ'కి రాయండి. ఈ దిగువ ఇస్తున్న సబ్జెక్టులను ఇతివృత్తాలుగా చేసుకుని రచయిత(త్రు)లను కథలు రాయవలసిందిగా కోరుతున్నాం. ఒక్కరు ఒక్క సబ్జెక్టుపైనే రాయాలన్న నియమం లేదు. ఒకటికి మించి రాయొచ్చు. రాయగలిగితే అన్ని సబ్జెక్టులపైనా రాయొచ్చు. అది మీ ఇష్టం. పాఠకదేవుళ్ళకు అక్షరనైవేద్యంగా మీ కథలను అందించండి.

రచయిత(త్రు)లు కథలుగా మలచవలసిన సబ్జెక్టులు ఇవే:

1. ఉద్యోగి
2. వ్యాపారి
3. డాక్టర్
4. ఇంజనీర్
5. ఆర్కిటెక్ట్
6. రైటర్
7. ఎన్ఆర్ఐ
8. ఇండియన్
9. పై 8 గాక మీకు ఇష్టమైన సబ్జెక్ట్ ఏదైనా సరే 9వ కథ అవుతుంది

ఇవీ సబ్జెక్టులు. రాయండి, రాసి విజేతలుకండి.

9 కథలకు 9 బహుమతులు. ప్రతి కథకు ₹ 9,999లను బహుమతిగా అందజేస్తాం.

రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది 20.4.2018

ఈ పోటీలో పాల్గొనే రచయిత(త్రు)లు ఈ క్రింది విషయాలను గమనించవలసిందిగా మనవి.

: నిబంధనలు :

1. అనువాదాలు, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలు పంపవద్దు.
2. కథల ఎంపికలో స్వాతిసంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు. ఈ కథలపోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ, పోటీనిరద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులున్నాయి.
3. కథ తమ స్వీయరచన అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్ని విధిగా జతపరచాలి.
4. మీరు రాసే కథపైన తప్పనిసరిగా తీసుకున్న సబ్జెక్టు రాయండి. కథ ప్రింటింగ్‌లో 3 పేజీలకు మించరాదు. కథలను త్రిప్పిపంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతపరచాలి. కవరుమీద 'కథ కథ కథ కథల పోటీకి' అని రాయాలి.

కథలను పంపవలసిన చిరునామా:
ఎడిటర్, స్వాతి సపరివార పత్రిక
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పోస్ట్ బాక్స్ 339, విజయవాడ 520 002

---

వ్యాన్ వెనక్కి వెళ్ళిపోయింది. నేను అక్కడే ఉన్న విషయం ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డాను.

మరింత పొద్దుపోయింది. ఇంట్లో ఉన్న ఎమ్మెల్యేకి. ఉగ్రవాదులకి భోజనాలు పంపారు.

సుష్టుగా భోంచేసి బాగా పొద్దుపోయాక బ్రిడ్జిదాటి అటువైపు వెళ్ళటం వాళ్ళ ప్లాను అని అర్థమయింది.

కొద్దిగా హడావుడి తగ్గాక ఎవరికీ కనపడకుండా చాటుగా ఆ ఇంటి దగ్గర్లోకి వెళ్ళాను. ఇంటికి కాపలా ఉన్నా, ప్రమాదం తప్పిపోయిందని భావించటంతో అందరూ రిలాక్స్‌గా ఉన్నారు.

అతి తేలిగ్గా ఇంట్లోకి ప్రవేశించాను. అయితే లోపల నేనుకూడా ఊహించని ఒక దృశ్యం కనిపించింది. స్థానిక ఎమ్మెల్యే, ఖలీఫా కులాసాగా మందు కొడుతూ, తుళ్ళిపడుతూ కనిపించారు.

"ఎమ్మెల్యే మాటకి విలువ ఇచ్చి, మమ్మల్నిఇంత తేలిగ్గా వదిలిపెడతారని అనుకోలేదు..." అంటున్నాడు ఖలీఫా.

"మాటకి కాదు భయ్యా, ప్రాణానికి. వదిలిపెట్టకపోతే ప్రాణం తీస్తానని బెదిరించావుగా. ఇక వదిలిపెట్టక ఏం చేస్తారు?" బాటిల్లో ద్రవం గ్లాసులో పోసుకుంటూ అన్నాడు ఎమ్మెల్యే.

"మీ ఐడియానే ఐడియా. ఇలా పబ్లిక్ మీటింగ్ పెట్టటం, పరిస్థితులు ఎదురుతిరిగితే అడ్డు పెట్టుకోవటానికి వీలుగా మీరు మాకు అందుబాటులో ఉండటం... ఇదంతా మీ సలహానే కదా..."

"ఇట్లాంటి ఎన్ని ఎత్తులు వెయ్యకపోతే రాజకీయాల్లో నెగ్గుకు వస్తున్నానంటావ్?" గర్వంగాఅన్నాడు ఎమ్మెల్యే. నా రక్తం సలసలా కాగిపోయింది. ఇలాంటి ఎమ్మెల్యేకోసం అలాంటి దుర్మార్గులను వదిలిపెట్టడం అన్యాయం అనిపించింది...అంటూ ఆరోజు ఏం జరిగిందో చెప్పటం ముగించాడు అవినాష్.

అప్పటిదాకా అవినాష్ చెప్తున్న విషయాలు ధర్మేంద్ర ఎంతఉత్సుకతతో విన్నాడంటే, చేతిలోని పైపుకూడా ఆరిపోయింది. తిరిగి లైటర్‌తో పైపు వెలిగించుకుని "తర్వాత ఏంచేశావ్?" అడిగాడు.

"పిస్టల్ మ్యాగజైన్ ఓపెన్ చేసి చూశాను. మొత్తం పది బుల్లెట్లున్నాయి. ఉగ్రవాదులు ఆరుగురుఉన్నారు. సరిపోతాయనుకున్నాను. కాల్పులుమొదలుపెట్టాను. అంతా పూర్తయ్యేటప్పటికి మూడు బుల్లెట్లుమిగిలాయి. మనుషులు మాత్రం ఎవరూ మిగల్లేదు"

"నువ్వు షార్ప్ షూటర్‌వి అని విన్నాను. ఆ ఒక్క బుల్లెట్ అయినా ఎక్కువ ఎందుకు ఖర్చయింది?"

"ఎమ్మెల్యేకి అవసరం పడింది"

"వ్వాట్?" ఉలిక్కిపడుతూ అన్నాడు ధర్మేంద్ర. "ఎమ్మెల్యేని కాల్చేశావా?"

"తప్పంటారా?" తను మరింత ఆశ్చర్యంగా అడిగాడు అవినాష్.

ఏం చెప్పాలో తెలియనట్లు చేతిలోని పైపు వైపు చూస్తూ ఉండిపోయాడు ధర్మేంద్ర. "అందరూ నేను చేసింది తప్పన్నారు. నాకు మాత్రం అప్పుడు అలా అనిపించలేదు. ఇప్పుడూ అనిపించటం లేదు. నిజం చెప్పాలంటే ఆ ఎమ్మెల్యే ఉగ్రవాదుల కంటే ప్రమాదకరమైన మనిషని అనిపించింది. కానీ ఎంక్వయిరీచేసిన అధికారికి నేను ప్రమాదకారిగా కనిపించాను.

అందుకే నన్ను ఫీల్డు డ్యూటీల్లో ఉంచటం ప్రమాదకరం అని భావించి రీసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్‌కి ట్రాన్స్‌ఫర్ చేశారు. అప్పట్నుండి ఒక మూలకూర్చుని నా ఎనాలిసిస్ ఏదో నేను చేసుకుంటూ ఉన్నాను. ఇంతలో మీ నుండి ఈ పిలుపు వచ్చింది"

"నీ గురించి చాలామంది చాలా విషయాలు చెప్పారు"

"అందులో మంచి విషయాలు ఉండి ఉండవే"

"అదేంలేదు. చాలా గొప్పవిషయాలు చెప్పారు. నువ్వు ముక్కుసూటిమనిషివనీ, అనుకున్నది సాధించేదాకా వదలవనీ, ఒక కమాండోగా నిన్నుమించినవాడు ఈ దేశంలో లేడనీ...చాలా చెప్పారు.

కానీ పై అధికారులమాట అమలుచెయ్యని ఒక్క అవగుణం కారణంగా ఇలా లూప్‌లైనులో ఉండిపోయావని చెప్పారు"

"నా క్యారెక్టర్ అది. దాన్ని ఇప్పుడు ఎవరికోసమూ మార్చుకోలేను" అన్నాడు.

"నిన్ను నేను పిలిపించింది నీ క్యారెక్టర్ మార్చటానికి కాదు. అచ్చు నీలాంటివాడితో నాకు పని పడింది" అన్నాడు.

"ఏం పని?"

ఇంకా ఉంది

# WhatsApp

ఈ జనరేషన్‌లో ఎప్పుడు నిద్రపోవాలో మన సెల్‌ఫోన్ నిర్ణయిస్తుంది.

లాయర్ : మీ పెళ్ళికి కారణం?
సుబ్బు : ప్రేమలేఖ
లాయర్ : ప్రేమించి మరీ పెళ్ళిచేసుకుని విడాకులెందుకు? సుబ్బు : ప్రేమ లేక

ఒక సందేశం వేగంగా చేరాలంటే 'ఈమెయిల్' అయినా కావాలి లేదా 'ఫిమేల్' అయినా కావాలి. మొదటిదానికంటే రెండవమార్గంలో మరింత వేగంగా చేరుతుంది.

స్టార్ బేకరీవాడు, ప్రతిరోజూ తన దగ్గరలో ఉన్న పాలవాడి దగ్గర వెన్న కొనేవాడు. ఒకసారి వెన్న తక్కువిస్తున్నాడని అనుమానం వచ్చి బరువు చూశాడు. కేజీకి 50 గ్రాములు తక్కువ ఉంది. అలా కొన్ని రోజులు పరీక్షచేసి, అన్నిరోజులూ తక్కువ రావటంతో, పోలీస్‌కేసు పెట్టాడు.
**పోలీసులు పాలవాడిని :** నీ దగ్గరున్న కేజీ రాయి చూపించు.
**పాలవాడు :** నాదగ్గర రాయిలేదండి.
**పోలీసు :** మరి ఎలా కొలుస్తావు?
**పాలవాడు :** బేకరీలో కేజీ కేకు కొంటానండీ. దానితో తూకం వేస్తాను.
**నీతి :** మనం ఇచ్చేదే మనకు దక్కుతుంది.

నీకోసం- భార్య : తాగుడుకు డబ్బులెందుకు తగలేస్తావు? భర్త : నువ్వు బ్యూటీపార్లర్‌లకు డబ్బులెందుకు తగలేస్తున్నావ్?
**భార్య :** మీకు అందంగా కనిపించాలని.
**భర్త :** నేను నీకోసమే తాగుతున్నాను,నువ్వు నాకు అందంగా కనిపించాలని.

డబుల్ ధమాకా (ఎ) : వ్యాపారి, ఆడిటర్‌గారితో ఫోన్‌లో "మా ఇంట్లో ఓ పెద్ద పట్టెమంచం వుంది. నేను కొత్తగా కొనుక్కున్న ఇంటికి పట్టికెళ్ళాలంటే, ట్రాన్స్‌పోర్ట్‌వాళ్ళు ఆ మంచం ఖరీదుకంటే ఎక్కువడుగుతున్నారు.
నాకేమో సెంటిమెంట్. ఏం చేయాలో తెలీట్లేదు. మీ సలహా కావాలి"

ఓ తాతగారికి వందేళ్ళు నిండాయి. గొప్ప పార్టీ జరుగుతోంది. తాతగారి ఆరోగ్యం, ఉత్సాహం, శరీరదృఢత్వం చూసి అందరూ అభినందిస్తున్నారు, ఆశ్చర్యపోతున్నారు. ఉబలాటం ఆపుకోలేక కొందరు ఆయన ఆరోగ్యరహస్యాన్నిఅడిగాడు. తాతగారు ముసిముసి నవ్వులతో "మాకు పెళ్ళై 75 ఏళ్ళు అయ్యింది.
మొదటి రాత్రే మేము ఓ ఒప్పందానికి వచ్చాం. దాని ప్రకారం ఇద్దరి మధ్యమాట తేడావస్తే ఓడిన వారు ఐదు కిలోమీటర్లు నడవాలి.అలా ఒప్పందం ప్రకారం రోజు విడిచి రోజు 75 ఏళ్ళనుండి 5 కిలోమీటర్లు నడుస్తూనే వున్నాను. నేను సరిగ్గా నడుస్తున్నానో లేదో అని బామ్మ నా వెనకాలే నడిచివచ్చేది. అందుకే మేమిద్దరం గుండులా వున్నాం"



సభలో ఓ పెద్దమనిషి జోకువేశాడు. సభికులందరూ నవ్వారు. రెండునిమిషాలు ఆగి,మళ్ళీ అదే జోకు వేశాడు. మళ్ళీ అంతా నవ్వారు. మూడోసారి వేశాడు. కొంతమందే నవ్వారు.
అలా మళ్ళీ మళ్ళీ అదే జోకు వేస్తూనే ఉన్నాడు. మొహమాటానికి కూడా సభలోనివారు నవ్వటం మానేశారు అప్పుడు ఆ పెద్దాయన, వారినిలా అడిగాడు "ఒకే జోకు మాటి మాటికీ వినిపిస్తే నవ్వలేకపోయారు. కాని గతంలో జరిగిన ఒకే చెత్త విషయం గురించి తలుచుకుని తలచుకుని మరి ఎందుకు ఏడుస్తారు?"

తేడా : ఒక ఋషికి, లాయర్‌కి, రాజకీయ నాయకుడికి తేడా ఏమిటి?
ఋషి అబద్ధం చెప్పడు.
లాయర్ నిజం చెప్పలేడు.రాజకీయ నాయకుడికి నిజానికి, అబద్ధానికి తేడా తెలీదు.

బయట- భర్త : డార్లింగ్! ఇవాళ్ళ మనం భోజనం బయట చేద్దాం.
**భార్య :** ఓహ్! థాంక్యూ! డార్లింగ్. రెండు నిమిషాల్లో తయారై వస్తాను.
**భర్త :** నేను ఈ లోపల బయట వరండాలో చాప వేస్తాను. అన్నం, కూరలు, కంచాలు, గిన్నెలు తీసుకునివచ్చేయ్!

ఒక కప్ప,చెట్టుపైకొమ్మదాకాఎక్కాలనుకుంది. మిగిలిన కప్పలన్నీ "అది సాధ్యం కాదు, సాధ్యం కాదు" అని అరిచాయి.
అయినా, కప్ప చెట్టుపైదాకా ఎక్కేసింది.ఎందుకంటే దానికి చెముడు. వినపడదు.
మిగిలిన కప్పలు తనను ఉత్సాహపరచటానికి అరుస్తున్నాయనుకుంది.
నిరుత్సాహపరిచే ఆలోచనలు, మనసుకు ఎక్కించుకోకుంటే అనుకున్నది సాధిస్తాం.

"ఒక స్త్రీ 5 నిమిషాలలో తయారవుతానన్నా, ఒక మగాడు 5 నిమిషాలలో ఇంటికొస్తానన్నా, రెండూ ఒకటే. ఏ సమయానికైనా జరుగుతాయి" -అజ్ఞాతీనంద

లోకం మరిచి గొప్ప ప్రయోగాలు చేస్తున్న యువ శాస్త్రవేత్త పెళ్ళి అంటే ఏమిటో తెల్సుకోవాలనే ఉబలాటంతో పెళ్ళిచేసుకున్నాడు. ఆ తర్వాత... కొంతకాలానికి "శాస్త్రవేత్త లోకానికి పనికివచ్చే ప్రయోగాలు చేయాలి గాని, పిచ్చి పిచ్చి ప్రయోగాలు చేయకూడదని" అర్థమయ్యింది.

"ఏకాంతంలో వున్నప్పుడు ఆలోచనలను అదుపులో వుంచుకోవాలి.మనుష్యుల మధ్య వున్నప్పుడు పెదవిని(మాటలను) అదుపులో వుంచుకోవాలి.

రెండు కారణాలు :
**కుమార్ :** ఏ వస్తువు కొనాలన్నా, మా ఆవిడ ఎప్పుడూ రెండు కారణాలు చెబుతుంది.
**రఘు :** ఆ రెండూ ఏమిటి?
**కుమార్ :** పక్కింటివాళ్ళకున్నాయి కాబట్టి, మనకూ వుండాలి. వాళ్ళకు లేకపోతే, మనకి ఉంటే గొప్పగావుంటుంది కాబట్టి కొనాలి.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## కొత్తదనానికి దూరం... రొటీన్‌కు దగ్గర



ఎవరైనా సరే వాళ్ళకు నప్పే పనులే చేయాలి. సినిమావాళ్ళయినా వాళ్ళకు సరిపోయే చిత్రాలే చేయాలి. ధన్‌రాజ్ వచ్చి బాలయ్య డైలాగులు చెప్పి, భారీ సినిమాలు చేస్తానంటే చెల్లదుకాక చెల్లదు. ఎందుకంటే పాఠాలు మాస్టారే చెప్పాలి.

అది ఆయన హక్కు..ఎవరుపడితే వాళ్ళు పాఠాలు చెబితే జనాలకు ఎక్కదు. సినిమాల్లో కూడా సందేశాలు పెద్ద హీరోలే ఇవ్వాలి. చిన్న, మిడిల్ రేంజ్ హీరోలు ఇవ్వకూడదు. అది సినిమారంగం రూలు. ఊరును దత్తత తీసుకోమన్నా, పర్యావరణాన్ని కాపాడండి అని చెప్పినా అది పెద్ద హీరోలు చెబితే, సూపరు.

చిన్న, మీడియం హీరోలు చెబితే బోరు. పెద్దహీరో రొటీన్‌సినిమా చేసినా,పెద్ద డైరెక్టర్ పాత కథే కొత్తగా చెప్పినా అది ఓకె.

చిన్న, మీడియంహీరోలు అదే పనిచేస్తే, రొట్ట... రొడ్డకొట్టుడు.

ఇవన్నీ టాలీవుడ్ నియమాలు.

తెలుగుసినిమా ప్రేక్షకుల రాజ్యాంగం. ఈ రాజ్యాంగసూత్రం ప్రకారం, ఈ నియమాల ప్రకారం 'ఎమ్.ఎల్.ఏ' అనే సినిమా పక్కా రొటీన్, రొడ్డకొట్టుడు సినిమా. ఎన్నోసార్లు చూసిన కమర్షియల్ ఫార్ములా సినిమా. ఇదే సినిమా పెద్ద హీరోకోసం చేస్తే, అది వేరుగా వుంటుంది. ఆ స్క్రీన్‌ప్లే, ఆ డైరెక్టర్ టాలెంట్, ఆ భారీతనం అంతా వేరు.

ఈ ముచ్చట అంతా ఈవారం విడుదలైన 'ఎమ్.ఎల్.ఏ' సినిమా గురించే. మంచి లక్షణాలున్న అబ్బాయి అన్నది ఈ టైటిల్‌కు ట్యాగ్‌లైన్. కళ్యాణ్ రామ్ హీరో, కాజల్ హీరోయిన్.

కొత్త దర్శకుడు ఉపేంద్ర మాధవ్ దర్శకుడు. ఈ సినిమా కథేంటంటే... తమ ఇంటినించి ఎలాగైనా ఒక్కరైనా ఎమ్మెల్యే కావాలనుకునే ఆసామీ (జయప్రకాష్‌రెడ్డి), ఆఖరికి ఏమీచేయలేక, దుష్టుడైనా, దుర్మార్గుడైనా ఫరవాలేదని ఓ ఎమ్మెల్యేకే (రవికిషన్) తన కుమార్తె ఇందు (కాజల్)ను కట్టబెట్టాలని అనుకుంటాడు. అలాంటిటైమ్‌లో ఆ అమ్మాయిఇంట్లోంచి పారిపోయి బెంగళూరు చేరుతుంది.

అక్కడ కళ్యాణ్ (కళ్యాణ్‌రామ్) పరిచయం అవుతాడు. ఆమెసమస్య తెలిసి, ఆమె ఊరికివస్తాడు. ఎమ్మెల్యే కావాలన్న సవాల్‌ను స్వీకరిస్తాడు. అప్పుడు ఏమయింది? అన్నది మిగిలిన సినిమా.

ఈ సినిమా విషయంలో కొత్త దర్శకుడు ఉపేంద్ర మాధవ్ మూడు తప్పులు చేశాడు. ఒకటి కొత్త డైరెక్టర్లు, మీడియం హీరోల విషయంలో ప్రేక్షకుల అభిరుచి ఎలావుంది అన్నది పట్టించుకోకపోవడం.

రెండవది చిన్న పాయింట్ పట్టుకుని రెండు సగాలకు సరిపడా కథగా లాగడం. మూడవది తొలి సగానికి మలిసగానికి మధ్య సింక్ వుండేలా చూసుకోకపోవడం. ఇప్పుడు ప్రేక్షకులు భిన్నమైన అభిరుచితో సినిమాలు చూస్తున్నారు.

పెట్టనమ్మ ఎలాగూ పెట్టదు,పెట్టే అమ్మకు ఏమయింది అన్నట్లుగా, సీనియర్ దర్శకులు, హీరోలు ఎలాగూ వైవిధ్యమైన సినిమాలు అందించరు. కొత్త

## నో మేకప్

తెలుగు, కన్నడ చిత్రాల షూటింగ్‌లో బిజీగా వున్న తాన్యాహోప్ తమిళ 'థాండం'కు రెడీ అయింది. సినిమాత్వరలోనే విడుదలకానున్నది. ఈ ప్రాజెక్టు కబుర్లను తాన్యా హుషారుగా చెప్తున్నది. "ఇది సస్పెన్స్ చిత్రం. స్వతంత్రభావాలు గల ఉద్యోగిని పాత్ర నాది.

వాస్తవిక జీవితంలోనిసంఘటనల స్ఫూర్తితో దర్శకుడు ప్రధానపాత్రలను మలిచారు. ఛాలెంజింగ్ పాత్ర. నా పాత్రకోసం కొన్నివిషయాలను వదిలేయాల్సి వచ్చింది. సహజంగా కనపడేందుకుగాను దర్శకుడు నన్ను మేకప్ చేసుకోవద్దని చెప్పారు. మొదటిసారి మేకప్‌లేకుండా సెట్స్‌లోకి వెళ్ళాను. కొద్దిగా తమిళం కూడా నేర్చుకున్నాను" అని తెలిపింది. ◆

## ఇక ప్రజాసేవ

'నచ్చావులే' అంటూ ప్రేక్షకుల మెప్పు పొందే ప్రయత్నంచేసిన మాధవీలత ఎందరికి గుర్తుందో కాని, ఈ అమ్మాయి అచ్చ తెలుగు పిల్ల.

'నచ్చావులే' సినిమా అయితే హిట్‌కొట్టింది కాని మాధవీలతకు ఒరిగిన లాభం మాత్రం ఏదీ లేకపోయింది. గ్లామర్ పరిశ్రమ అచ్చిరాలేదనుకుందేమో ప్రజాసేవపైకి దృష్టి మరల్చింది.

ఇలా ప్రజాసేవకోసం జనసేన పార్టీలో చేరతానంటూ ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేసింది.

ఇంతకు ముందు నక్షత్ర ఫౌండేషన్ స్థాపించింది కాని, నిధుల కొరత, తగిన ప్రోత్సాహం లేని కారణంగా దానికి విరామం ఇచ్చానంటున్నది. తనకు పవన్‌కళ్యాణ్ అంటే అభిమానం కాబట్టి ఆ పార్టీలో చేరి ప్రజలకు సేవ చేస్తానంటూ ముక్తాయింపు పలికింది. ◆

దర్శకులు, మిడిల్‌హీరోలు కూడా అదే పోకడపోతే ఎలా అన్నట్లు ఆలోచిస్తున్నారు. అందువల్ల ఆ విధంగా ఈ సినిమా మిస్ కాస్టింగ్ అయింది.

'ఎమ్మెల్యే'సినిమా బాగుంటుంది. ఎలా బాగుంటుంది అంటే కలర్‌ఫుల్ పిక్చరైజేషన్, కొత్త కొత్త లొకేషన్లు, ఫస్ట్‌హాఫ్‌లో కాస్త కామెడీ, నిర్మాణ విలువలు,సెకండాఫ్‌లో మెసేజ్ ఇవన్నీ బాగుంటాయి.

కానీ 'ఎమ్మెల్యే'సినిమా అంతబాగోదు. ఎందుకని? కళ్యాణ్‌రామ్-కాజల్ జంట చూడడానికి అంత మ్యాచింగ్‌గా లేదు కనుక. పాటల్లో వాళ్ళ మధ్య కెమిస్ట్రీ అంతగా కుదరలేదు కనుక.

ద్వితీయార్థంలో ఆ సందేశం, దానికోసం అల్లుకున్న సీరియస్ ఎమోషన్ సన్నివేశాలు జనాలకు అంతగాపట్టవు కనుక. ఈ రేంజ్ సినిమాకు అవి సూట్‌కావు కనుక.

సినిమా తొలిసగం బాగానే వుంటుంది. ఎత్తుగడ, హీరోను పరిచయం చేయడం, హీరోయిన్ పరిచయం, వాళ్ళ మధ్య మిగిలినవారితో కలిసిన ఫన్ సన్నివేశాలు అన్నీ కలిసి ఫస్ట్ హాఫ్‌ను బాగానే తయారుచేశాయి. ఫరవాలేదనిపిస్తాయి.

సరైన ట్విస్ట్‌తో తొలిసగం ముగిశాక, ప్రేక్షకుడు ఫరవాలేదులే అనుకుని ద్వితీయార్థానికి రెడీ అవుతాడు. ద్వితీయార్థం ప్రారంభం బాగానేవుంటుంది. ఎమ్మెల్యేగా గెలవడానికి హీరో రంగం సిద్ధంచేసుకునే వరకు కూడా ఓ.కె.

కానీ ఆ తరువాత సినిమా గాడి తన్నేసింది. ఈ సినిమా లెవెల్‌కు నప్పనిదారిలోకి అడుగుపెట్టి, పక్కదారి పట్టేసింది. అప్పటిదాకా నవ్వుల సినిమాచూస్తున్న




ప్రేక్షకులు ఇక పెదాలకు తాళం వేసుకుని మిగిలిన సినిమా అంతా చూసేసి, ఇంటిదారి పట్టాల్సిన పరిస్థితి. అప్పుడు తీరిగ్గా ఆలోచిస్తే, తొలిసగం అసలు దేనికోసం అని ఆలోచన వస్తుంది.

కేవలం హీరో, హీరోయిన్ల పరిచయంకోసం తప్ప మరి ఎందుకు? గంటసేపు పితలాటకం అని అనిపిస్తుంది. దీంతో తొలిసగానికి, మలిసగానికి పొంతన కుదరలేదన్న జ్ఞానం అంకురిస్తుంది.

ఇలా కాకుండా సినిమా కామెడీ లైన్‌లోనే వెళ్ళి వుంటే బాగుండేది కదా? అన్న ఆలోచన వస్తుంది. దాంతో బయటకు వచ్చాక, ఎలా వుందీ? అని అడిగినవారికీ, యావరేజ్, ఫరవాలేదు అనే టైపులో సమాధానం తప్ప, సూపరెహె... అదిరింది అన్న మాటలు ఐతే వినిపించవుకాక వినిపించవు.

ఇలాంటి సినిమాకు హంగులు, ఆర్భాటాలు అయితే బాగానే వున్నాయి. మంచి లొకేషన్లలో ప్రసాద్ మూరెళ్ళ సినిమాటోగ్రఫీ బాగుంది. మణిశర్మ చేసిన ఒకటి రెండు పాటలు, నేపథ్యం, సంగీతం బాగున్నాయి.

ఎడిటింగ్ ఓ.కె. కళ్యాణ్‌రామ్ కాస్త కొత్తగా వున్నాడు. బాగానే చేశాడు.

అయితే హీరోగా డ్యాన్సులు అంత బాగా లేవు. ఫైట్లు మాత్రం బాగా చేశాడు.

కామెడీ సీన్లు బాగానే చేశాడు. పోసాని, పృథ్వీ, వెన్నెలకిషోర్ ఓకె. కాజల్ అందాల ఆరబోతకు తప్ప మరెందుకు కాదన్నట్లు వుంది. రవికిషన్ అన్ని సినిమాల మాదిరిగానే ఈ సినిమాలోనూ సేమ్ టు సేమ్ ఎక్స్‌ప్రెషన్.

మొత్తంమీద చూసుకుంటే, వేసవి వేళ రెండు గంటలు ఏసి థియేటర్లో కూర్చోవడానికి తప్ప, ఓ కమర్షియల్ సినిమాగా చూడడానికి మాత్రం పనికి వస్తుంది 'ఎమ్మెల్యే'.

**ప్లస్‌పాయింట్స్...**
ఫస్ట్ హాఫ్, ఫన్, నిర్మాణ విలువలు

**మైనస్‌పాయింట్స్...**
ద్వితీయార్థం

**పంచ్‌లైన్**
గెలుస్తాడంటే అనుమానమే ◆



## నవ్వడమే తెలుసు

చిత్రసీమలోకి కాలుపెట్టి రెజీనా కెసెండ్రాకు అప్పుడే పదేళ్ళయిపోయింది. ఈ విషయమై ఆమె అభిప్రాయాలను అడిగితే మల్లెపువ్వంత స్వచ్ఛంగా నవ్వేస్తూ సమాధానం ఇచ్చింది.

"నేను పరిశ్రమలోకి వచ్చి పదేళ్ళయిపోయినా సినిమాల్లో కెరీర్‌ను సీరియస్‌గా తీసుకోవడాన్ని తెలుగు సినిమా ఎస్.ఎమ్.ఎస్.తర్వాతే ఆరంభించాను.సినిమాల్లోకి రాకముందు సైకాలజీ, మానవ ప్రవర్తనలో కెరీర్, థియేటర్, డ్యాన్స్ అన్న మూడు విషయాలపట్ల నా మనస్సు లగ్నమై వుండేది.

దాంతో గ్రాడ్యుయేషన్‌దాకా నటన కొనసాగించాలనుకునేదాన్ని. నాకు మనస్సు బాగా లేకపోయినా, కష్టంగావున్న వాటన్నింటినీ వెనక్కు నెట్టేసి కెమెరా ముందు నవ్వుతూ పనిచేయగలగడం నాకున్న మంచి అలవాటు" అని చెప్పింది. ◆





## వందశాతం నమ్మకం

సినిమా ఫలితాలు,మిగతా విషయాల జోలికి వెళ్ళకుండా దర్శకుడు చెప్పింది చెప్పినట్లు చేయడమే తన పని అంటోంది రాశీఖన్నా.

"నేనెప్పుడూ వందశాతం నమ్మకంతోనే సెట్‌లోకి అడుగుపెడతాను. సినిమా ఏమవుతుందో అన్నసందేహాలు, ఆలోచనలు నాలోవుండవు. చిత్ర పరిశ్రమలోకి వచ్చినప్పటినుంచీ నా ధోరణి ఇదే.

అందుకేనేమో సినీ జయాపజయాలు నాపైన ఎటువంటి ప్రభావాన్నీ చూపలేదు. పరాజయాలు ఎదురైనా నిరుత్సాహపడలేదు. నమ్మకం లేకపోతే ఏ సినిమా చెయ్యలేం. బహుశా నా పని తీరే నన్ను నిలబెడుతున్నదేమో" అంటూ నవ్వేసింది. ◆





## చిన్ననాటి కల

సురభి కెరీర్ బాటలో పెద్దగా కొత్త పరిమళాలు ఏవీ లేవు. తమిళంలో ఒకటి, తెలుగులో ఒకటిమాత్రం తన చేతిలో ఉన్నాయి. కెరీర్ ఎలావున్నా నటి కావడమే తన లక్ష్యం కాబట్టి కోరిక తీరిందంటూ సంతృప్తిని వ్యక్తం చేస్తున్నది.

"చిన్నతనంనుంచీ మోడల్ కావాలని కలలు కన్నాను. నా వయస్సుతోపాటు ఆ కోరికా పెరుగుతూ వచ్చింది. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు తమిళ చిత్రం ఆడిషన్‌కు అవకాశం వచ్చింది. ఎవ్వరికీ చెప్పకుండా తమిళ సినిమా చేసేశా. నా కోరిక నెరవేరింది" అని చెప్పింది. ◆

## ఎందుకు తగ్గాయో

'జెంటిల్‌మెన్', 'నిన్నుకోరి', 'జై లవకుశ' సినిమాల విజయంతో హ్యాట్రిక్ సాధించి భలేగా నటిస్తుందన్న ముద్రపడినా నివేదాథామస్‌కు నిన్నామొన్నటిదాకా కొత్తఅవకాశం దక్కనేలేదు.

మొత్తానికి ఇంకో సినిమాను తన ఖాతాలో వేసుకోగలిగింది. ఆమె నటించిన 'జూలియట్ లవర్ ఆఫ్ ఇడియట్' వాస్తవానికి ఆమె మొదటి సినిమానే అయినప్పటికీ నాలుగో చిత్రంగా విడుదలై తుస్సుమన్నది.

నివేద జోరు తగ్గడానికి కారణం ఏంటి అన్న విశ్లేషణలు మొదలుపెడితే, హ్యాట్రిక్ విజయాల సంబరంలో బోల్డంత పారితోషికాన్ని డిమాండ్ చేసిందట. అందువల్లే అవకాశాలు చేజారాయన్నది ఓ టాక్. కారణం ఏదైతేనేం- మొత్తానికి ఇంకో అవకాశంవచ్చిందికదా!

మరో హ్యాట్రిక్ కొట్టేస్తుందేమోలే! ◆



## గ్లామర్‌కూ సై

'అ' తర్వాత ఈషారెబ్బ మాంచి జోరుమీద ఉంది. సుమంత్ కొత్త సినిమాతో పాటు ఇంకొన్ని సినిమాలు ఆమె చేతిలో ఉన్నాయి. అయితే తాను తెలుగమ్మాయిని కావడంవల్లనే సరైన అవకాశాలు రావడంలేదంటున్నది ఈషారెబ్బ.

"ఈ విషయంలో ఈషా కాస్తంత ఘాటుగానే సమాధానం ఇచ్చింది. నాలో ప్రతిభ ఉన్న నేను తెలుగమ్మాయిని కావడంతోనేమో సరైన అవకాశాలు ఇవ్వడంలేదు. కొందరు స్నేహితులు నన్ను తమిళ సినిమా చెయ్యమంటున్నారు.

అక్కడ విజయంవరిస్తే ఇక్కడఅవకాశాలువస్తాయన్నది వారి అభిప్రాయం. కానీ, నాకది ఇష్టం లేదు. టాలీవుడ్‌ను వదిలి వెళ్ళను. గ్లామర్ పాత్రలు చెయ్యడానికీ నేను సిద్ధమే" అంటున్నది. ◆

## ఎలా ఆడుతున్నాయి?

- 'కిర్రాక్ పార్టీ' ఫస్ట్ వీకెండ్ ఫరవాలేదనిపించింది. తరువాత డౌన్ అయింది. మెల్లగా షేర్ లాగుతోంది తప్ప అద్భుతాలు ఏమీ చేయడంలేదు. ఫస్ట్ వీక్ మొత్తం మీద అయిదు కోట్ల షేర్ లాగడం కష్టం అయింది.
- ఇంక మార్కెట్‌లో పెద్దగా సినిమాలు లేవు, 'కిర్రాక్ పార్టీ'కి అదే అడ్వాంటేజ్.
- ఈ వారం విడుదలైన సినిమాలు కూడా అంతగా కలెక్షన్లు కుమ్మేసేంత సీన్ అయితే లేదు.
- వచ్చేవారం పెద్ద సినిమా 'రంగస్థలం' విడుదలైతే, బాక్సాఫీస్ ఊపందుకోవాలి.

# చివరి రోజుల్లో...



## జో ఫ్రేజియర్
(1944 - 2011)

బాక్సింగ్‌ని తలచుకోగానే ఎవరికైనా గుర్తుకు వచ్చే పేరు మహమ్మద్ ఆలీ. గ్రేటెస్ట్ బాక్సర్‌గా గుర్తింపు పొందిన మహమ్మద్ ఆలీని ఒక దశలో మట్టికరిపించి సంచలనం సృష్టించిన బాక్సర్ జో ఫ్రేజియర్. 'ఫైటర్ ఆఫ్ ది ఇయర్'గా పలు సంవత్సరాలు గుర్తింపు పొందాడు.

హెవీ వెయిట్ బాక్సింగ్‌లో ప్రపంచంలో నాటి వరకు గుర్తింపు పొందినవారిలో 18వ స్థానం ఫ్రేజియర్‌ది అని బాక్సింగ్ అసోసియేషన్ పేర్కొన్నది.

ప్రముఖ ఆటగాళ్ళకోసం ఏర్పాటుచేసే 'హాల్ ఆఫ్ ఫేమ్'లో అటు ఇంటర్నేషనల్ బాక్సింగ్ 'హాల్ ఆఫ్ ఫేమ్'లో ఇటు వరల్డ్ బాక్సింగ్ 'హాల్ ఆఫ్ ఫేమ్'లోనూ పేరున్నవాడు ఫ్రేజియర్.

ప్రత్యర్థిమీద శక్తివంతమయిన ఒత్తిడిని తెచ్చి, అతడిని అలసిపోయేలా చేసి ఒకే ఒక్క దెబ్బతో పడవేయగల ప్రత్యేక సామర్థ్యం అతనిది. 1964 ఒలెంపిక్స్‌లో బంగారుపతకం సొంతంచేసుకున్నాడు. అప్పటికి అతని వయసు కేవలం 20 ఏళ్ళు.

1970ల్లో ఫ్రేజియర్‌కి తిరుగులేదు. అతనితో పోటీ నామమాత్రం అనేవారు. 1970-73 కాలంలో ఛాంపియన్. ఆ సమయంలో మహమ్మద్ ఆలీ బాక్సర్‌గా రంగప్రవేశం చేశాడు.

ఆ ఇద్దరి మధ్యలో బాక్సింగ్ పోటీ ఏర్పాటుకే కొంత సమయం పట్టింది. ఇద్దరు అంగీకరించేలా చెయ్యగలిగారు. చివరికి ఆ పోటీ 'ఫైట్ ఆఫ్ ది సెంచురీ'గా ప్రచారం జరిగింది.

మహమ్మద్ ఆలీని మట్టికరిపించి ఛాంపియన్ అయ్యాడు. అయితే మహమ్మద్ ఆలీలో ఒక శక్తివంతమైన బాక్సర్‌ని చూశాడు. అతనినుండి పోటీ తప్పదనుకున్నాడు. ఎప్పటికైనా తనను ఓడించేది అతడే అనుకుని మహమ్మద్ ఆలీమీద కసి పెంచుకున్నాడు. అతను అనుకున్నట్టే రెండేళ్ళతర్వాత మహమ్మద్ ఆలీ చేతిలో ఓడిపోయాడు.

1975లో ఓడిపోయినతర్వాత ఇక మహమ్మద్ ఆలీముందు నిలవలేనని భావించిన ఫ్రేజియర్ బాక్సింగ్‌లో నుండి రిటైర్‌మెంట్ ప్రకటించాడు.

ఆ తరువాత 1981లో తిరిగి ఒకసారి రిటైర్‌మెంట్‌లో నుండి బయటకు వచ్చి బాక్సింగ్ బరిలో దిగినా ఫ్రేజియర్‌కి పాక్షిక విజయాలే లభించాయి. 1990ల్లో ఒలెంపిక్స్ ప్రారంభోత్సవంలో ఒలెంపిక్ జ్యోతివెలిగించే అవకాశం మహమ్మద్ ఆలీకి దక్కింది.

**మహమ్మద్ ఆలీని మట్టికరిపించి ఛాంపియన్ అయ్యాడు. అయితే మహమ్మద్ ఆలీలో ఒక శక్తివంతమైన బాక్సర్‌ని చూశాడు. అతనినుండి పోటీ తప్పదనుకున్నాడు. ఎప్పటికైనా తనను ఓడించేది అతడే అనుకుని మహమ్మద్ ఆలీమీద కసి పెంచుకున్నాడు.**

దానిని సహించలేక రగిలిపోయాడు ఫ్రేజియర్.

"ఆలీని ఆ ఒలెంపిక్ మంటల్లోకి నెట్టేయాలని వుంది" అని దాదాపుగా అందరూ వినేట్టుగానే తన కసిని బయటపెట్టాడు.

ఫ్రేజియర్ చుట్టుపక్కల వుంటే తెల్లవారు ఎటువంటి జోక్‌లు వేసే సాహసం చేసేవారు కాదు. అలా తెల్లవారిని భయపెట్టిన పిడిగుద్దులే తనని బాక్సింగ్ లోకి తీసుకువెళ్ళాయి. బాక్సింగ్‌లో కోట్లాది డాలర్లు సంపాదించాడు జో ఫ్రేజియర్.

ఆ రోజుల్లో తన ఇంట్లో ఒక గదినిండా వంద డాలర్ల నోట్ల కట్టలు గుట్టలు గుట్టలుగా పేర్చివుండేవని జో ఫ్రేజియర్ స్వయంగా ఒక ఇంటర్వ్యూలో చెప్పాడు. 'ఎంత సంపాదించానో లెక్కలేదు' అనేవాడు. ఒక్క బాక్సింగ్‌లోనే కాదు ఆ తర్వాత అతను నటించిన టెలివిజన్ ఎపిసోడ్‌లు, సినిమాలన్నింటి ద్వారా భారీ సంపాదనే ముట్టింది.

కొడుకు ప్రొఫెషనల్ బాక్సర్ అయ్యాడు. తండ్రి అంత బాక్సింగ్ టాలెంట్ లేదు. అయినా అతన్ని బాక్సింగ్‌లో తీర్చిదిద్దాడు. కూతురు లాయర్ అయింది. తన వ్యవహారాలు చూసుకునేందుకు ఆమెనే సలహాదారురాలిగా పెట్టుకున్నాడు.

బాక్సింగ్‌లో ప్రత్యర్థిని 'కిక్' చేయటం నేరం. నిజ జీవితంలో తెలివిగా గోతులు తొవ్వే గుంటనక్కల్ని గమనించి జాగ్రత్తపడటం నేరం.అక్కడే జో ఫ్రేజియర్ పొరపడ్డాడు. తనదగ్గరున్న డబ్బంతా పెట్టి వందల ఎకరాల భూమి కొనాలనుకున్నాడు. అందుకోసం ఒక ట్రస్ట్‌ని ఏర్పాటుచేసి వారిద్వారా ఆ భూమి కొన్నాడు. దానిమీద తనకు నెలవారి ఆదాయం ఇస్తారనుకున్నాడు. కాని చివరికి ఆ ట్రస్ట్ నిర్వాహకులు దివాలా ప్రకటించారు. విషయం కోర్టుకు చేరింది.

న్యాయస్థానంలో పోరాటం బాక్సింగ్‌కన్నా కష్టమైనదని జో ఫ్రేజియర్‌కి అర్థమైంది. డబ్బులు పోయాయి, ఆస్తి పోయింది. తాను పెట్టిన ఇతర పెట్టుబడులు, ప్రారంభించిన వ్యాపారాలు అన్నింటిలోనూ నష్టమే. క్రీడల్లో ఛాంపియన్, ఆర్థిక అంశాలలో అమాయకుడు జో ఫ్రేజియర్ అన్నారు సాటివారు.

వ్యాపార భాగస్వాములు ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ సంతకం పెట్టి కష్టాలు కొని తెచ్చుకున్నాడు. అతనిలోని ఔదార్యం, అహంభావం రెండూ కలిపి అతన్ని దెబ్బతీశాయి.

ఒకనాడు పెద్ద బంగళాలో బ్రతికిన జో ఫ్రేజియర్ తాను నిర్వహిస్తున్న బాక్సింగ్ కోచింగ్ సెంటర్‌పైన ఒక గది అపార్ట్‌మెంట్‌లోకి తన మకాం మార్చుకున్నాడు. తన జీవిత అనుభవాలను ఒక పుస్తకంగా ప్రచురించాడు. 'స్మోకింగ్ జో' అనే పేరుతో వచ్చిన ఆ పుస్తకం విజయవంతమయింది. ఆ తర్వాత ఒకటి రెండు పుస్తకాలు రాశాడు.

చివరి సంవత్సరాలు కేవలం తన జిమ్, బాక్సింగ్ కోచింగ్‌కి పరిమితమయ్యాడు.

మిగిలిన లోకం గురించి ఆలోచించేవాడు కాదు కాని, తన చిరకాల ప్రత్యర్థి మహమ్మద్ ఆలీ గురించిన సమాచారం సేకరించేవాడు. ఆలీకి చివరి రోజుల్లో తీవ్ర అనారోగ్యం వచ్చి బాధపడుతున్నాడని ఎవరో చెపితే "చేసిన తప్పులకు శిక్ష తప్పదు... కర్మ అనుభవించాలి" అంటూ కామెంట్ చేశాడు.

ఫ్రేజియర్‌ని ఒకప్పుడు పలు మాటలు అన్నందుకు క్షమాపణలు కోరాడు ఆలీ. అది పత్రికద్వారా కోరతాడా నాకు వచ్చి చెప్పాలిగాని అంటూ తనలోని కసిని చివరిలో కూడా ప్రదర్శించాడు.

తన అభిమానానికి ఏమాత్రం తక్కువైనా భరించేవాడు కాదు జో ఫ్రేజియర్. బ్రతికినంతకాలం పులిలా బ్రతకాలన్నది జో మాట. అలాగే బ్రతికాడు. ఎన్ని ఇతర ఇబ్బందులు ఎదుర్కొన్నా ఎవరికీలొంగక, ఎవరిదగ్గర చేయి జాచకుండా జీవించాడు.

జీవితం కూడా తమాషాగా ఎటువంటి అనారోగ్య ఇబ్బందులు లేకుండా అంతమైంది. 2011 సెప్టెంబరులో కాలేయ క్యాన్సర్ గుర్తించారు. నవంబరు కల్లా అది ముదిరి మరణించాడు.

జో ఫ్రేజియర్ అంతిమ యాత్రకు జీవితాంతం పోరాడిన, ద్వేషించిన మహమ్మద్ ఆలీ వచ్చాడు. కాని ఆ విషయం ఫ్రేజియర్‌కి తెలియని స్థితి.

# ఈ శీర్షిక మీదే

ఉత్తమ ప్రశ్నకు ₹500, ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

* ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం

**రెండు తప్పులు?**

ఆలోచించకుండా 'పని' చేయడం 'పని' చేయకుండా 'ఆలోచించడం'.

* ఎల్.శ్రీరామ అనంత్, మార్టేరు

**కొత్తగా హోటల్‌లో చేరిన సర్వర్?**

పానీపూరీ తెమ్మంటే, పానీ ఓ చేత్తో, పూరీ ఓ చేత్తో తెస్తాడు.

* కె.ఉమధు, విశాఖపట్నం

**మొదటిసారి బిడ్డతో అత్తారింటికి వచ్చే కోడలు ఇంటిల్లిపాదికి కొత్త బట్టలు తీసుకొస్తుంది ఎందుకు?**

తనను ఎత్తుకున్న ప్రతివారినీ బిడ్డ 'తడిపేసి' మర్యాద చేస్తుంది కనుక.

* కాశీ బొబ్బిలి, విశాఖపట్నం

**ఎంతటి ధరనైనా తక్కువచేసి చూపించేది?**

మాత్రమే.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

**అనుభవం?**

చెబితే అర్థంకానిది, చెడితే కానీ తెలిసిరానిది.

* టి.హిరణ్యమూర్తి, హైదరాబాద్

**వాయిదా వెయ్యడం అంటే?**

దీనికి జవాబు వచ్చేవారం చెపుతాను.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

**జాతీయ' నాయకుడవ్వాలంటే?**

జనాలకి 'తీయ'ని మాటలు చెప్పాలి.

* ఎస్.సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం

**'మెదడు'కు వ్యాయామంలా పనిచేసేవి?**

సమస్యలు.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

**కష్టాలు కలకాలం వుండవంటారెందుకని?**

'కల' కాలం తక్కువ కాబట్టి.

## ఈ కార్టూన్ మీదే




## B హ్యాపీ

**లం**చం తీసుకుంటూ పట్టుబడ్డ ఇంజనీర్‌మీద విచారణ జరుగుతోంది. "మీరెంత తీసుకున్నారు" అడిగాడు జడ్జి.

ఇంజనీర్ తన లాయర్‌వైపు చూశాడు.

"ప్రశ్న నిన్నడిగితే లాయర్‌వైపు చూస్తావేమిటి" గద్దించాడు జడ్జి.

"అయ్యా ఆ మొత్తం లెక్కపెట్టి నా దగ్గర ఫీజుగా తీసుకుంది లాయర్‌గారేనండి... అందుకని"

"**ప**దేళ్ళు సంసారంచేసి ఇప్పుడు విడాకులు కావా లంటున్నావు ఏమిటి కారణం"

"పెళ్ళి సమయానికి నాకు కంటిచూపు సరిగ్గా వుండేది కాదు.ఇటీవలే లేజర్ చికిత్సతో చూపు బాగుపడి మా ఆవిడ అందంగురించి అర్థమైందండీ"

**దం**పతులిద్దరూ గొడవపడి మ్యారేజ్ కౌన్సిలర్ దగ్గరకు వచ్చారు. భార్యను బయట కూర్చోమని భర్తతో మాట్లాడాడు కౌన్సిలర్.

తన భార్య విషమిచ్చి చంపాలని చూస్తున్నది. భర్తకు అనుమానం అని అర్థమైంది కౌన్సిలర్‌కి.

అతన్ని బయటకు పంపి భార్యని పిలిచి సమస్య గురించి మాట్లాడాడు.

ఆ తర్వాత మళ్ళీ భర్తను పిలిచి "మీ ఆవిడతో కాపురంచేసేకన్నా ఆమె ఇచ్చే విషం తాగి చచ్చిపోవటం మరింత సుఖం" అంటూ సలహా ఇచ్చాడు.

"**ఏ**వండీ వచ్చే జన్మలో కూడా మీరే నా భర్తగా కావాలండీ..." అంది గోముగా భార్య.

"నాకన్నా నోరు వాయిలేనివాడిక లోకంలో లేడనే నిర్ధారణకు వచ్చేశావన్నమాట" అంటూ పక్కకి తిరిగి పడుకున్నాడు భర్త.

**తా**ను కొత్తగా కనుక్కున్న టెలివిజన్ టెక్నాలజీ గురించి పబ్లిసిటీ కావాలని అడిగేందుకు ఒక పత్రిక ఆఫీసుకు వెళ్ళి పై అంతస్తులో వున్న సంపాదకుడికి తాను వచ్చిన విషయం చెప్పాడు లోగీ బెయిర్డ్.

అది విన్న ఎడిటర్ ఒక రిపోర్టర్‌ని పిలిచి "కింద వాడెవడో వైర్‌లెస్‌లో బొమ్మలు పంపుతానంటున్నాడు. పిచ్చివాడిలా వున్నాడు... వాడి దగ్గర బ్లేడ్ అదీ వుంటుందేమో జాగ్రత్త... అన్నీ చూసి మెడపెట్టి గెంటెయ్ బయటకు" అని చెప్పి పంపాడు.

**ఒ**కసారి ఎడిసన్ ల్యాబ్‌లో అగ్నిప్రమాదం జరిగింది. విలువైన వస్తువులన్నీ కాలి బూడిదయ్యాయని చాలామంది ఓదారుస్తుంటే "ఏడుపెందుకు... వాటితోపాటు నా వైఫల్యాలకు సాక్ష్యం లేకుండా పోయింది కదా..." అంటూ చమత్కరించాడు.

"**ఏ**మిట్రా గుర్నాథం సైకిల్‌ని అలా నేలమీద పడేసి కసిగా తొక్కుతున్నావు" "అదా...బరువు తగ్గటానికి డాక్టర్ రోజూ సైకిల్ తొక్కమన్నాడురా..."

**పా**లు తాగమని ఇస్తే 'నాకు కాఫీ కావాల'ని గోల చేస్తున్నాడు మూడేళ్ళ ఆద్విక్.

"నువ్వు చక్కా పాలు తాగితే నీకు ఆడుకోవటానికి ఒక తమ్ముడు తోడుగా వస్తాడు" అంది తల్లి. "నాకు తమ్ముడు వద్దు... చెల్లెలు కావాలి. అందుకే పాలు వద్దు"అంటూ వెళ్ళిపోయాడు మూడేళ్ళబుడతడు.

"**నే**నంటే ఎందుకే అంత ఇష్టం" అడిగాడు తన మనమరాలిని. "నీ దగ్గర బోలెడంత ఆస్తి వుందని చెప్పింది అమ్మ, అందుకే" అంది మనుమరాలు తాత చంకన ఎక్కి.

విజయాన్ని ప్రేమించాలి - విజయగర్వాన్ని విడనాడాలి.

SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS
AUTONAGAR VIJAYAWADA RNI 38008 / 1984 REGD NO.VJ / 025 / 2018-20






Google play
Download the Android App 'Supreme Furniture' from Google Play Store.

App Store
Download the ios App 'Supreme Furniture' from App Store.

Srinivasa Marketing, Hyderabad : 95810 00481, Sunil Enterprises, Secunderabad : 98480 22445, Mahalakshmi Enterprises, Warangal : 90529 68518, Sri Varadha Enterprises, Khammam : 99661 24166, San Furnitures, Mahabubnagar : 98854 23637, Sri Balaji Furniture, Karimnagar : 96667 27333, Sri Sarojini Agencies, Nalgonda : 90596 05486, My Godway, Vijayawada : 98494 52666, Tejasri Agencies, Visakhapatnam : 99087 11222, Amma Furnitures Mall, Nellore : 83418 70707, Mahalakshmi Furniture Palace, Ananthpur : 94920 56777, GP Office Needs, Guntur : 93951 50255, Royal Wood Furniture, Guntur : 94941 51947, Sri Venkateswara Emporium, Tanuku : 98496 48366, Furniture World, Tirupathi : 99498 56979, Sri Ramaiah Furniture, Kadapa : 94402 28876, Tatavarthy Harigopal Rao & Son's, Bhimavaram : 98498 33199, Sudharshan Furniture, Bhimavaram : 98857 07399, Tirumala Furniture Showroom, Palakollu : 98857 60666, Tirumala Furnitures & Computers, Nandyala : 98495 44802, The Vikrant Furnitures, Eluru : 99485 88999, M/s Wood Land Seating Systems, Visakhapatnam : 99490 59949, Aditya Decors, Srikakulam : 94407 59437, Life Style Furniture, Vizianagaram : 94401 92658, Sri Lakshmi Jyothika Enterprises, Rajahmundry : 94946 59397.

Follow Us Watch Us Supreme-Furniture.com

Visit @ www.Supreme.co.in

Supreme Sales Office & Team, HYDERABAD : 99481 15559, 91775 56769, 81251 25251 WARANGAL : 98494 31443
VIJAYAWADA : 84988 26789 / 98486 26956 VISAKHAPATNAM : 99483 45552